# ఆంధ్రగ్రంథమాల, పోస్టుబాక్సు 212, మదరాసు.

**అళియరామభూపాలుడు:** టి. శివశంకరముగారు రచించినది. విజయనగరపు రాజగు అళియరామరాయల సమగ్రజీవితచరిత్ర. త్రివర్ణ, ద్వివర్ణ, ఏకవర్ణ చిత్రములతో సర్వాంగసుందరముగా ప్రకటితమైన చరిత్ర గ్రంథము. వెల 1-0-0.

**ఆత్మకథ:** నేటికాలమునకు యుగపురుషుడుగా పరిగణింపబడుచున్న గాంధీ మహాత్మునియొక్క సమగ్రజీవిత చరిత్ర ఇది. ఈ చరిత్రను మహాత్ముడే స్వయముగా వ్రాసియున్నాడు. శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు దానిని సరళమైన శైలిలో ఆంధ్రీకరించియున్నారు. (రెండు సంపుటములు).

వెల 1-12-0.

**జీర్ణవిజయనగర చరిత్ర:** కుందూరు ఈశ్వరదత్తుగారు రచించినది. కృష్ణదేవరాయల రాజధానియైన హంపీ విజయనగరముయొక్క ప్రాచీన వైభవమును కన్నులకు కట్టినట్లు వివరించుచున్న చారిత్రక గ్రంథము అనేకచిత్రములతో సంకలితమైనది. వెల 1-0-0.

**శ్రీరామవిజయము:** ఇదికూడ ఒక నాటకము. రామాయణగాథ రమణీయముగా కూర్చబడియున్నది. వెల 0-8-0.

**కాంగ్రెసు చరిత్ర:** అఖిల భారత కాంగ్రెసు పుట్టిననాటి నిన్నమొన్నటిదనుక — ఏబదియేండ్ల కాలము గావించిన సంరంభ మంతయు విపులముగా ఈ గ్రంథమునందు విశదీకరింపబడియున్నది. కాంగ్రెసు నాయకుల ఉద్బోధలుకూడ సమయోచితముగా ఇందు చేర్చబడియున్నవి. సుప్రసిద్ధ ఆంధ్రనాయకులైన భోగరాజు డా. పట్టాభి సీతారామయ్యగారు దీనిని రచించినారు. కాంగ్రెసువాది యనుకొను ప్రతివ్యక్తియు చదివితీరవలసిన గ్రంథము. ఖద్దరుగుడ్డబైండు. వేయిపుటలు.

వెల 2-8-0.

**తంజాపురాంధ్రనాయక రాజచరిత్ర:** కురుగంటి సీతారామయ్యగారు రచించినది. తంజావూరును పరిపాలించిన ఆంధ్రనాయకరాజుల చరిత్రోదంతములు యుక్తియుక్తములైన ఆధారములతో సవిస్తరముగా వివరింపబడియున్నవి. అనేక చిత్రపటములు గలవు.

వెల 1-0-0.

**ఆంధ్రవాఙ్మయ సూచిక:** 1927-వ సంవత్సరము వరకును ముద్రితములైనట్టియు, అముద్రితములై వివిధ భాండాగారములం దున్నట్టియు ఆంధ్రగ్రంథముల పట్టిక. వెల 1-0-0.

# భారతి—అష్టాదశ సంపుటము. భా—౨

## వ్యాసముల అకారాది సూచి

---





పడవల రేవు

చిత్రకారుడు : శ్రీ రణవీర సాక్సెనా.




సంపుటము 18
సంచిక 7

భారతి

వృష. ఆషాఢము
జూలై 1941


# పారిజాతాపహరణము

= శ్రీ డా. చిలుకూరి నారాయణరావు =

భాగవతము, దశమస్కంధము, ౫౯ వ అధ్యాయములో—

"చోదితో భార్యయోత్పాట్య పారిజాతం, గరుత్మతి
ఆరోప్య, సేంద్రాన్ విబుధా న్నిర్జిత్యోపానయ త్పురమ్;
స్థాపితం సత్యభామాయా గృహోద్యానోపశోభనం,
అన్వగుర్భ్రమరాస్స్వర్గా ద్యద్గంధాసవలంపటాః.

యయాచ ఆనమ్య కిరీటకోటిభిః
పాదౌ స్పృశ న్నచ్యుత మర్థసాధనమ్,
సిద్ధార్థ ఏతేన విగృహ్యతే మహా
నహో సురాణాం చ తమోధిగాఢ్యతామ్"

అనే మూడుశ్లోకము లున్నవి. మారుమూలలో పడి ఉన్న ఈ మూడుశ్లోకాలలోను ఒక కళావంతమగు సత్ప్రబంధమునకు బీజ మున్న దని గుర్తించిన మొదటి మేధాశాలి, కళావిశారదుడు నంది తిమ్మన.

తిమ్మన అపరకృష్ణుడయిన నరసరాయలకృష్ణుని ఆస్థానములో వెలగినాడు కాబట్టి ఆకథ అతనికి నచ్చిన దని చెప్పవచ్చును. కృష్ణుడు, తిరుమలదేవి, చిన్నాదేవి,—కృష్ణుడు, రుక్మిణి, సత్య;—సరిపోయి నవి. ఇక నారదునికి ప్రతి యెవరు? తిమ్మన్న. నారదుడు చేసినపని తిమ్మన్నపనియేకదా! మరి ఇంద్రుడో?- పారిజాతమో? మనకు తెలియదు; ఆవృత్తాంతము కాలగర్భములో నిద్రపోతున్నది. చారిత్రకపరిశోధకు లెవరైనా దానిని కనుగొని లేవగొట్టాలి. రుక్మిణిచేసిన పుణ్యకవ్రతమునకుమాత్రము చిన్నాదేవి కృష్ణరాయల చేత చేయించిన తులాపురుషదానములు మూలము లని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఆదానములలో ఒక సంపూర్ణదానమును కృష్ణరాయలతోగూడా తిమ్మన్న పరిగ్రహించి ఉంటాడు.

తిమ్మన్న తరువాత పారిజాతకథను ప్రబంధముగా రచించడానికి మరెవ్వరున్ను సాహసించలేదు; అతనికి ముందట్లు చేయవచ్చునని కాని, చేయవలెనని కాని ఎవ్వరి కిన్నీ తోచనూలేదు. ఆకథలోని అందమును తరువాతి కాలములో గ్రహించినవారు దాక్షిణాత్యాంధ్రకవులు; తంజావూరు, మధుర, పుదుకోట ప్రాంతములవారు. వారయినా దానిని యక్షగానముగా సవరించినారు కాని ప్రబంధముగా కాదు. చల్లా నారాయణకవి, పురుజాల (బురిజల) లక్ష్మీనారాయణకవి, చెంగల్వరాయడు అనేవారాకథను దృశ్యకావ్యభేద మయిన యక్షగానభక్కిలో ప్రకటించి శ్రవణనయనోత్సవముల నేకకాలములో సమకూర్చినారు.

యక్షపారిజాతగీతములతో మన కిప్పుడు పని లేదు. నంది తిమ్మన్న చేసిన పారిజాతాపహరణమును

గురించి ప్రస్తావింతాము. తిమ్మన్న మాంచి లౌక్యుడు; ఆర్వేల నియోగిబిడ్డడు. కృష్ణరాయని రాజ్యములో మంచిపలుకుబడి సంపాదించుకొన్నాడు; మాన్యాలు కూడా సంపాదించుకొన్నాడు; సంపాదించుకొన్న దానిలో ఇతరులకు ఇచ్చిన వదాన్యుడు కూడాను. కృష్ణరాయానంతరము అచ్యుతరాయని కాలములో శ్రీమన్మహామండలేశ్వర శ్రీ రాజు చిన తిరుమల రాజు మహారాజుల కార్యకర్తగా ఉండి, నెల్లూరు జిల్లా, నెల్లూరు తాలూకా, కొమ్మరపూడి గ్రామమును శక ౧౪౭౭ (క్రీ. శ. ౧౫౫౫) సం.ము ఉత్థాన ద్వాదశినాడు శ్రీ వేదాద్రి నరసింహస్వామికి దానము చేసినాడు. ఆగ్రామాని కావాడు కొమారపూడి అని పే రుండేది. అది ఉదయగిరిరాజ్యములోని, పాకనాటిలోని ప్రభాకరపట్నంసీమలో ఉండేది. ఒకవేళ అతడు నెల్లూరుజిల్లావాడేమో. తిమ్మన్న కడపజిల్లా, బద్వేలు తాలూకా, కత్తెరగుంట్లగ్రామముమీది పన్నును శ్రీ సదాశివరాయల అనుమతిమీద శక ౧౪౭౮ (క్రీ. శ. ౧౫౫౬) సం.ములో తొలగించినాడు.

తాను నంది సింగయామాత్య పుత్త్రు తిమ్మయ నామధేయుడ నని చెప్పుకొన్నా, అతనికి ముక్కుతిమ్మన్న అనేపేరు లోకములో స్థిరపడినది. రామరాజభూషణుడు తిమ్మన్నవద్ద ధనమువకు కొని తన వసు చరిత్రములో చేర్చుకొన్న "నానాసూనవితాన వాసనల" అనే 'ముక్కు' పద్యమునుబట్టి అతని కా ఉపపదము తగులుకొన్నదని కొందరున్ను, అతనికి పెద్ద ముక్కుండడముచేత అట్టివాడుక కలిగినదని కొంద రున్ను అంటారు. కాని, ఈ రెండున్ను తరువాతివారి కల్పనలే అయి ఉంటవి. "నానాసూన" పద్యమును రామరాజభూషణుడు రచించలేనంతటి అశక్తుడున్ను కాడు, అంతటి చక్కనిపద్యమును తిమ్మన్న తన గ్రంథములో ఉంచుకొనక ఒకరి కమ్ముకొనే అవివేకిన్ని కాడు. 'ముక్కు' అనేది తద్భవపదము; అది "ముఖ, ముఖ్య" అనే పదములు రెంటిలోనుంచిన్ని పుట్ట వచ్చును. నాసికార్థకమయిన 'ముక్కు' ముఖశబ్ద భవము. తిమ్మన్న యింటిపేరయిన 'ముక్కు' ముఖ్య శబ్దభవము. ముఖ్యు డంటే ప్రధానుడు, మంత్రి అని అర్థము. నియోగికావడమే కాకుండా, మంత్రిత్వమును కూడా సంపాదించి ఉండడముచేత అతడా ఉపపద ముతో వ్యవహరింపబడి ఉంటాడని నాఅభిప్రాయము. ఇప్పుడుకూడా 'ముక్కు'వారనే యింటివారున్నారు. ఆయింటిపేరివారిలో అందరికిన్ని పెద్దముక్కులు లేవు. కొందరికి చప్పిడిముక్కులున్నా ఉండవచ్చును.

కవిత్వవిచారములో ముక్కులగొడవ ఎందుకు? అయితే, పెట్టుకొన్నారు విమర్శకులు; నేనుకూడా 'ముక్కు' పట్టుకోకపోతే కొందరికి సంతోష ముండదు. కాని, "ముక్కు తిమ్మనార్యు"డనే పేరు లేకపోతే 'ముద్దుపలుకు' అనే మాటకూడా పుట్టిఉండదు. నిజ ముగా తిమ్మన్నది ముద్దుపలుకే. అతని కృతిభర్త ముద్దుకృష్ణరాయడు, కృతినాయకుడు ముద్దుకృష్ణుడు; రుక్మిణి ముద్దులాడి, సత్య ముద్దులకొలికి; తుదకు నార దుడు కూడా ముద్దులాడే. తిమ్మన్న కవితతో నవ్వితే ముద్దు; ఏడిస్తే ముద్దు; అలిగితే ముద్దు; రౌద్రకోపము వచ్చినా ముద్దే; ప్రియురాలిపాదాలమీద పడితే ముద్దు; పాదహతిపొందినా ముద్దే. ఇంద్రుడు వజ్రాయుధము పట్టుకొనికూడా ఎంతముద్దుగా ఉన్నాడు! ముదుసలి తొక్కు అదితి- ఎంతముద్దుగా ఉన్నది! ఎంతముద్దుగా మాట్లాడినది! తిమ్మన సృష్టిచేసిన పర్వతభేదివజ్రాయుధ మును విసురుతే కృష్ణునిచేతిలో పువ్వుచెండువలె పట్టు పడినది. వరసవిభుకృష్ణరాయభూనాథచంద్రుచేత నని లోన మించు కాశ్మేయకము —

> "బాహుబాహ్యక్రీడఁ బరగు పంటవలంతి
> తొయ్యలి నిడుద కస్తూరిబొట్టు,
> అరికుంభికుంభ ముక్తాకురాంకితము గు
> జయరమాకన్యక చదువుపలక,
> శత్రురాజులకు నచ్చరల నాకర్షించు
> సమరేంద్రజాల పింఛంపుఁగుంచె
> మేనుసగము యశోమహోశానునకును
> శౌర్యరవి గోరివచ్చిన చాయలేమ"—

పాపము! కృష్ణరాయ డిట్టి కాశ్మేయకమును ధరించి ఏమియుద్ధాలు చేసినాడో, ఏమివిజయములు గాంచినాడో కృష్ణునికే యెరుక. అయినా, అట్లనుకో గూడదు. ఆనాటి కుసుమకోమలుల పౌరుషమునకు

సత్య ప్రత్యక్షనిదర్శనముగదా! ఆనాటి ఖడ్గములు తిమ్మన వర్ణించినవంటివే ఐనా, చాలా పనిచేసి ఉంటవి.

ఒక పారిజాతపుపువ్వు ఎంతపని చేసినది? పారిజాతపుచెట్టు ఏమీ అంతే అందమయినది కాదు. దాని పువ్వులకోసమే దానిని పెంచుకొంటాము. పువ్వులేమో చాలా పరిమళముగలవే. చెట్టు విరియబోసి పూస్తే, చక్కనివెన్నెల కాస్తూఉంటే, పిల్లగాలులు వీస్తూఉంటే, మైళ్లదూరము వ్యాపిస్తుంది ఆ పరిమళము. అది భోగులకు, భోగినులకు ఆలంబముగా ఉపకరిస్తుంది. అబుద్ధేక్షుధనుర్వ్యాపారులను కూడా పారిజాతకుసుమపరిమళము కుసుమశరాయుధుని పిల్లచేష్టలకు గురిచేస్తుంది.

కాని, ఆ పువ్వు చాలా కోమలమైనది; అంటితే కందిపోతుంది; మందశ్వాసముచేతనే తొడిమనుంచి రాలిపోతుంది. అందులో అహల్యాప్రియుని నందనవనములోని పారిజాతము కోమలత్వము, అందము, పరిమళము మాట చెప్పవలెనా? అందుచేతనే నారదుడాపువ్వును, ఏనాడో పూచినదానినిగాక 'క్రొన్నన, "మిన్నేటి పసిండి నెత్తమ్మి చిగురుటాకునం బొదివి" తెచ్చి, అట్లే ఆ ఆకులోనుంచి తీయకుండగనే కృష్ణుని కందిచ్చినాడు.

ఎందుచేతనో యిప్పటివారు పారిజాతకుసుమములను కొప్పులలో తురుముకొనరు; హారములు కట్టి కంఠములలో ధరించరు. మల్లెలు, జాజులు, గులాబీలు ఇప్పటివారి కిష్టము. ఆ పువ్వులు ధారణయోగ్యములు కావనికాదు. కాని, 'ఫేషను' మారిపోతూఉంటుంది. మన గుణములు, మన నాగరికత ననుసరించి, మన కాయా పువ్వులమీద మక్కువకూడా మారుతుంది. పారిజాతపుష్పధారణమునకుమాత్రము రుక్మిణులు, సత్యభాములును, తమ ప్రియులచేత పాదహతినొంది, ఆ పువ్వులను తెచ్చి యివ్వడమునకు మోహనకృష్ణులును కావలెనని తిమ్మన అభిప్రాయము. అట్టివారిప్పుడు లేకపోవడముచేతనే పారిజాతములకు 'గిరాకీ' తగ్గి ఉంటుంది.

నారదుడు కృష్ణుని కిచ్చిన, కృష్ణుడు రుక్మిణి కిచ్చిన పువ్వట — "లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు నుజ్జ్వల దీపాంకుర" మౌతుందట! " రతిశ్రమతనూసంజాతధారాళఘర్మలవంబుల్ దోఁగింపఁగా సురటియై రంకిల్లు" తుందట! నారదునికీ లేకపోయింది, నారదునిచేత చెప్పించిన తిమ్మన్నకీ లేకపోయింది విడియము. అందులో మగనిముందర, — చెలికత్తెలముందర! అయితే కృష్ణునివద్ద నారదునికి చనవెక్కువ; అందులో జితేంద్రియుడు. కృష్ణరాయలవద్ద తిమ్మన్నకు చనవెక్కువ; అందులో అతడు ముద్దు తిమ్మన్న; అరణపుకవి; పట్టమహిషిగారి మనిషి. ఆకృష్ణునూ, ఈకృష్ణునూ ఆమాట విని సిగ్గుతో కూడిన మందహాసము చేసి ఉంటారు. రుక్మిణి మాత్రము ఏమీ ఎరగని నంగనాచివలె చల్లగా ఊరకొన్నది. ఇంతకున్నూ ఏమి తప్పయూటగనుక? కొందరు కవులు పలికినట్లు తిమ్మన్న నిండోలగములో ఆ మాటలను పలికించలేదు. రుక్మిణీకాంతగృహములో, శశికాంతశిలామయవేదిమీద, కొందరు (మాత్రము) మృగాయతనేత్రలు కొలుస్తూఉండగా, జూద మత్యంతవినోదకేళిమెయి నాడుతూన్నప్పుడు, చల్లచల్లగా, మెల్లమెల్లగా, వినీవినబడనట్లు గుసగుసగా ఆమాటలనడానికి నారదునికి హక్కులేదా? ఇనుపకచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులతో మన కేమిపని—ముందుకు సాగుదాము.

ఆ కుసుమరాజము — పరిమళము చెడదు; వాడదు; పరువము దప్పదు; పరాగభరభరితంబై నిరతము జగదేకమనోహరమై ఉంటుంది. దానికి వేసవిలో చలువచేసేగుణము, చలివేళలో వేడికలిగించే గుణము. అది సర్వగుణభవ్యము. ఆపువ్వును రుక్మిణి తన నెఱిగొప్పున చెరివితే ఆమెకు "వలిగుబ్బలి ముద్దుఁబట్టి లేఁత నెల ధరించిన" ట్లమరినది. అంతేనా?

"మగమీల నగఁజాలు తెగఁగీలుకొను వాలుఁ
గనుఁగవ కొక వింత కాంతి యొదవె;
వలిజక్కవల పెక్కువలు దక్కవగ నిక్కు
చనదోయి కొకవింత చాయ దోఁచె;
నెలతుమ్మెదల దిమ్ము వెలిఁజిమ్ము చెలువమ్ము
గల వేణి కొకవింత నలువుమీఱె;
నలచెందొవలవిందు చెలువొందు నెసఁ జెందు
మొగమున కొకవింత జిగి దొలంకెఁ

చక్కఁదనమున కొకవింత చక్కఁదనము,
జవ్వనంబున కొకవింత జవ్వనంబు,
విభ్రమంబున కొకవింత విభ్రమంబు
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి."

తిమ్మన్న చెప్పిన యీమాటను నమ్మి ఆంధ్ర యువతీమణులు ఇంటింట నొక్క పారిజాతవృక్షము నైనా తెచ్చి నాటినంతవరకును తమ భర్తలకు నిద్ర పట్టనీయకుందురుగాక! పారిజాతపుష్పాలంకృత ధమ్మిల్లధరలై రుక్మిణివలె పులుగడిగిన ముత్తియముల పోలుపొందుదురుగాక!

పారిజాతపుష్పముమాట కేమిగాని, దానిని నారదుడు—ఆరివేర పుదపసి, పోరాగిరపు జడతాల్పు, కలహాశనుడు—తన పన్నాగమున ఉపయోగించుకొన్న తీరులో ఉన్నది తిమ్మనకవిత్వపు పసందంతా. ఆకయ్యాలకోరుడు "సరిగమపధనిస సంజ్ఞ సర్వంబుల మహతి నభోవాయువిహతి" మొరయ గగనమునుండి దిగినాడు. ఎక్కడకు? రుక్మిణి అంతఃపురములోనికి. సమయము? రుక్మిణీకృష్ణులు జూదమాడుతూఉన్నవేళ. మరెవ్వరున్ను లేరు కొందరు చెలికత్తెలు తప్ప.

కృష్ణుడు బహుభార్యకుడని నారదునికి తెలుసును. అతని దక్షిణనాయకత్వమును దయ్యమెరుగును గాని, బహుభార్యాత్వములోని చిక్కులు కృష్ణుని కనుభవముమీద తెలుసును. నారదునికి ప్రత్యక్షముగా చూచి తెలుసును. కృష్ణునికి "సమతాభిమానవతులు మహిషులెనమండ్రు" ఉంటూఉండగా "హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రుని యింటనున్న అచ్చరలకోలంబు వారిని, ఎలజవ్వనముం బొలిపోనివారిని, తన్వరువిగఁ గోరువారిని, లలనామణులను" — ఒకరినీ యిద్దరినీ కాదు, పదివేలమందిని — సౌఖ్యరసైకలోలుడై ఈ నారదుని పంపుననే పరిణయమైనాడు. ఈ పదివేల మందిన్ని అష్టమహిషుల ఆధిక్యమున కంగీకరించినారు గనుక కొంత మేలయినదిగాని, వారున్ను 'సమతాభిమానవతులే' అయిఉంటే ఆగొల్లపిల్లవానికి గలిగే అల్లరిమాట అడుగవలెనా? ఈ అష్టమహిషులలోను రుక్మిణికిన్ని, సాత్రాజితికిన్ని భర్త ఎక్కువ చనవు లిచ్చినాడు. వీరిద్దరున్ను ఎవరికి వారు "సలలితరూపమున్ మగని సౌరిమియుం గలదాన" నని విర్రవీగుతున్నారు. క్షేత్రము బాగున్నది కలహబీజారోపణమునకు. సమయముకూడా బాగున్నది.

పుష్పమును తెచ్చినవాడు అది స్త్రీధారణయోగ్యమని తెలిసిన్ని, ప్రక్కను పట్టమహిషి రుక్మిణి ఉన్నదని తెలిసిన్ని, దాని నామెకే యివ్వక కృష్ణుని చేతి కెందు కందించవలెను? కృష్ణుడు గొప్ప చిక్కులో పడ్డాడు. "ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో మది సాత్రాజితి? — దానికే నిపుడు ప్రేమం బంపినన్ దీని సెల్లిదముం జేసిన జాడ కోచునొకా!" అని తటపటాయిస్తూ ఉండడము చూచినాడు నారదుడు; కృష్ణునికి రుక్మిణివంక కన్నుసన్న చేసినాడు. కృష్ణుడు తా నేమిచేయబోతున్నాడో, దానివల్ల గలిగే ఫలిత మేమిటో ఆలోచించుకొనడానికయినా అవకాశము లేకపోయినది. "బోలెమ్మ. ఇందు నే నున్నెక్కఁ జెల్లకునో యేరికిఁ బంపఁగా" అని మనసులో అనుకొంటూ అవశుడై రుక్మిణీకాంత కిచ్చివేసినాడు.

పాపము! నారదుని కేమి తెలుసును? మర్యాదకోసమని పుష్ప మిచ్చినాడు. ప్రేమతో దానిని కృష్ణుడు తన ప్రేయసి కిచ్చినాడు. ఇందులో నారదుని తప్పేమున్నది? నంగనాచి, ఉత్తఅమాయకుడు, నోటిలో వ్రేలుపెట్టితే కరవలేడు. పోనీ, కృష్ణుడు రుక్మిణి కాకుసుమము నిస్తే ఇచ్చినాడుగాని, తాను పెద్దదిగదా, సత్య చిన్నదిగదా, ఆమెమీదకూడా భర్తకు సమానమైన ప్రేమ ఉన్నదని తనకు తెలుసును గదా, ఉన్న పుష్ప మొక్కటే అని ఎరుగునుగదా, తాను నారదుని ప్రార్థించి మరొక్కపుష్పమును తెప్పించుకొని కొప్పులో మరెప్పుడయినా పెట్టుకో వచ్చునుగదా,—సత్యభామకు దానిని పంపించి ఉంటే ఎంత బాగుండేది! తనమీద సత్యభామ కెంతటి గౌరవము నిలిచిఉండేది! నారదు డూరకొనిఉంటే, ఆరీతిగానే చేసిఉండేదేమో. కాని, రుక్మిణి అహంకారపిశాచానికి ధూపమువేసినాడా జగడాలమారి. "జలజాక్షీ! ఇది పారిజాతప్రసూనంబు. నరులకు ధరియింప నరిది. పౌలోమి, పార్వతి, పద్మ, పద్మజరాణియు

శిరంబునఁ దాల్తు రనుదినంబు; నీవు హరిబహిఃప్రాణమ వనేమాట అతడు నీకు దీని నివ్వ డివ్వడమువల్ల స్పష్ట మైనది. నీవు దాల్చిన కతన నీపూవు నేఁడు భాగ్యము వహించె.

"కువలయపత్త్రనేత్ర! సెజ్జెకొప్పున నీకుసుమంబు దాల్చుటన్, సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింపఁగా, ధవుఁ డెఱలేని కూర్మి జవదాఁటక నీపలు కాదరింపఁగా, అవిరళభోగభాగ్యమహిమాన్వితవై విహరింతుగావుతన్. అలరుంబోఁడుల లోపల నలరుంబోఁడుములు నీకు నగ్గలమగుచున్, తలపూవాడకయుండును తలపూవు ధరించి.

"ఇన్నాళ్లన్న నే ననుకొనేవాడనుగదా సవతులందరిలోను కృష్ణుడు సత్యభామకనుసన్నలలో మెలగుతాడని. ఇప్పుడు తెలిసినది నాకు అతనికి నీమీద గల గౌరవ మింతటిదని.

"వికచతామరసాక్షీ! కృష్ణుని పట్టపుదేవీ! ఆసత్య ఉన్నదే—చక్కనిదాన నంచు, ఎలజవ్వని నంచు, జగంబులోనఁ జేరెక్కినదాననంచు, పతియెంతయు నాకనురక్తుఁడంచు,—విన్నావా రుక్మిణీ! ఆమె—నిక్కుచు, విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల. ఇప్పు డయినదిలే ఆమెకు తగిన పరాభవము. ఇంతకున్ స్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్."

అన్నాడు. ఆకలహప్రియునికి తెలుసును అక్కడ నున్నవారిలో సత్యచెలికత్తె లున్నారని. వారిని రేపెట్టినాడు. తన పన్నాగము పారినదని నిశ్చయము చేసుకున్నాడు.

తరువాత చెలికత్తెలు పోయి జరిగిన వృత్తాంతమును సత్యాదేవికి తెలిపినారు. పాపము! కృష్ణమూర్తి వారు పడవలసినపాట్లు పడ్డారు. "ఒక్కపూవుకోస మింత కోప మెందుకు? ఇంద్రుని వనములోని పారిజాతమునే తెచ్చి నీపెరటిలో నిలుపుతానులే"అని సమాధానపరిచినాడు ఆ అభిమానవతిని. ఆసమయ మెట్లా తెలిసినదో నారదులవారికి—తిరిగీ ఇక్కడ ప్రత్యక్షం! అక్కడ రుక్మిణి నట్లు దీవించిన ఆనోటితోనే జంకూగొంకూ లేకుండా సత్యభామతో ఏరీతిగా అంటాడో చూడండి!—

"పతి నీపై విహరింపఁగా, జనము సం
భావింపఁగా, బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా, సవతికాం
తల్ చూచి లజ్జింపఁగా,
అతుల ప్రాభవవైభవోన్నతుల ప్రో
వై, ఇట్లు వర్తించు నీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే
నే మిచ్చెదన్ మానినీ!

'మానినీ' అట! తక్కినమాటలన్నీ ఒకఎత్తు, ఈ ఒక్కమాటా ఒకఎత్తు. ఎంతటుక్కరి! 'సాత్రాజితీ!'—అని సంబోధించినాడు, ఆమెవంశగౌరవమును స్మరణకుతెచ్చినాడు. "సత్యా! నీ సౌభాగ్య మింతంతయే? సూనఁ బోలంగల రబ్జగంధు లన వింటే రెయుంకు? నిన్నుఁ బాసి నీపతి అనిక్కైవం జనునో? ప్రాణంబు ప్రాణంబుగా నిన్ను మన్నింపఁడో! నీ మనోరథముల నన్యాయ్యంబులోఁ జేయఁడో? చనవుల్ నీవలె నెవ్వరేఁ గనిరో?

నా దీవన నీకక్కరలేదు; నా దీవనవల్ల నీకు కలుగబోయే శుభములను నీ వింతకుముందే పొంది యున్నావు. అయినా దీవిస్తాను, విను—నీకు మగఁడు కోరిన కోర్కుల్ ఘటియించుఁగాక తా నెంతటి కార్యంబైన డించి నా దీవనలఁట!"

అన్నాడు. శౌరిని జూచి, "దనుజాంతక! పోయి వచ్చెదను. మఱువకుమీ నను!" అని పలికినాడు. "దనుజాలను చంపినవాడవు, దనుజత్రాసితుడైన యింద్రుని భయపెట్టి పారిజాతమును తేవడము నీకెంతటిపని" అని ధ్వని. "మఱువకుమీ నను!" ఎవరు మరవగల రీజాట్లు ముళ్లువేసి జగడాలు కల్పించే అయ్యను? "నిన్నుఁబాసి నీపతి అనిక్కైనం జనునో!" మంత్రము పారినది. కృష్ణుడు యుద్ధానికి పోతాడు, సత్య అతనివెంటనే పోతుంది. ఎవరు తప్పించగలరు?

కృష్ణుడు పారిజాతమును తెచ్చినాడు. నారదుడు మళ్లీ ప్రత్యక్ష మైనాడు. సత్యభామ కభివాదను చేసినాడు:

"హేమనిభగాత్రి! నీభాగ్య మేమి చెప్ప
కల్పభూజంబు నీపెట్టు చెట్టుఁజేసి
సవతులనఁ గాదు త్రిభువనేశ్వరి యనంగఁ
బొలుచు పౌలోమి గెలిచితి వలఘుమహిమ."

ఈమాట నిజముగా అతని నాలుకకొననుంచి వచ్చినది కాదు, కడుపులోనుంచి వచ్చినదే. కాని, కొంచెము తమాషా చేయవలెను. సత్యగర్వమును తగ్గించవలెను. కృష్ణుని పరాధీనత నాతనికి తెలియజేయవలెను.

దానికోసమే పుణ్యకవ్రత ప్రస్తావన. ఇది తిమ్మన్న కల్పించినదా? ధర్మశాస్త్రాలలో ఎక్కడ నయినా ఉన్నదా? ఉన్నా, లేకపోయినా, సరిపడని భర్తలుగల భార్యలకు చాలా ఉపయోగకరమైన దీ వ్రతము. ఈర్ష్యాసూయా మాత్సర్యభూయిష్ఠలగు గయ్యాళులను సాదు చేయడానికికూడా ఇది పనికివస్తుంది. ఆ వ్రతవిధానమునకు సత్యభామ అంగీకరించడము మాత్ర మాశ్చర్యమును కలిగిస్తున్నది. సత్యభామవంటిది "తొంటి తనకోపము, గర్వము, మత్సరంబు మాని, వినయము ప్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబునన్ సవతుల యిండ్లకెల్లఁ దొలునాఁడు క్రమంబున నేఁగి తద్వ్రతోత్సవమున కామతించి యతిసంభ్రమలీలలఁ దోడితే" వలెనట. తనకోసము కష్టపడి, యుద్ధముచేసి, తనముద్దుతీర్చి, తన్నుగొప్పచేసిన ముద్దులమగనిని, దేనికోస మింత కష్టపడవలసివచ్చినదో, దేనిని తేవడము వల్ల తన కంతటిగౌరవము కలిగినదో ఆపారిజాత వృక్షముతోగూడా, సదక్షిణాకముగా నారదునివంటి బ్రాహ్మణునికి—నారదునికే—దానము చేయవలెను. పారిజాతవృక్షమును, ఇతర ధన కనక వస్తు వాహనాదులను నారదు డయినా ఏమయినా చేసుకోవచ్చును గాని, కృష్ణుని దానముగా తీసుకొని అతనితో ఏమి చేసుకొంటాడు? "నా సత్యను తే, నారుక్మిణిని తే, నాతక్కిన మహిషులను తే, నాపదారువేల ఇతర ప్రియురాండ్రను తే" అని కృష్ణుడు తన్ను బాధిస్తే? అందుకోసమే సత్య కృష్ణుని దానముచేసి "క్రమ్మఱఁ బతిం జేకొన"వలెనని కూడా వ్రతనియమము నేర్పాటు చేసినాడు.

దానము పోవడానికి కృష్ణ డొప్పుకొన్నాడు, కొంతకాలమయినా ఈ భార్యాలంపటత్వము తొలగిపోతుందేమో అని. సత్య అతనిని క్రొవ్విరులదండతో పారిజాతవృక్షమునకు బంధించినది.

"పరమముని మానసాలానబంధనముఁ
గుదురుపడకుండు యాదవకుంజరంబు
వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ
గమ్మఁ బూవులదండచేఁ గట్టఁబడియె."

నారదుడు దానముపట్టినాడు. కొంతసేపు కృష్ణుని చేత ఆడించినాడు.

"మేళవించినవి సుమీ! దీని మెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి,
మిన్నేటి జలము సుమీ! తొలంకెడు నని
డాచేత మణికమండలు వొసంగి,
యిది జపోచితము సుమీ! జతనం బని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి,
యీశానుఁ డిచ్చెఁ జుమీ! మాకు నిది యని
శార్దూలచర్మంబుఁ జంకఁ జొనిపి,
పొమ్ము పొమ్మని యొకకొంత పోవఁబోవ
రమ్ము రమ్మని మరలఁ జేరంగఁ బిలిచి,
కపటనటనాపరుం డైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులు గొనియె."

తిమ్మన కూర్చిన యీహాస్యకల్పన బాగానే ఉన్నది గాని, ఆపిల్లచేష్టలకు కృష్ణ డెట్లొప్పుకొన్నాడా అని సందేహము. అంతటితో కవి కృష్ణుని విడిచిపెట్టి చాలా మేలు చేసినాడు. సత్య తన ప్రియుని తిరిగీ నారదునుంచి తీసుకొన్నది.

సత్యాపాత్రము ప్రవేశిస్తున్నది. జోడుదివిటీ దీపముల నొకచోట చేర్చి గుగ్గిలము చల్లి భగ్గున మండజేసి దృష్టిదోషము కలుగకుండా చేయవలసినపని ఆమెను సృష్టిచేసిన తిమ్మన్నది. తెరతీసినాడు కవి; మన కన్నులు జిగ్గుమంటున్నవి. సౌందర్యవతి, మానవతి, మహనీయసౌభాగ్యవతి మనకన్నులయెదుట నున్నది. రంగము శృంగారవనము, దానిలో ఒకగిరి, ఆ గిరి పొంత దిద్దితీర్చిన పూదేనియయేటికాలువ, దానిదరి

పుష్పాల్లనించిన చంద్రోపలవేదిపై గూర్చున్నది భామ. ప్రక్క నామె చెలికత్తె ఉన్నది. ఇద్దరున్ను మాట్లాడు కొంటున్నారు. వనజాతాయతనేత్ర శౌరిగుణములను వాక్రుచ్చి వర్ణిస్తున్నది. అలికులరావములు, కీషల యూకుల కోకిలకౌకు కాకలీ కలకలనాదములు, కమ్మని తమ్మికొలంకు తెమ్మెరలు — ఇవేవీ ఆమెకు మునుపటివలె ఇంపునింపలేదు.

"సహీ వోయమ్మా!" అని పిలిచింది సత్య చెలికత్తెను.

"ఏమే ...?"

"శ్రీకృష్ణమూర్తివారు ఏమిచేస్తున్నారో చూచి రమ్మంటే పోయినచెలి యింకా రాలేదేమే ...!"

"వస్తుందమ్మా! ఓర్చుకోవే, మా యమ్మా!"

"సహీ వోయమ్మా!"

"ఏమే ?..."

"అయ్యో! చూడవే!"

"ఏమిటమ్మా చూచేది?"

"ఈ కుడిభుజము చూడవే!"

"చాలా అదరుతున్నదే, మాయమ్మా!"

"ఈ కుడిచూచుకము చూడవే!"

"అది కూడా ఎక్కువగా అదరుతున్నదే, మాయమ్మా!"

"ఓయమ్మా!"

"ఏమే ...?"

"ఈ కుడికన్ను చూడవే!"

"అయ్యో, ఎంత అదరుతున్నదే, ఓయమ్మా!"

"సహీ వోయమ్మా!"

"ఏమే ...?"

"నాప్రాణనాథుడే!"

"ఆయన కేమయినదే, మాయమ్మా?"

"మరి రేచపలాక్షిని కూడియున్నాడోనే? ఏమి ఒల్లని చెయ్దములు చేసినాడోనే!"

ఆయా మహిషుల చెలికత్తెలు తమతమ దేవేరులతో పారిజాతవృత్తాంత మంతా పోయి చెప్పినారు. "అందఱిలోనఁ బెద్ద, మహిమాన్విత; గావునఁ బువ్వు గోవిందుఁడు దానికిచ్చెఁ; దగవే" అని లక్షణ ఓర్చుకొన్నది; కాళింది సహించుకొన్నది; భద్ర శమించినది; సుదంత 'అవుతే' మ్మని ఊరడిల్లినది; జాంబవతి లోఁగుంకుట మానినది; మిత్రవింద కోప మడచుకొన్నది.

సత్యాదేవి చెలికత్తెకూడా తన దేవేరివద్దకు పరుగుపరుగున రోజుకొంటూ వచ్చినది. తనపుట్టి మునిగిపోయినట్లు పూస గ్రుచ్చినరీతిగా చెప్పినది. పురి ఎక్కించినది. ఆ పుష్పమును ధరించి రుక్మిణి సానఁబట్టిన మకరాంకునిశస్త్రమువలె ఉన్న దన్నది. గద్దెయమీద నెక్కి ముల్లోకమ్ము దాన యేలు గతి నున్న దన్నది. తల ఎక్కిపోతున్నది భామకు:

"నారదు డెంత కానివాడమ్మా!"

"ఏమిచేసినాడే?"

"కృష్ణమూర్తివారు వింటూ ఉంటే..."

"ఆఁ!"

"రుక్మిణి వింటూ ఉంటే..."

"ఆఁ...!"

"నేను వింటూ ఉంటే...!"

"ఏమన్నాడే?"

"నిన్ను గురించేనమ్మా!"

"నాపై రెత్తినాడటే? ఏమన్నాడో వేగముగా చెప్పవే!"

"'పతిఁగూర్చుదాన; నాయంతటివారు లేరు అని ఎప్పుడున్ను విర్రవీగుతూ నీతో పాటికివచ్చే సత్య గరువ మింక చెల్లదులే, రుక్మిణీదేవీ!' అన్నాడమ్మా."

"ఆఁ! ఆఁ! అట్లా అన్నాడటవే?"

"అవునే, మా యమ్మా! ఆ కయ్యాలపోతు టక్కరిమాటలూ, ఆరుక్మిణి నిక్కులూ, ఆ కృష్ణమూర్తివారి కేరింతలూ... ఏమని చెప్పేదునే, ఓ యమ్మా! నీవు మానినివే మాయమ్మా! ఎవరికి కోపము రాదే, ఓసమ్మా!"

ఆవేసరికి అయ్యో!—

"వ్రేటువడ్డ యురగాంగనయుంబలె, నేయి వోయ భ
గ్గన దరికొన్న భీషణ హుతాశన కీల యనంగ లేచి, హె
చ్చిన కనుదోయి కెంపు దన చెక్కులఁ గుంకుమ పత్త్ర
[భంగ సం
జనిత నవీన కాంతి వెదచల్లఁగ గద్గద భిన్నకంఠయై—"

తిమ్మన్న యీ సందర్భములో సృష్టిచేసి, రంగాని కెక్కించిన సత్యాపాత్ర మాంధ్రభాష. ఇంగ్లీషు, హిందీ ఇత్యాది భాషల ఒత్తిడిలో నలిగి నశించిపోక నిలిచి ఉన్నంతవరకు, ఆంధ్రునిలో ఆంధ్రత్వ మున్నంతవరకు, ఆంధ్రయువతులలో సత్యాత్వము మిగిలిఉన్నంతవరకు భరతశాస్త్రోక్తవృత్తి సంప్రదాయానుసారముగా, కన్నులకు మిరుమిట్లు గొలుపుతూ నర్తించగలదు. ఆమెమాటలు, తిమ్మన ఆమెనోట పలికించిన మాటలు తెనుగు తేనెసోనలలో, సత్యకాలి పైడియందెల రవళితో, ఆంధ్రసరస్వతీ వాహిని ప్రవహిస్తూఉన్నంతకాలమున్నూ అనంతకాల తరంగడోలికలపై తేలియాడుతూ సరసాంధ్రహృదయ ప్రేరితోహాసురభిళార్ద్రానిలసమారుతకిశోరములతో క్రీడిస్తూ నిలువగలవు. ఆమెమాటల నిక్కడ ఉదాహరించను; ఉదాహరిస్తే, పాఠకులు అసలుగ్రంథమును విప్పి చదువరు.

సత్యకు "మసకపుఁ బాముకాటుగతి మచ్చర మన్విష మగ్గలిం"చింది. ఆమె—

"జడవిడఁ గన్నుమూయుఁ; గను
విచ్చు; నగున్; దలయూఁచుఁ; బాన్పుపైఁ
బడు; నుసురంచు లేచుఁ; దడఁ
బాటును దత్తరమున్ జలంబులో
నడరఁగఁ గోపవేగమున
నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తిహస్తగత
పద్మినియుంబలె సొంపు పెంపఱన్"

ఆమె "ఘనసంతాపంబు పేర్మి నితరవ్యాపారము మాని" ఉన్నది.

కృష్ణు డక్కడ రుక్మిణికి పుష్పము నిచ్చినాడే కాని, గుండెలు గుభా గుభా మంటున్నవి. సత్యనగరికి రాకుండా ఉండలేకపోయినాడు. ఏమో! సత్య బోటి పోయి ఏమని చెప్పినదో! దొంగవలె చప్పుడు చేయకుండా ప్రవేశించినాడు. ఎక్కడా సందడిలేదు. సాత్రాజితి కోపగృహములో ఉన్నది. తలకు వాసెన కట్టి పరున్నది; చెలికత్తె సురటి పట్టుకొని విసరుతున్నది. మెల్లగా చేరి ఆసురటిని అందుకొని తానే వీవ నారంభించినాడు. అప్పుడే పారిజాతపుష్పము నంటి వచ్చినాడు; ఆపరిమళము ఘుమ్మని వ్యాపించిన దాగదిలో. ఏమిరా ఇది అని కన్నులు తెరచి చూచినది సత్య. ఎదురుగా అయ్యగారు తల వాంచి మనసు ముసుగిడినది. వలవల కన్నీళ్లు కొలకులనుంచి కార్చినది. వేడినిట్టూర్పులు పుచ్చుతున్నది. చెమటలు కారుతున్నది. ప్రేయసీకోపమును మాన్పడానికి ప్రియుడు చెప వలసిన మాటలన్నీ అన్నాడు కృష్ణుడు. కార్యము లేకపోయినది. కాళ్లమీద పడినాడు. అప్పు డేమయినదో ఆ అవస్థలో ఎప్పుడయినా పడిన అనుభవరసికులకే వేద్యము. ఇతరులకు చెప్పి ఏమికార్యము?

ఆ లతాంతాయుధుకన్నతండ్రి, జలజాతాసనవాసవాది సురపూజాభాజనంబై తనర్చు ఆమహనీయుడు, పవిత్రీకృత సత్యామానినీ పాదసరోజమృదూపహత శిరస్కుడై "ధన్యోఽస్మి; బహూకృతోఽస్మి" అని తన్నుదా పొగడికొంటూ, మెయి గగుర్పొడవగా, ఉద్దీపితమన్మథరాజ్యప్రాపితుడై—

"ఓ అరాళకుంతలా! దాసుని తప్పు దండముతో తీరినది. ఎంతటి ధన్యుడను! కాని, మత్తనుపులకాగ్రకంటకము దాకి, చెల్వగు నీ పదపల్లవ మెంత నొచ్చినదో అని నామనసు నొచ్చుకొంటున్నది సుమా!" అన్నాడు. అబ్బో! ఇటువంటి మాటలకు లొంగుతుందా, ఆ భామ? ఆ మానినీతిలక మప్పుడు,

"........................
మే యలుక దోప నిక్కి, కీ
డిన కచపంక్తిఁ బల్మఱు ము
డిచెడఁ దోపుచుఁ, బైఁ జెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు, మొ
గంబున లేఁ జెమరంకురింప, జం
కెన నెఱిచూపు చూచి, పలి
కెం జలితాధరపల్లవాగ్రయై"

ఏ చిత్రకారుడు చిత్రింపగల డీ మనోహర మూర్తిని శేవమును? చిత్రకారునికిని, కవికిని గల భేద మిక్కడనే ఉన్నది. చిత్రకారుని వర్ణము స్తబ్ధచిత్రముల నేర్పాటు చేస్తుంది. అతని తూలిక గతివిభ్రమ భ్రమను కల్పించినా అది స్తబ్ధగతియే. ఆవర్ణము కొన్నాళ్లకు మాసిపోతుంది. కవి ఉపయోగించే వర్ణము లట్టివి కావు; అవి అనురాగపరికల్పితములు; అక్షరములు; అనశ్వరములు. కాలముగాని, దేశముగాని వానికి వికారము గల్పింపలేవు.

ఆ క్షుబ్ధహృదయములలో రేకెత్తిన మనోభావ నిరూపణము చేయ సాహసించి, కృతకృత్యుడైన కవి నంది తిమ్మన్న. అతనికి ముందు, అతనికాలములో, అతని తరువాత కూడా కవులు తత్సదృశమైన అవస్థలను మాటలలో చిత్రింప ప్రయత్నించినారుకాని, తిక్కన తప్ప మరెవ్వరున్నూ ఆ యత్నములో నెగ్గలేదు. కీచకావమానితయైన ద్రౌపది భీముని తత్సంహారమునకు పురికొల్పే ఘట్టమిూ తెగలో చేరినది; ఇంకా ఎన్నో ఘట్టాలున్నవి, తిక్కనభారతములో, స్త్రీ మనోభావ చిత్రణము జగద్విఖ్యాతముగా చేయబడినవి. అట్టి చిత్రణ ప్రతిభను చేరినదే తిమ్మన యిక్కడ చూపిన ప్రతిభ కూడాను. స్త్రీ హృదయము సుట్టుమట్టుల నెంతగా అవగతము చేసుకొన్నాడు తిమ్మన్న! వానిని మాటలతో చెప్పడము సామాన్యమా, తిమ్మన్న వంటి పుట్టుకవులకు తప్ప?

అనవలసిన మాటలన్నీ అన్నది సత్య. కృష్ణుడు ప్రక్కన పేనువలె కిక్కురుమనకుండా ఊరకొన్నాడు. అతని పెదవిమీద చిరునవ్వాడుతున్నది. ఓర్పుకోలేకపోయిన దామె; మరి మాటలాడలేకపోయినది. "నను నెవ్వతెగాఁ జూచితివి ?" అని ఏడుపు మొగము పెట్టినది. ఆ ఒక్క మాటలో ఎన్నెన్ని భావా లిమిడి ఉన్నవి! — రుక్మిణిని గొప్ప చేసినాడే అని మత్సరము; తన్ను తలచలేదే అని ఈసు; నలుగురిలో నగుబాటు కలిగెనదే అని లజ్జ; ఇతని మూలముగానే కదా తన కిట్లయినదని కోపము; ఇంత చేసి కూడా తన్ను వేళాకోళము చేయడానికా యిప్పుడు వచ్చినా డనే 'అది యొక' భావము; ఎంత మొండిబండ తన ప్రియుడని అదేమోభావము; వీని తల నెడమకాలితో తన్నినా మొండికిపడి పోకుండా, "అరెరె! నీపాద మెంత నొచ్చినదో!" అంటాడే, వీని నేమి చేయవలె ననే విచికిత్స. ఇంకా ఏమేమిభావా లున్నవో ఆ మాటలో! — ఇన్నిటిలోను సర్వవ్యాపియై అంతటి మహారాజు సత్రాజిత్తునకు పుత్రికయై, ఇంతటి యదుశేఖరున కిల్లాలై, అతనికి ప్రేమసర్వస్వమని మనసు కొండెక్కి ఉన్న తనకా ఈ అవమాన మనే దైన్యము, అభిమానము, అహంభావము, గర్వము, గరువతనము—ఇవన్నీ కలిసిన మహాభావమున కేమంటారో మన తత్వజ్ఞులు చెప్పాలి— ఆ భావము నిండుకొని ఉన్నది. ఆమె అంతర్బాష్ప అయినది; అవనతముఖి అయినది; ఘనతర గద్గదికా నిస్వనము తప్ప మరి మాటలాడ శక్యముకాలే దామెకు? మాటలతో బయలుపడక నిలిచిపోయిన ఆ ఉత్కట భావసమ్మేళనము ఏడ్పుగా పరిణమించినది. ఆమె "ఈమనఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే గాసిలి" యేడ్చినది. ఇంకా ఆమె అంతర్బాష్పగానే ఉన్నదా? కన్నీ ళ్లేమయినా కారుతున్నవా? మనకు తెలియదు. పంకజశ్రీసఖమైన ఆమెమోముపయి కవి చేలచెరం గిడినాడు. "బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠ వధూకల కాకలీధ్వని" మాత్రము మనకు వినబడుతున్నది. ఆ ధ్వని పారిజాతవృక్షములు భూమిపై ఉన్నంతకాలమున్నూ ఆంధ్రులకు వినబడుతుంది.

ఆంధ్రవాఙ్మయములో ఇంకా కొంతమంది నాయికలను కొందఱు కవు లేడ్పించినారు. ఈ ముద్దు ముద్దు ఏడ్పుమాత్ర మెవ్వరికిన్ని పట్టుపడలేదు.

సత్య ప్రక్కకు పోయి యేడ్వకూడదూ?

ప్రాణవిభు కట్టెదుట ఏడ్చినది. కృష్ణు డయితే మాత్రము — కుహనాగోపాలు డయితేమాత్రము తట్టుకోగలడా, అబలలకు చరమాయుధముగా సృష్టికర్త కల్పించిన ఈ నిశితాతినిశిత నిస్త్రింశాహతికి? అతడున్నపాటుగా చతికిలబడినాడు. సంపూర్ణముగా ఆమెకు వశు డైపోయినాడు.

"ఓ లలితేంద్రనీలశక
లోపమకైశిక ! ఇంతవంతె నీ

కేల లతాంతమాత్రమున
   కేఁగలుగన్? విను—నీకు దేవతా
కేలి వనంబు సొచ్చి అది
   కిన్ బలసూదనుఁ డెత్తివచ్చినన్
డీలుపడంగఁ దోలి, యిటఁ
   దెచ్చెద, నిచ్చెద పారిజాతమున్."

అన్నాడు. రండి చూతాము— ఆ వామలోచన కేళి వనములోనఁ జలువ వెదచల్లు చెంగల్వ కొలనికెలన, పరపకర్పూరకదళికాతరులనడుమఁ చెరటిచెట్టుగా నాటిస్తాడు పారిజాతవృక్షమును సత్యా వినోదియుడు కృష్ణుడు.

అయితే, కృష్ణునికి మాధ్యాహ్నికస్నానము కావలెను, భోజనము కావలెను. భోజనాల వేళ కనుక్కొని వచ్చినాడు నారదుడు. ఎందుకయినా మంచి దని మ్రొక్కిన దతనికి సత్యభామ. అక్కడ రుక్మిణి నట్లా ఆశీర్వదించిన ఈ మునిమ్రుచ్చు ఇప్పుడు సత్య నేమని దీవిస్తాడు? ఏ మొగము పెట్టుకొని మాట్లాడుతాడు? అయినా దీవించినాడు, కృష్ణుని పురికొల్పినాడు, యుద్ధము చేసి అయినా పారిజాతము నింద్రలోకమునుంచి తెమ్మని.

సత్య తహతహ లాడిపోతున్నది ఎప్పుడింద్రలోకానికి పోతామా, ఎప్పుడు పారిజాతమును తీసుకొని వస్తామా అని. కాని, సాయంకాల మయినది, చీకటి పడినది, చుక్కలుపొడిచినవి, చంద్రు డుదయించినాడు, వెన్నెలలు నిండుకొన్నవి, తెల్లవారుతున్నది. కృష్ణునికి మేల్కొలుపులు పాడినారు. తెల్లవారినది - అబ్బా! ఎంతసేపు పట్టినది తెల్లవారడానికి!

ఇక ప్రయాణసన్నాహాని కెంత ఆలస్యము! దారిలో ఏమేమో చూపుతున్నాడు సత్యకు కృష్ణుడు. ఆమెకు వాటిమీద మనసు ఉంటేనా?—తుదకు ఇంద్రలోకము చేరుకొన్నారు.

ఏమి టీ కృష్ణుని చాదస్తము! ముసలమ్మ అదితి దగ్గరకు ఎందుకుపోవాలి? ఎవరిచేతనయినా ఆమెకుండలములను పంపించివేస్తే ఆమెకు చేరవా? అముసలిది ఊరకుంటుందా? గొణగాలి, పొగడాలి, దీవించాలి.

తరువాత వైజయంతములో విడిది. ఎవరెకు కావాలి ఆవైజయంతము? ఎట్లయితేనేమి నందనవనములో చేరినారు. తిన్నగా పారిజాతమువద్దకు పోరాదదూ? ఊఁహూ! తిమ్మన్న వారిని పోనివ్వడు. ఆ నందనవనశోభ మనకు తెలియకపోతే ఎట్లా?

తుదకు పారిజాతమువద్దకు చేరుకొన్నారు. దానంతట అదే ఊగనారంభించిన దా చెట్టు. వేళ్లతో పెకలించినాడు; గరుత్మంతుని వీపుమీద పెట్టినాడు. దాని చుట్టుపట్లనున్న లతలుకూడా దానితో చిక్కుకొని మేమున్న వస్తామంటవి. గరుత్మంతునివీపుమీద చోటులేదు. వాటిని విడదీయడానికి కొంత ఆలస్యము!

చేస్తూ ఉన్నది దొంగపని. అందులో అతిథిగా వచ్చి, గొప్పగౌరవము పొందినవాడు చేయవలసిన పని కాదు. పెండ్లాముముద్దు తీర్చడానికి చేయవలసివచ్చినది. చేయకపోతే ఆయమ్మగల్ల తెల్లవారితేస్తే, పొద్దు గ్రుంకితే ఎన్నెన్ని బుగ్గపోటులో! ఎన్నెన్ని పొడుపుమాటలో! ఎన్ని రట్టులో! ఎన్ని రవ్వలో! ఎన్ని ఏడుపులో! ముద్దు ముద్దు ఏడుపులే అనుకోండి— ఆ రేడు ఎప్పుడో ఒకసారి అయితే బాగుంటుంది కాని, అడుగడుగుకూ ఏడుపే అయితే? ఎంతకృష్ణు డయితే మాత్రం మెట్లు తట్టుకోగలడు? కాని, చేసేదొంగతనము చల్లచల్లగా చేయకూడదూ? ఏమి టీ అల్లరి? ఏమి టీ చప్పుడు? తమ ప్రభువుతమ్ముడుగారయితే మాత్రము —ఉద్యానవనపాలకు లూరకొంటారా?

ఊరకోలేదు. "ఓయమ్మో! ఏటి సేస్తున్నా వయ్యా అక్కడ? మీ వొదిన కిచ్చినాడయ్యా మీ యన్న ఆ చెట్టుని! ఆస పెట్టియ్యవయ్యా!" అని కేకలేసినారు. కృష్ణునికి కన్నములోని దొంగకు తేలుకుట్టినట్లయింది. గుప్‌చుప్‌మని, గ్రుక్కుమిక్కనకుండా ఊరకొన్నాడు. "ఏమండీ, ఊరకొంటారేమి? పోనీ, నేను మాట్లాడతానుండండి" అని అంకించుకొన్నది సత్య. ఆమె చెందొవచూపులు క్రేల్లుదాటుతున్నవి. చక్రగేవల జాఱు కొంగు పవరిస్తున్నది. వీడినకొప్పు పల్మ్రబుం తేవెడ దోపుతున్నది. చిరునవ్వుకూడాను. ఎంత ధైర్యము! ఎంత సాహసము! ఎంత గడిదేరినతనము!

"వినుఁడు సురేశ్వరువనపాలకులు! వార్ధిఁ బొడమిన యీదివ్యభూరుహమునకు ఇంద్రాణి యెవ్వతె, ఇంద్రుండు నెవ్వరు? తోడి ఇందిరవ, కౌస్తుభమును ఎవ్వఁ డధిపుఁడై ధరియించె నతఁడ చేకొనఁగాక,— తెకతేర యిదియేమి ఒకరిసొమ్మె? ఇది నాకు విభునిచే నీవఁబాప్యవగంబు నొడియించుకొని యేఁగుచున్నదాన!—పలుకు లేటికి? తా వీరపత్ని యేని, విూఁళచీ జేవి తవదుప్రాణేశుఁడైన మఘువు నిటఁ బంపి, సత్యభామావిధేయువలన మరలంగఁ గొనుటెపో వాసితనము" అన్నది ఆ మానిని.

నిర్ఘాంతపోయినా రా వనపాలకులు. పరుగున పోయి చెప్పినా రింద్రునితో. ఇంద్రుడున్ను నిర్ఘాంత పోయినాడు. ఎక్కడనయినా ఉన్నదా, అన్నయింటికి వచ్చి, మన్ననలుపొంది, సుష్టుగా భోజనముచేసి, ఒక రాత్రి నిద్రచేసి, ఎవ్వరితోనూ చెప్పకుండా, అడుగకుండా, సాదగకుండా, ఒకకంచమో ఒకముంతో కాకుండా, కల్పవృక్షమునే దొంగతనముగా ఎత్తుకపోవడమా? ఎంత గుండెలుతీసిన పని!

ఇంద్రుని పురములోని వారు, " 'నీయనుజన్ముఁడనే, సఖుఁడ నీకని యింటికివచ్చి, జంభదైత్యవిరోధిచే నపుడు తేజము లన్నియుఁ గాంచి, చేసె నన్యాయము పారిజాతహరణంబునఁ గృష్ణుఁడు! మంచి చుట్టమారా!" అనుకొన నారంభించినారు.

పౌలోమి మొగము చిన్నచేసుకొన్నది. ఆమెనోదార్చినాడు ఆమెప్రాణేశ్వరుడు. అతనికి వేయికన్నులున్నా చేవురించినవి. సుధర్మకు వచ్చి సింహాసనముమీద కూర్చుండి దిక్పాలకులను— ఇంకా యుద్ధానికెవరెవరు కావలెనో అందరినీ పిలిపించినాడు. జరిగిన సంగతి చెప్పినాడు. యుద్ధసన్నాహాలు చేయండన్నాడు.

ఆయుద్ధసన్నాహవర్ణనములోను అంత ముద్దులొలకవలెనా తిమ్మన్న? ఆ చల్లనిహాస్యరచన, ఆ కళాదృష్టి నిరుపమానములు. మరి యే కవికిన్ని పట్టుపడలే దాసేర్పు.

ఆ దేవయోధుల సంభ్రమ మేమని చెప్పవలెను? తత్తడులం బల్లింపక యెప్పళంబున నెక్కంబోతున్నారు. 'కృష్ణుడు! కృష్ణుడు! — పారిజాతము! పారిజాతము!— ఏమి, ఏమి? — ఎక్కడ, ఎక్కడ?— ఇది నాఆయుధము! ఇది నాఆయుధము. హాహాత్! హాత్!'

కుండాలఘుట లకాలనిద్ర పోతున్నవి, ఎంత పొడిచినా లేవవు. గుఱ్ఱాలు తమమీద పల్యాణములను వేయనీయవు. ఒక అమృతాంధసుడు కల్పవృక్షపవపాన మత్తుడయి, ఇంద్రనీలమణిస్తంభములో తన నీడను చూచి, ప్రతివీరు డని భ్రమించి ఖడ్గముతో కొట్టినాడు. ఆఖడ్గము విరిగినది. ఆవిరిగిన ముక్కనే పట్టుకొని వాడు బయలుదేరినాడు. ఒకని వింటివారి కారణము లేకుండా తెగిపోయింది; ఆనారిలేనివింటినే పట్టుకొని బయలుదేరినాడు వాడు. మరొకడు విల్లెక్కుపెట్టబోయి చేతగాక, దానిని విడిచి ఒకకత్తి పట్టుకొని సాగినాడు.

వీరిమాట కేమిగాని, యీ వంక దేవతల అవస్థ చూడండి! ఒకడు బయలుదేరుతూఉంటే, తనసతి 'పోవద్దు, పోవద్దు' అని పాదాలు పట్టుకోజూస్తుంది, పట్టుకోలేకపోతుంది; బొమ్మగద్దదికతో 'పోకు, పోకు' మంటూఉన్నా, వాడు పోతూఉంటే నెయ్యపుంబడను చూపుల నతనివెంట నంటి కొంతదూరము పోతుంది.

ఒక దేవయోధునికిన్ని అతని ప్రేయసికిన్ని చాలాకాలమునుంచిన్నీ మాటలు లేవు; ఎందుకో కోపమువచ్చిన దామెకు. ఎన్నాళ్లయిందో అతడామెను కౌగిలించుకొని! ఇప్పుడతడామెవద్దకుపోయి, "ప్రియే, యుద్ధానికి పోతున్నాను అనుజ్ఞ యివ్వవలెను" అని ప్రార్థించినాడు. "అయ్యో! నాథా! యుద్ధానికి పోతావా? పోయిరా"అని తానే అతనిని కౌగిలించి పంపించింది.

"నీవున్ను యుద్ధానికి వెళ్లుతావా? ఇంటి యుద్ధములోనే గెలువలేనివాడవు, ఊరియుద్ధములో నీవేమి గెలుస్తావు? వెళ్లవద్దు, నిలు!"అని ఒక అచ్చరమిటారి అడ్డుపడిన దొక యందగానికి. "చూడూ నన్నుపోనీ! నీకు గరుత్మంతుని బంగారు ఈకలను తెచ్చి నీచెవిసందున కర్ణపూరముగా చెరువుతాను" అ అంటే విడిచిపెట్టిన దామె అతనిని.

* * *

యుద్ధమయినది. ఇంద్రుడు ఓడినాడు. అతని వజ్రాయుధమును కృష్ణుడు పూలచెండువలె పట్టుకొన్నాడు. "తమ్ముడూ! ఈ పారిజాతము నీ పెరటిలో ఉంటే ఒకటే, నా పెరటిలో ఉంటే ఒకటేనా? తీసుకొనివెళ్లు బాబూ! నామరదలిముద్దు తీర్చు" అన్నా డింద్రుడు— లోలోపల కుములుకొంటూ. సత్యపంతము నెగ్గినది.

* * *

సాత్రాజితి వనపాలకులతో అన్న మాటలు చెవిలో గింగురుమంటున్నవి. ఈ కమ్యూనిస్టు, సోషలిస్టుసిద్ధాంతమునే భీము డొకప్పుడు సౌగంధికపుష్పాహరణార్థము పోయినప్పుడు ప్రతిపాదించినాడు. అక్కడ మగవాడు, ఇక్కడ ఆడది. అక్కడ ద్రౌపది కోసము, ఇక్కడ సత్య తన కోసమే. కాని, ఇటువంటి సిద్ధాంతమును తిమ్మన్న ప్రతిపాదిస్తూఉంటే, కృష్ణదేవరాయ డేమనుకొని ఉంటాడో! కావ్యములో గనుక భయము లేదనుకొన్నాడు కాబోలు.

సత్యస్వభావము మంచిదే. కల్పవృక్షమును తన పెరటిలో పెట్టుకొని ఏమి చేసుకొంటుంది? తెల్లవారితే రాలిపడుతవి కుప్పలుతిప్పలుగా పువ్వులు చెట్టుమొదట. తనకొప్పున ముడుచుకోగా, దండలు కట్టుకోగా, పరుపులమీద పరుచుకోగా, బండ్లకొద్దీ మిగిలిపోతవి. ఇతరుల కివ్వక దాచుకొంటుందా? కాని, తనచేయి మీదుగా ఉండాలి, అంతే ఆమె పంతము. పంతము చెల్లగానే ఆమె వినయవతి అయినది. ఆమె, "కల్పనగము క్రొవ్విరుల్ కనకపాత్రములం దగ నించి యిచ్చె వాయనములు రుక్మిణీప్రభృతులౌ సవతుల్ పదియాఱువేలకున్."

* * *

కృష్ణుడు పారిజాతాపహరణకావ్యములో నాయకుడే కాని, ఆ దక్షిణనాయకుడో నిర్ణయించవీలు లేకున్నది. నారదుడు కనుసన్న చేస్తే రుక్మిణికి పువ్వు నిచ్చివేసినాడు. సత్య ఏమనుకొంటుందో అని అక్కడకు పరుగెత్తినాడు; మంచిగౌరవము పొందినాడు. ఇంద్రలోకములోనికి భార్యామణిని వెంటబెట్టుక పోయినాడు—అందరిచేతా మాట లనిపించుకొన్నాడు. తుదకు తన భార్యచే తన్నొక సన్యాసికి దానము చేయడానికికూడా ఒప్పుకొన్నాడు.

ఈకావ్యము పారిజాతాపహరణము కాదు; సత్యావిజయము.

* * *

తిమ్మన్న పలుకులు సరిగమపదనిస సంజ్ఞస్వరంబుల మహతి వక్షోవాయునిహతి మొరయునట్లున్నవి. అవి తేనెలుట్టిపడుతున్నవి. అవి బాల పల్లవగ్రాసకషాయ కంఠకలకంఠవధూకలకాకలీధ్వనులు. సరసాలాపములు. వినోదకథల కుపకరించేవి. కిన్నరకంఠనిర్గళితములు. ఆపలుకులలో ఆంధ్రవాణి వీణ మీటుతున్నప్పుడు కదలిన కంకణములు ఘల్లుఘల్లుమంటున్నవి; ఆమె మేఖలాకీలిత రత్నకింకిణులు మొరస్తున్నవి. ఆమె ధరించిన దువ్వలువ— సంస్కృతాంధ్రముల, సంస్కృతాంధ్రపు సమాసఘటన— ఫెళఫెళమంటున్నది. ఆమె కాలిగ్రేళ్ల మట్టియల మ్రోతలు శ్రవణసుభగముగా వినవస్తున్నవి.

కాని, తిమ్మన్నకు సహజచాపల్యము వదలలేదు. అష్టదిగ్గజములలో తోడివారు తనగ్రంథమునకు కావ్యత్వము సిద్ధింపలేదని యెక్కడ ఆక్షేపిస్తారో అని కావలసిన వర్ణనలన్నీ చేసినాడు. ప్రతివర్ణనలోనూ అతని ప్రత్యేకవ్యక్తిత్వము ప్రతిఫలిస్తున్నది. కొంచెము శ్లేషచవికూడా చూపినాడు. తుదకు చిత్ర, బంధకవిత్వములలో తనకుగల నేర్పునుకూడా ప్రదర్శించినాడు. తానుకూడా లాక్షణికకవి నని పండితులచేత అనిపించుకొన్నాడు.

---



# నవయుగసాహిత్యాశయము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

కళకును, శాస్త్రమునకును చుట్టపుదూపులు లేవని కొందఱి మతము. కల్పనమునకు, భావనాశక్తికి, హృదయసంపదకు, సుందరసంకలనమునకు, ఆత్మచేతన్మయనృత్యమును చేయింపజాలు కౌశలమునకు, సృష్టిశక్తికి సంబంధించినది కళ. శాస్త్రమో? మేధాశక్తికి, ఆలోచనమునకు, నిశితపరిశీలనమునకు, పారిశ్రామిక ప్రజ్ఞకు, విభాగనైపుణ్యమునకు, భౌతికసూత్రావిష్కరణమునకు సంబంధించినది. కళ పండితులను, పామరులనుకూడ అలరింపజాలును. శాస్త్రము పండితులకు మాత్రము బోధపడును. రెండింటి పృథక్పథములు ప్రత్యేకములే యైనను రెండింటికి వైరము కలదని తలచుట తప్పు. శాస్త్రవిధులను పిడికిటబట్టి కళోపాసనమునకు కడంగువాడు తన ఉద్వేగమును ఉచితరీతిని నడుపజాలును. సక్రమమార్గమున పోవు భౌతికశాస్త్రము కళకు నిక్కముగ చేదోడు కాగలుగును. ప్రపంచచరిత్రలను పరిశీలించినపుడు మన కనేక దృష్టాంతములు అగపడును.

పదునేనవశతాబ్దాంతమునుండి సైన్సుయొక్క ప్రాభవము విశేషముగా విజృంభింపసాగినది. ఉదాత్తమైన భావోద్యమ మొకటి ఐరోపాఖండమున అప్పటినుండియే ఆరంభమైనది. నావికుల నిత్యకృత్యమున చేదోడగు దిక్సూచి (Mariner's Compass) నిర్మాణమైన పిదప ఓడలు నిరపాయముగ దూరప్రదేశములకు పోవుటకు చక్కని వీల్లు ఏర్పడినవి. అచ్చుయంత్రమును కేక్స్టన్ నిర్మించినయనంతరము గ్రంథప్రచురణము విరివిగొనినది. భౌతికముగ యూరపుఖండము అభివృద్ధి నందినది. ఎలిజబెత్ కాలములో డ్రేక్, హాకిన్స్ మున్నగు ఆంగ్లనావికులు అమెరికా మొదలైన ఖండములకు పోయి తమసీమకు అతులైశ్వర్యమును చేకూర్పజాలిరి. ప్రతిభాశాలులైన ఆంగ్లేయులు — వాల్టర్ రలే ప్రభృతులు — విశేషదూరము పయనించి తమ లేఖినులకు నవ్యశక్తి నొసగజాలిరి. ప్రతీచీ ప్రపంచమున ఆంగ్లదేశము సర్వతోముఖమైన అభివృద్ధి గాంచి, అనర్ఘమైన ప్రశస్తిని పడసినది. ఆ సమయమందే స్పెన్సర్, షేక్స్పియరు, బెన్‌జాన్సన్, బ్యూమంట్, ఫ్లెచ్చర్, సిడ్నీ మున్నగువారు ఆంగ్ల ప్రభావమును ప్రస్తుతించి, ఆంగ్లభారతికి అపూర్వములై, అమూల్యములైన అలంకారములను సమర్పించిరి.

భౌతికశాస్త్రాభివృద్ధివలన స్థలకాల ప్రతిబంధకములు డుల్లిపడినవి. నేడు ప్రపంచమంతయు ఒక్క కుటుంబమువలె నున్నది. ప్రపంచజాతులు, ప్రపంచమతములు, ప్రపంచచరిత్రలు, ప్రపంచసాహిత్యములు పరస్పరపరిచయమును పడసినవి. ఆర్థికముగనే కాదు, రాజకీయముగనే కాదు, ఆధునికయుగమున వైజ్ఞానికముగ గూడ ఏ జాతియైనను ఒంట్రెత్తు బ్రదుకును కడపజాలదు.

పృథివిలో తలయెత్తిన ఈ యద్భుతాభివృద్ధిదశ పెడమొగము పెట్టి, చేతులను, కాళ్లను ముడుచు

కాని మనుష్యు డనిపించుకొనగలవా డెవ్వడును నేడు లేడు.

సైన్సుయుగమందే ట్రంకుఫోను రేడియోల ప్రసంగములను వినుచున్నాముకదా! ఇట్టి ప్రసంగములను ఒక్క ముహూర్తమందు ప్రపంచవాసులెల్లరును వినుటకు అవకాశ మేర్పడినది. తమ యిండ్లయందుండియు, పుడమిలో అంతరంగికమైన వియ్యమును గలిగించుకొనుట కెట్టి తరుణము చేజిక్కినదో యోచింపుడు. అపూర్వమైన ఈ యవకాశమును పురస్కరించుకొని పృథ్వీవాసు లెట్టి విజ్ఞానము నలవరచుకొనగలరో యూహింపుడు.

తిక్కనాదుల కాలములో ఒక జిల్లానుండి మఱొక జిల్లాకు పోవుటకు ఎంతో సమయ మయ్యెడిది. ఏ పయనమునకైన నాడు రెండెడ్లబండియే శరణ్యమయ్యెడిది. రాకపోకలందలి కష్టములు ఉత్తర ప్రత్యుత్తరములందును తలచూపినవి. గ్రంథస్థాంశములు రాజులకును, రాణులకును మాత్రమే కాని పామరులకు సంబంధించనియట్లు తాళపత్రగ్రంథములు పామరులకు దూరస్థములై దురూహ్యములై యుండెను. మఱొక జాతితో, మఱొకసంఘముతో, మఱొకభాషతో, మఱొకసంప్రదాయముతో జోక్యము కలిగించుకొనుటకును, పరస్పరసంపర్కముకతన పరస్పరాభ్యుదయమును కనులజూచుటకును ఎట్టి యవకాశము నుండెడిది కాదు. నేటిసంచలనమునగూడ నాటివలె నుండ నిచ్చగించు వెట్టిచెట్టలెవరో తలపోయుడు. ప్రపంచభాషాసమ్మేళనమున నాంధ్రభాషారాణి అధ్యక్షపీఠము నలంకరింపవలె ననిన నాంధ్రభాషాసేవకులును, భాషాపత్రికలును తమ దిగ్దిగంతలనుండి వెడలి యితర జాతులలీల ముందంజ వేసి నవ్యమార్గముల నావిష్కరించితీరవలెను. అనేకవాఙ్మయములతో పరిచయము కలిగించుకొనవలెను.

ఒకప్పుడు అవగాహమునకు అందని అంశములు ప్రస్తుతసంచలనమున కరతలామలకము లగుచున్నవి కదా! సన్నిహితపరిశీలనమునకును, ప్రత్యక్షానుభవమునకును అందని విషయములు గూఢమతమున జేరుచుండెడివి. నిన్నటి మిస్టిసిజమ్ నేటి సైన్స్ అగుచున్నది. కన్నులెదుట గానబడని అంశములను కవీంద్రుడు ఊహాప్రపంచమున విలోకించువాడు. ఊహకు, భావనమునకు, కల్పనమునకు మాత్రము అందజాలు అంశము లెన్నో నేడు లోచనగోచరమై, సన్నిహితానుభవమున ప్రవేశింపజాలుచున్నవి. ఊహ సాహితికి అందచందములను, ఇంపుసొంపులను, ముద్దుముచ్చటలను, సౌందర్యమాధుర్యములను చేకూర్చునని యెఱుగుదుము. కాని, కేవలము ఊహాప్రపంచమందే రెక్కలు కట్టుకొని యెగయువాడును, అనవరతము మేఘడోలికలందు మెఱుపుపూబోడులతో ఉయ్యాల లూగువాడును సత్యమునకు దూరస్థులై తమ వారికిని, తమ ప్రపంచమునకును కొఱగానివారై యుందురు. కఠోరసత్యమునుండి కదలిపోక, ప్రత్యక్షానుభవమున ఆరితేరిన రచయితమాత్రమే సత్యసందీపితములైన రచనలను సృష్టించి, సాహిత్యకళకు వన్నెదెచ్చి, మనుష్యజీవితమందు నవ్యరుచులను తళుక్కొత్తించును. ప్రస్తుత సంచలనములోని సౌకర్యములను చేబట్టు గడుసరి పూర్వోక్తమైన భాగ్యమును తనవశ మొనరించుకొనగలడు. అంతియే కాదు, తన లేఖినీప్రాభవమును పురస్కరించుకొని, తన వచఃకౌశలమును ఊతజేసికొని, తా నందిన సౌభాగ్యమును సర్వజనులకు ప్రసాదింపగలడు. సాహితీసేవయందలి మహత్త్వ మెట్టిదో ఊహింపుడు. రాజకీయవేత్తగాని, అర్థశాస్త్రపరిజ్ఞాతగాని పుట్టకమున్నే సృష్టికర్తల సహపాఠియై, సాహిత్యోపాసకుడు తోచినవాడు. ఇతడేమూల నున్న నేమి, ఎందు నిలిచి ప్రసంగించిన నేమి, ఈతని నుడువులు సర్వసీమలందును, సర్వయుగములందును ప్రతిధ్వనించును. ఈతనిని సత్కరింపనివారు నిదురించిన నేమి, దిక్కామినులు వీని మ్రోల వంగి జోహా రొనరించి, వీని రచనలకు నివాళు లర్పించును. సాహిత్యోపాసకుడు ఒంటెత్తు బ్రదు కీడ్చువా డని పలుకు పాపి జగతిలో నేకడనైనను లేడు. భవపరంపరలందు తపించి తానందిన శక్తిని, తాను పడసిన అనుభవమును ప్రజాళికి చేకూర్చి, పరార్థజీవితమందును, ప్రజాప్రమోదమందును స్వీయాభ్యుదయమును గాంచి యాతడు ప్రాప్తలాభముదితహృదయు డగును. తా నందినదానిని తనలోనే 'స్వాహా' గావించుకొనువాడు సాహి

తికి దూరస్థులై యుందురు. తానందిన అమృతమును ఆస్వాదింపగల పఠితలకు ధారవోసి యీతడు ధన్యుడగును. సాహిత్యవిదూరులైన బహుళ పట్టణవాసులను గుఱించి నేనేమియు బలుకనొల్లను. పల్లెహృదయమును జొచ్చి, పల్లెజీవితములను పరిశీలించితిరేని, ఒకప్పుడు ముముక్షు హృత్పుటములనుండి వెడలిన భావసుధాకణములు నేడందు నిలిచి, వానిని పునీతములు చేయుచున్నవని గ్రహింపగలరు.

ఒక్కొకజాతికి ప్రత్యేకమైన భావశబలత యుండును. ఇది దేశసంప్రదాయమునకును, వైజ్ఞానిక సంప్రదాయమునకును సంబంధించినది. తన మతమునకును, తన సభ్యతకును, తన విశ్వాసమునకును, తన సీమకును, తన శిక్షణమునకును, తన వాతావరణమునకును అనుకూలమైన ప్రకృతిని, చరిత్రగ్రథనమును మానవుడు తనయందు వృద్ధి గావించుకొనును. దేశభక్తి యనినపుడు సర్వతోముఖమైన దేశవిజ్ఞానమును, దేశసంప్రదాయమును అందిమిడియున్నదని మనము గ్రహింపవలెను. నన్నడిగితిరా, దేశభక్తుడు కానివా డెవ్వడును లేడనియే వచింతును. తన తల్లిని చూచినపుడు, తనతల్లి పేరు వినినపుడు, తన తల్లిమాట చెవిబడినపుడు, తన తల్లి ప్రశస్తి వెలిగినపుడు ఎవ్వని హృదయము దేశభామినివలె నృత్యము చేయదు? తమ యనుభవములను తమ పలుకులందు వ్యక్తీకరించు కౌశల మెల్లరకు లేకున్న నేమి? రాజకీయపరిజ్ఞానమే, ఉపన్యాస కౌశలమే, కారాగారప్రవేశమే దేశభక్తి యందిమిడియున్నదని తలచుట తప్పు. చేత గరవాలమును బూని తమ సీమయందలి స్వాతంత్ర్యసమరమున పాల్గొనని మిల్టన్ కవీంద్రుడు దేశభక్తుడను గానని దుఃఖించినాడా? దేశార్థము లేఖిని బూని, అంధుడై, పవిత్రమైన తన కర్తవ్యమును నెఱపి ఈశ్వరకటాక్షము నందితిననియే కదా ఆ మనీషి విశ్వసించినాడు?

మన దేశమున ప్రస్తుత సంచలనమందలి భావశబలత ఎట్టిదియో తెలిపితిని. దీని కీడైన కార్యసఫలతపై దృష్టినిలుపుట మన ప్రస్తుతకర్తవ్యము కదా! దేశాభ్యుదయమును కాంక్షించు అసంఖ్యాకులు మన మాతృభూమియొక్క మహత్త్వ మెట్టిదో యెఱుంగవలెనని మిక్కిలి మక్కువపడుచున్నారు కదా! ఈ మహత్త్వము మత చారిత్రక నైసర్గిక సాంఘిక జీవితమునకు సంబంధించినదని తెలుపుట చర్వితచర్వణమే యగును. భరతఖండము సమస్తభూవలయము యొక్క సంక్షేపరూపము. వసుంధరలోని శీతోష్ణస్థితులనదు, మతములనదు, జాతులనదు, చెప్పనేల-సమస్త పరిస్థితులును భారతావనియందు వెలయుచున్నవి. ఇందు సంచరించినపుడు మనుష్యజీవిత మెన్నెన్ని శాఖలతో, నెట్లెట్లు ప్రవహించుచున్నదో గ్రహింపజాలుదుము. ఇట్లు సంచారము చేయు భాగ్యము నా కలవడెను. నే గాంచిన దృశ్యములను పాఠకులకు చూపుటయు, నేనందిన ఇంచుక వైజ్ఞానికాభ్యుదయమును ఆంతరంగికముగ వారి కొసగూర్చుటయు నా యాశయములు.

గ్రంథపఠనమువలన మన దేశమునకు సంబంధించిన వైజ్ఞానికాంశములను హృదయస్థము లొనరించుకొనుట మేలే! పర్యటనమున ప్రత్యక్షానుభూతి నందుట మఱింత మేలు. పరానుభూతికంటె ఆత్మానుభూతి ఘనతరమైనది కాదా? కాని, మొదుల యనుభూతికి సంబంధించిన ఉదంత మాత్మానుభూతికి ననేకులను పురికొలుపును. ప్రత్యక్షజగతిని చక్కగ పరిశీలింపజాలినపుడే సాహితీజగతియందు ముందంజ వేయజాలుదుము. ప్రత్యక్షప్రపంచమందలి యాత్మానుభూతి సాహితీవసుంధరయందు జీవనదులను, అవిరతముగ ప్రవహించు భావఝరులను ప్రవహింపజేయగలదు. యుగములును, మహాయుగములును కలహంసలై ఈ నదీమతల్లులందు నీదులాడును.

ఆంతరంగికముగ పాఠకమహాశయులను మరల మహారాష్ట్రసీమలోనికి గొనిపోవ నుద్దేశించుచున్నాను. ఉత్తమాశయములు మహారాష్ట్రనభమున అనంత తారలై తేజరిల్లినవి. ఉత్కృష్ట జాతీయతత్త్వ మహత్త్వమందు చక్కగ పరిఢవిల్లినది, శివాజీ, తిలకు మున్నగు మహాపురుషుల పవిత్ర జీవితములకు మహారాష్ట్రము ఆటపట్టయినది. కనువిందొనరించు ప్రకృతికి నెలవైనది. భవతారకములైన ప్రవంతులకు జన్మస్థలమైనది. ఆహా! మహారాష్ట్ర దేశ మహిమ అనిర్వచనీయ మైనది కాదా?

# ఔదార్య

శ్రీ కృష్ణ కౌండిన్య

ముద్దులాఁడ, నీవు మొగమువాయఁగ నేడ్వఁ
బోకుమయ్య, తండ్రి బుజ్జగించు
తల్లిదండ్రు లిందుఁ దనరరు, బుడిబుడి
యశ్రు లొత్తువార లరిది యిటను.

తల్లిఁ దెలియవొక్కొ? తండ్రి యున్నాఁడంచు
వచ్చువాఁడ వేమి యిచ్చటికిని,
వెఱ్ఱితండ్రి, తల్లిప్రియ మున్న నే తండ్రి
ఇదియు నెఱుఁగ కిందు నేడ్వ ఫలమె ?

నుదుట విధి లిఖయించె నన్యూనదుఃఖ
మెంత పనపిన నాదుకో నెవరు లేరు.
నిన్నుఁజూచినఁ జెఱు వయ్యె నిందుమదియు,
చాలు నిటు వైచి పోయినవారికొఱకు
వనటఁ బొందిన బా గయ్య? వంత పెరుఁగ
కోపగిలు దేమొ నాతండ్రి సుంత నిలుపు.

నీవా తండ్రివి స్వామీ
నీవారిని దెలియవొక్కొ నిఖిలజగతిలో
నేవారికి భారమె యా
నీవహిఁ బాల్ద్రావువారి నెయిదికొనంగన్.

కంత మెత్తి విలాపాన గ్రావములును
కరుగఁగా నేడ్చు నోదారఁ జేయ
వయ్య, మంచివాఁడవె! బిడ్డ లందఱి నిటు
లింత యేడ్పించువాఁడవే! దిట్ట వీవు.

మంచిమాట లాడ మాయబ్బ తీరదా ?
బిడ్డఁ గన్న నాఁటి ప్రేమ లేదా ?
ఇంకనైనఁ గనఁగ నుంకింప కోయయ్య,
సృష్టి మానుకొన్న నష్టి యేమి?

# సూఫీ సర్మద్



మూలము:

**రాష్ట్రపతి అబుల్ కలాం ఆజాద్**



అనువాదము:

**శ్రీ బూర్గుల రామకృష్ణరావు**

ఆలంగీరు కాలమునను, తరువాతను వ్రాయబడిన ఫారసీకవుల చరిత్రలలో 'సర్మద్' అను శీర్షిక క్రింద కొన్నిపంక్తులు మాత్రము కానవచ్చుచుండును. కాని ఆ పుస్తకములను నాపంక్తులవల్ల నీ మహాపురుషుని జనవకాలవిశేషాదులను గురించి ఏమియు తెలియదు. ఆలంగీరు కాలమున సమగ్రముగ చరిత్రను వ్రాయుటకై సమకాలీనుడగు మిర్జా మహమ్మద్ కాజం పూనుకొనెను. కొంతకాలపు చరిత్ర వ్రాసినపిదప రాజకీయకారణములవల్ల నతని యీ ప్రయత్నము మాపివేయబడెను. తరువాత షాఃఆలంచక్రవర్తికాలమున నతని యాజ్ఞచే 'ముస్తయిదుఖా'నుడు మిగత ౪౦ సంవత్సరముల చరిత్రను విపులముగా వ్రాసి మొదటిపదిసంవత్సరముల సంక్షిప్తకథను జత గూర్చి 'మఆసరె - ఆలంగీరీ' యను పేరుతో ప్రపంచమున కిచ్చెను. అట్టి సమగ్రచరిత్రయందును చిల్లర విషయము లెన్నియో వివరింపబడినను, 'సర్మద్' యొక్క పవిత్రగాథ వర్ణితము కాలేదు. మొగలాయి చక్రవర్తుల చరిత్రను విపులముగా వ్రాసి, యందులో నౌరంగజేబుకు ముఖ్యస్థానము నిచ్చిన 'ఖాఫీఖానుడు' గూడ నీ మహాపురుషుని పేరొక్కనైన లేదు. రాజకీయకారణములు చారిత్రకుల కలములను, కథకుల నోళ్లను ఏవిధముగా కట్టివేయునో చూడుడు!

## మరణ దండన

సూఫీ 'సర్మద్' ఆలంగీరు చక్రవర్తి యొక్క యాజ్ఞచే ౧౦౭౦ హిజ్రీ (క్రీ. శ. ౧౬౫౯) సంవత్సరమున మరణదండనకు పాత్రుడయ్యెను. ఆసంవత్సరమే యాలంగీరు కూచ్‌బిహారు, అస్సాము రాష్ట్రములపై దండెత్తెను. చారిత్రకు లాయుద్ధవర్ణనమునకే ప్రాముఖ్యము నొసగిరి కాని భక్తాగ్రేసరుడును, వేదాంతియు, విరాగియు నగు 'సర్మద్' యొక్క నామమైన నుచ్చరింపలేదు. ఆ యుద్ధవిజయధ్యానములలో తలవరి యొక్క కరవాలము క్రింద బ్రహ్మైక్య మొందిన 'సర్మద్' ముఖోద్గతములగు తీవ్రబ్రహ్మైక్య వాక్యములు భవిష్యత్కాలమున నెవ్వరికిని వినరావని తలచిరి కాబోలు నీచరిత్రకారులు! కాని సత్యము—అదియు నింత క్రూరమైన సత్యము—ప్రపంచము యొక్క కన్నుల నుండి ఎంతోకాలము దాగియుండుటకు వీలుపడదని వా రెరుగరు. షేరుఖాన్‌లోధీ తన 'మిరాఅతుల్ ఖయాల్' అను పుస్తకములోను, 'అలీఖులీ ఖానుడు' తన 'రియాజు మేఅరా' అను కవులచరిత్రమునందును 'సర్మద్' చరిత్రను గ్రంథస్థమొనర్చిరి. మరికొందరు గ్రంథకర్తలుగూడ విన్నంతకథను సమకూర్చిరి. అవియే యాధారములు.

## వంశ చరిత్ర

సర్మద్ పర్షియాదేశములోని 'కాషాన్' పురవాస్తవ్యుడు. ఇతని వంశమువారు ఆర్మీనియన్ జాతికి చెందిన యూదుమతస్థులై యుండిరని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఆకాలపు పర్షియాదేశము వారు ఏమతస్థులైనను ఫారసీ భాషయందు సరసమైన కవితాశక్తిని చూపినటుల నిదర్శనములు కలవు. మతమునందుతప్ప నాదేశస్థులగు నితరమతస్థులు మహమ్మదీయులతో జాతీయసంస్కృతికి సంబంధించిన ఏవిషయమునను తీసిపోనివారు. ఇస్లాంమతముయొక్క విజ్ఞానకిరణములు ప్రసరించుచు, జాతిమతసాంఘిక విభేదముల నన్నిటిని తుత్తునియలు జేయుచు ప్రపంచమంతటను విజృంభించెను. అరేబియా, అబిసీనియా, ఈరాన్ మున్నగు దేశములందు ఎడారులనక అడవులనక, పట్టణములనక పల్లెలనక, పెద్దలనక పిల్లలనక అందఱ నాకర్షించి సార్వజనీనమై వ్యాపించెను. ఆ కిరణప్రసారమున నజ్వలముకాని జాతియే లేదు, వ్యక్తియే లేదు. ఎంతవరకు కాంతివంతమైనది ఆజాతియొక్కయు, నా వ్యక్తియొక్కయు పూర్వసంస్కారముపై నాధారపడియుండెను

ఇట్టి 'సర్మద్' ఈరాన్ యొక్క ఆర్మీనియన్ జాతికి చెందిన యూదుమతస్థుడో, లేక క్రైస్తవుడో అయ్యున్నను, ఎలప్రాయముననే యిస్లాంమతముచే నాకర్షింపబడి యామతమును స్వీకరించెను. ఇతని చరిత్ర చెప్పదగా తెలియదు. 'సర్మద్' అను పేరుతప్ప నితని తలిదండ్రు లెవరో, పూర్వనామ మేమియో, ఇస్లాంమతమును స్వీకరించినపిదప గలిగిన నామాంతర మెద్దియో ఎవరికిని తెలియదు. పరమయోగియగు నితడనామధేయుడగుట, లేక యజ్ఞాతచరిత్రుడగుట సమంజసమేగదా! 'సయీద్' అను పేరొకటి ఇతని 'సర్మద్' అను కవితానామమునకు కొందఱు గ్రంథకారులు తగిల్చియున్నందున, బహుశః అది యతని నామభాగమేమో యని యనుమానము. ఇంతకన్న నితని బాల్యచరిత్రమును కాని, యితని విద్యాభ్యాసనాది వివరములు గాని తెలిసికొనుటకు వీలులేదు. ఆకాలమున నరబ్బీ ఫారసీభాషలందు విశేషపాండిత్యమును గడించినవాడనిమాత్రము గ్రంథకారు లందరు ఏకకంఠ్యులై వచించుచున్నారు.

## వృత్తి వ్యాపారములు

వాణిజ్య మితని వృత్తి. ఈరాన్ నుండి సరకులను తీసికొని యమ్ముకొనుటకై హిందూస్థానమునకు వచ్చెను. హిందూస్థానమపుడు విలువగల సరకులకే యాలవాలము కాదు; రసికులగు మనుజులకును నాసాకారమై విలువగల మనుష్యులను దన విశాలగర్భమున లీనమొనరించుకొను శక్తియు గలిగియుండెను. పాపము, సరకు లమ్ముకొన దలచి ఈదేశమున ప్రవేశించిన ఈయువకుడు తనపూర్వసంస్కారముచే నాకర్షితుడై, ఈడ్చుకొనబడినవాడే గాని కొసకు దన ప్రాణధనమునే ఈదేశమున కర్పించి విలువలేని కీర్తిని గడించి, దన నామమును చిరస్మరణీయముగా జేసికొందునని కలనైనను దలచియుండడు గదా! భారతదేశముయొక్క మణిమాణిక్యాదులను గొనుటకై వచ్చి తుదకీయువకుడు దన జీవిత ధనభండారమునే ఈదేశమునకు సమర్పించి కీర్తికాయు డయ్యెను.

ఆకాలమున సింధుప్రాంతములనుండి ఈరాన్ దేశపు వ్యాపారు లీదేశమునకు వచ్చుచుండిరి. సింధుప్రాంతములోని పట్టణములలో 'ఠట్టా' యను పట్టణ మొకటి ముఖ్యమైన దపుడు. ఇపు డది పాడుకొంప. దేశపటమున దానికి ప్రాముఖ్యమే లేదు. ఆపట్టణముననే తొలుకొత్త భారతదేశీయ సౌందర్యలావణ్యము లితని నాకర్షించి యున్మత్తుని గావించెను. ఇతడొక హిందూయువకుని స్నేహము నాపించి యతని ప్రేమానురాగవల్లికలచే సంపూర్ణముగా బద్ధుడై విడజాలకుండెను. ఆసఖుని లోలాపాంగవీక్షణముల విభ్రమములకు కట్టుబడి హృదయసమర్పణము నొనర్చెను. ప్రణయైకజీవితుడగువానికి దన ప్రేమాస్పదమగు వ్యక్తియొక్క పుట్టుపూర్వోత్తరములు, మంచిచెడ్డలు, ధర్మాధర్మములు విచారణీయములు కావు. అస లక్కడ విచారమునకు తావే లేదు. ఆకంటికి లోపములే కనపడవు. ఎట్లైనను ఆ హిందూయువకుని ప్రేమానుబంధమే 'సర్మద్' జీవితసౌధమునకు ప్రథమసోపానమయ్యెనని తెలియుచున్నది.

## సూఫీమతము

'ఇష్క్-హకీకీ' (భగవద్భక్తి) కి ఇష్క్-మజాజీ (మానవప్రేమ) పునాది యని సూఫీలును, భక్తులును నమ్ముచుందురు. ప్రణయజీవన మొక యజ్ఞ మనియు, నీయజ్ఞమునం దాహుతియగుటయే ప్రణయపథానువర్తి యగు వానికుని ధర్మమనియు, నీధర్మము నిర్వర్తించనిదే భగవన్మందిరద్వారముల ప్రవేశించుట కర్హత కూడ చిక్కదనియు నీ సూఫీల మతము. ప్రేమమార్గమునందు గలుగు హృదయోద్వేగజనిత పరిపాకము భక్తిమార్గానువర్తుల కవసరమగు ఆత్మసంస్కారము. ఈసంస్కారము నపేక్షించుచు హృదయవేదన నొసగుమని సూఫీలు ప్రార్థింతురు. 'అత్తార్' అను సుప్రసిద్ధ సూఫీకవి,

"నాస్తికుని నాస్తికత యేల? నాకు వలదు;
ఆస్తికుని యాస్తికతకేని యాసపడను.
చిత్తసంశుద్ధి గోరెడు మత్తునకును
రాగసంతప్తవేదనారజమె చాలు!"

అని పాడెను. ముగ్ధస్మేరమగు ప్రేయసీ మోహన ముఖారవిందముపై గప్పిన ముసుగు తొలంగినచో నే చిత్తముయొక్క శాంతిసౌధముపై పిడుగులు పడవో, యాజీవచ్ఛవచిత్తము నిరతిశయలావణ్యగుణ పరిపూర్ణమగు భగవద్విలాసము నేరీతి గనుగొనజాలును? ఏశిథిల మనస్కుడు దన మధురనిశీథులను ప్రణయినీదృగ్విలాస విభ్రమముల మననము సేయుచు గడుపుట నెరుగడో, వాని కానందస్వరూపుడగు ప్రణయమూర్తిని ధ్యానించుచు రాత్రులు తపించు భాగ్య మెట్లబ్బును? ఏగర్వోపహతుడు దన ప్రణయనిధానము నెల్ల ప్రేయసియొక్క మదగజగమనగర్వితచరణద్వయంబుపై సమరంబు జేయలేడో, వానికి నాత్మస్తుత్యాహంభావరూపములగు శిలావిగ్రహముల బగల్చుట కేరీతి శక్తిగలుగును? ఏశుష్కహృదయుఁ మనోహారిణీమధురాధరసంజనిత గానామృతముచే నున్మత్తమై పరిభ్రమింపదో; యది పరమపురుషుని వేణునాదసుధాలహరిచే నెట్లు తరంగితమగును? పూర్వము కాలిన వత్తియే తీవ్రముగా నంటుకొని జ్వలించును గాని క్రొత్తవత్తిని పెట్టిన దీపము వెలిగించుట కాలస్య మగునుగదా?

"వేదనాభరచిత్తమందున
వేగమే ప్రణయంబు బుట్టును
పొగలునెగ్లిసు దీపకళికలు,
పొంగి వేగమె వెల్గవే?"

ఐన నీ 'యిష్క్-మజాజీ' ప్రథమ సోపానము మాత్రమే! ఆమెట్టును దాటి పైకి వెల్లినవానికి నీయుపకరణంబు లనవసరములు, నిరర్థకములు. కావున 'సర్మద్' కీ యుపకరణము నొసగిన వ్యక్తియగు నా హిందూయువకుడు చిరస్మరణీయుడు! ప్రణయ వీథిలో నమ్మబడిన 'సర్మద్'ను గొన్నవా డా యువకు డని మాత్రము తెలియును. కాని యతని చరిత్ర మజ్ఞాతము. ఆతడు సూరత్ నివాసియని యొక గ్రంథకర్తయు, అజీమాబాద్ (పట్నా) వాస్తవ్యు డని మరి యొకరును వ్రాసినారు. కాని ఈ గ్రంథములలో పురాతన మగు 'మిరాఆతుల్ ఖియాల్' అను గ్రంథమున సింధుప్రాంతములోని 'తత్తా' నగరవాస్తవ్యు డని చెప్పబడినది. కావున నిది యెక్కువ విశ్వసనీయమైన దని తలచవచ్చును.

## జ్ఞాన వైరాగ్యము

ఈ ప్రణయజీవనము 'సర్మద్'కు రానురాను జ్ఞానవైరాగ్యసమన్వితమగు నొక యున్మాదముక్రిందికి పరిణమించినది. ఐహికసంపత్తుల నన్నిటిని త్యజించి సర్మద్ విరాగియయ్యెను. సర్వవిధ వాంఛలను వదలి యోగి యయ్యెను. కొంతకాలము సాంసారిక సంబంధములలో వస్త్రధారణమను బంధమును మాత్రము వదలలేదు. పిదప నదికూడ వదలి దిగంబరుడయ్యెను. ఈ బంధము లన్నియు విజ్ఞుల మనుకొనువారికే కాని యున్మత్తులగువారి కేల? ఇట్లీ దిగంబరమూర్తి చిరకాలము సింధుప్రాంతములోని గ్రీష్మతప్తము లగు నెడారులలో దనకాళ్లను గాల్చుకొని పిదప భారతదేశము యొక్క ఇతరప్రాంతముల నెల్ల గ్రీష్మాతప శరచ్ఛీతంబుల నొక్కవిధముగ బుచ్చి పర్యటన మొనర్చెను. తుద కాకనులపార పీడెను. మాయాయవనిక జరిగి సత్య దృశ్యము గోచరించెను.

"ఏల వృథాపథంబుల జ
రించెదు! విశ్వప్రియానుషంగవ్యా

ద్వేలవిలోలచిత్తమున
వేసరకిట్లు వెదకంగనేల? చాల్
చాలు స్థిరంబునొందు మొక
స్థానము జేరి సుఖింపు; దైవమే
ఏలికయేని తానె స్వయ
మే యరుదెంచును గర్మవార్థపై"

### దారాషికో

ఈభావము కలిగినపిదప నొక స్థిరనివాసము చేర్పరచుకొనుట కభిలాష కలిగెను. ఆకాలమున నాలంగీరు రాజకీయరంగమున క్రొత్తనడకను ద్రొక్క నంకించుచుండెను. షాజహానుచక్రవర్తియొక్క తుది రోజు లవి. దారాషికో అతని యువరాజు. మొగలాయీ చక్రవర్తుల వంశములో నీ దారాషికో ఒక విచిత్రమైన, విశిష్టమైన వ్యక్తి. అతని సుగుణసంపదలు, శక్తిసామర్థ్యములు శత్రులగు చరిత్రకారుల చేతులలో మఱుగుపడి పూర్ణముగా దెలియకున్నవి. అతడు విజ్ఞాన ప్రియుడు, ధర్మజిజ్ఞాసువు. యోగులు, పండితులు, సూఫీలు అన్న నతనికి ప్రేమ. సదా వారి సాహచర్యము, పండితగోష్ఠి యతని దినచర్య. కాలవాహినిలో కొట్టుకొనిపోవక నిలచిన యతని వ్రాతలవలనే యతని జ్ఞానసంపద వెల్లడియగుచున్నది. తత్త్వజిజ్ఞాసలో నతడు మతభేదములను పాటింపలేదు. ముస్లింఫకీర్లు సూఫీలు నతని కెంత పూజ్యులో, హిందూయోగులు సాధులు కూడ నంతే పూజ్యులు. ఈ మతవిభేద మాతత్త్వజిజ్ఞాసువువద్దకూడ నుండిన, నతడు నిజమగు జిజ్ఞాసు వెట్లగును? శలభము దీపమును వెదకవలసినదే కాని యా దీపము కాశిలో నుండినను, కాబాలో నుండినను శలభమునకు సమానమే! దేశద్రిమ్మరియైన దిగంబరుడు 'సర్మద్' 'షాజహానాబాద్' ఢిల్లీకి వచ్చి యక్కడ నిలచిపోయెను. అచట విధి యీతని పాదములకు సంకెళ్లను వేసెను. దారాషికోకు పిచ్చివారలపై ఎక్కువప్రేమ గనుక నితనిని దగ్గరకు దీసెనని 'మిరాతుల్ ఖయాల్' కర్తయు, ఆలంగీరుభక్తుడునైన అలీషేరు వ్రాసియున్నాడు. పాపము, ప్రపంచములోని బుద్ధిమంతత్వము నొక పళ్లెమునను, ఈపిచ్చితనము నొకపళ్లెమునను పెట్టి తూచుటకు తగిన త్రాసుకూడ నొకటి గలదని ఈఅలీషేరు కేమి తెలియును? ఈప్రపంచమున నితరుల బుద్ధిమంతత్వముయొక్క నిధికి బదులు 'సర్మద్'కు గలిగిన యున్మాదలేశము లభించిన చాలు ననువారుకూడ కలరు. ఆలంగీరుయొక్క బుద్ధివైశద్యము కంటె దారాషికోయొక్క యున్మాదము మెచ్చదగినది కాదా? ఆబుద్ధిబలము భ్రాతల రక్తముచే సిక్తమైనది; ఈ యున్మాదము స్వరక్తనాళముల బలినొసగి యాత్మ సమర్పణము గావించినది. ఇట్టి యున్మాదమే దారాషికోకు ప్రియతరముగా నగపడిన చిత్రమేమి?

### దారాషికో పలాయనము

దారాషికోకు సర్మద్‌పైన భక్తివిశ్వాసములు వృద్ధియయ్యెను. అప్పుడప్పుడు బయటికి వెడలినను సర్మద్ ఢిల్లీని విడచిపోవలేక పోయెను. షాజహాను చక్రవర్తి రోగగ్రస్తుడైనందున దారాషికోయువరాజు రాజకార్యములను చూచుచుండెను. ఈర్ష్యాగ్రస్తుడగు ఆలంగీరుయొక్క సంకల్పముల కవకాశము చిక్కెను. కొంతకాల మలజడులు కల్గించి రక్తపాతము నొనర్చి తుదకు ౧౦౬౮ హిజ్రీ (క్రీ. శ. ౧౬౫౮)లో ఆలంగీరు సింహాసనాధిష్ఠు డయ్యెను. ఈకాలము దారాషికోయొక్క స్నేహితులకును, సహచరులకును అతనికంటె కష్టతరమైనది. దారాషికోవెంబడి పట్టణము విడచిన వారు విడచి వెళ్లిరి. కాని సర్మద్‌వంటి యున్మత్తున కంతటి యవకాశ మెక్కడ లభించును? అన్నియు మరచిపోయెడు నున్మత్తసమాధిలో నీ గడబిడలు, నీ పలాయనములు సర్మదున కేమి తెలియును? తెలిసినను, ఇతడు వెళ్లువాడా? ఇతనికి దన ప్రణయోన్మాదమునందలి ప్రథమసోపానముమాత్రము ముగిసిన దనియు, ముందు మెట్లెక్కుటకై యదను లభింపనున్న దనియు తెలియదా?

### సర్మదుపై నేరారోపణ

సర్మద్‌యొక్క షహాదత్ (జీవితసమర్పణము) విషయము చరిత్రకారులు వివరముల నిచ్చియున్నారు. సర్మద్ వ్రాసిన క్రిందిపద్యము మతాధికారు లగు గురుకీశాధిష్ఠితులకు కఠోరముగా దోచినది. దాని యర్థమున పూజ్యుడగు మహమ్మద్‌ప్రవక్త సశరీరముగా

స్వర్గమున కేగనను విశ్వాసము ఖండింపబడిన దనియు, నది 'కుఫర్', అనగా నాస్తికత యనియు తీర్మానించిరి.

"తెలిసిన తత్వవేత్తలు మ
ర్మించి రహస్యము లన్ని గాంచిరే
బలికిరి 'బ్రహ్మమీ జగము'
'బ్రహ్మలమేము' నటంచు ధీరతన్;
'కలసె రసూలు మింట' నని
గాథల చెప్పను మౌలవీడు జే
బలికెద తత్వ, మాకసమె
బ్రాకెను నహ్మదులోన లీనమై."

ఇందులోని వివాదాంశములతో నీవిరాగి కేమి పని? పండితమ్మన్యులు గావించు కుతర్కములపై పీతడు కన్నెత్తి చూడలేదు; చెవియొగ్గి వినలేదు. సర్మద్ నివసించు జగమునం దస్తినాస్తివాదములకు తావులేదు. విచిత్రమగు ప్రణయపథంబులో బుద్ధివాదమునకు చోటు లేదు. ప్రణయోన్మత్తుని మాటలలో జంకుగొంకు లుండవు.

నిజస్థితి యేమన నాలంగీరుదృష్టిలో సర్మద్ గావించిన గొప్ప నేరము దారాషికోహ్ యొక్క సాహచర్యము. ఏదో నెపమున నితని వధింపజూచుచుండెను. ప్రాచ్యఖండములలో నెప్పుడును రాజకీయములు మతము యొక్క తెరచాటున చరించినవి. రాజకీయకారణముల వలన గావింపబడిన వేనవేలవధలు మత మను ముసుగుచే కప్పివేయబడినవి. సర్మద్ పై మోపుటకే నేరమును దొరకనందున నితని దిగంబరత్వము 'షరా'కు విరుద్ధమని, నిషిద్ధమని సిద్ధాంతము చేసి నేర మారోపింపబడెను. రెండవ నేరము పైపద్యమునందు పవిత్రుడగు రసూలు ప్రవక్త యొక్క సశరీరస్వర్గగమనముపై అవిశ్వాసమును ప్రకటించుట. 'ముల్లాఖవీ' యనునత డాకాలమున నున్నత న్యాయాధికారి. ఆలంగీ రాతనిని సర్మద్ యొద్దకు పంపి దిగంబరుడుగా నుండుటకు కారణము విచారించెను. ముల్లాగారు సర్మద్ ను "పండితాగ్రేసరులును, విద్వజ్జన భూషణులు నగు మీరు దిగంబరులగుటకు కారణమే"మని యడుగగా "నేమి చేయుదు, షైతాన్ (ఆసురీప్రవృత్తి) ప్రబలుడై యున్నా"డని చెప్పి క్రిందిగీతమును పాడెనట.

"ఉన్నతాగ్రమునుండి క్రిందికి
నుగ్రుడై పడద్రోసెగా!
దుష్టహస్తము చేతిగిన్నెల
దూసుకొని పోయెన్
నీదు చంకలో నుండగానే
వెదకుచూటిని వెళ్లెదన్,
దొంగ చిత్రము జూడు వస్త్రము
దోచుకొని పోయెన్."

ముల్లాగారికి కోపమువచ్చెను. అందుకు సర్మద్ కారణము నొసగెను. ఇస్లాంమతమును తృణీకరింప లేదుగాని దానియస్తిత్వమునే తృణీకరించెను. 'ఇబ్లీసు', అనగా దుష్టప్రవృత్తియొక్క ప్రాబల్యమును సిద్ధాంతీకరించెను. ముల్లాగారు తిరిగివచ్చి నాస్తికుడనియు, శిక్షించుటకు తగిన యాధారము లభించిన దనియు చక్రవర్తికి మనవిచేసికొనిరెను. ఆజ్ఞాపత్రమును వ్రాయుట కుద్యుక్తుడై కలమును పట్టెను. కాని యాలంగీరువంటి దూరాలోచనపరుడు కేవలదిగంబరత్వమే శిక్షకు పాత్రుని గావింపదనియు, సర్మద్ వంటి తత్వవేత్తను, పౌరుల భక్తివిశ్వాసముల నాకర్షించుచున్న జ్ఞానిని ఇంతకంటె ప్రబలమైన కారణములేనిదే వధించు టొప్పదనియు విలంబముగావించెను.

ఇస్లాం యొక్క పదమూడువందల సంవత్సరముల చరిత్రలో శాస్త్రజ్ఞుల కలము ఒరలేనికత్తియై కనుపడుచున్నది. వేనవేలు తత్వజ్ఞుల రక్తముచే వారి ధర్మపరిష్కారములు కళంకితములై యున్నవి. ఇస్లాం యొక్క చరిత్ర నెటునుండి చదివినను, రాజు మరణదండన విధించుట కుద్యుక్తుడైనప్పుడు న్యాయాధీశుని యొక్క కలము, సేనాధిపతియొక్క కరవాలము రెండును అనుగుణ్యముగా పనిజేసినటుకు వందలకొలది యుదాహరణములుకలవు. సూఫీలు, దేశభక్తులు మాత్రమే కాదు- మతశాస్త్రజ్ఞులలోకూడ నెవరు తత్వరహస్యములను సమీపించిరో వారు న్యాయాధికారుల క్రోధమునకు గురియై దుఃఖముల పాల్పడిరి. తుదకు తలనిచ్చి ముక్తినొందిరి. సర్మద్ కూడ నదేకత్తికి బలియయ్యెను.

## పండిత పరిష్కారము

తుదకు సర్మదును పండితులు, విజ్ఞులు మున్నగు వారిసభకు రప్పించి పండితులందరి యభిప్రాయప్రకా

రము పరిష్కరింపవలయునని తీర్మానింపబడెను. సభ సమావేశ మయ్యెను. సర్మద్ రప్పింపబడెను. ప్రప్రథమమున చక్రవర్తి స్వయముగా నితని సంబోధించుచు, "సర్మద్ దారాషికోకు రాజ్యప్రాప్తియొక్క యాశీర్వచనము నొసగెనట నిజమేనా"? యని ప్రశ్నించెను. అందుకు సర్మద్ "ఔను. ఆ యాశీర్వచనము నిజమై పరిణమించెను. అతడు చిరస్థాయియగు రాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను." అని బదులు చెప్పెను. పండిత ప్రవరులందరు "దిగంబరత్వము శాస్త్రవిరుద్ధము. ఈనియమమునకు విజ్ఞులును, మూఢులును అందరు సమానులే." యని వచించిరి. ఈపూర్వపక్షమునకు మొదలే సర్మద్ ప్రత్యుత్తర మిచ్చియుండెను—"దొంగ చిత్రము జూడు వస్త్రము దోచుకొనిపోయెన్" అని.

ఆలంగీరుచక్రవర్తియొక్క తుదికాలమున 'ఖలీఫా యిబ్రాహిం బదఖుషానీ' యను నొక పూజ్యుడగు విబుధుడుండెను. అతనిపలుకులుగా 'పాలేకదాగిస్తానీ' యను రచయిత ఈకథ నీక్రిందివిధముగా దెలుపుచున్నాడు. ఆపండితుల సభలో సర్మద్‌ను వస్త్రములు ధరించుమని పలికిరట. అతడు కాదనియెను. చక్రవర్తి పండితులతో "దిగంబరత్వము వధించుటకు పాత్రుని జేయు తప్పు కా"దనిపలుకుచు సర్మద్‌ను కల్మా చదువుటకై కోరెను. కాగణ మేమన సర్మద్ 'కల్మా' చదువునపుడు 'లాఇలా' అనిమాత్ర ముచ్చరించువాడు; 'ఇల్లల్లా' యను తుదిభాగ ముచ్చరింపడు. ఈసంగతి తెలిసియే చక్రవర్తి అట్లు కోరెను. సర్మద్ అట్లే 'లాఇలా' యని చదివి విరమించెను. ఇది కేవలము నాస్తికత యని పండితులందరు విజృంభించిరి. సర్మద్ అందుకు "నేనింకను 'నాస్తి' యనుమాటలో నేపడియున్నాను. 'అస్తి' యని పలుకు మెట్టువకు చేరలేదు. చేరనికే తుది వాక్య ముచ్చరించినచో నసత్య మగును. హృదయమున లేనిది వాక్కున కెట్లువచ్చును?" అని సమాధానము చెప్పెను. ఇట్లనుట నిస్సందేహముగా నాస్తికతయని పండితులు నిర్ణయించిరి. దీనికి శిక్ష వధయని తీర్మానించిరి. ఈ పండితమ్మన్యు లస్తినాస్తియను శుష్కవాదములందు బడి సర్మద్ ఈ మెట్టును దాటినవాడనియు, తమశిక్షలకు చెరవడనియు తెలిసికొనలేదు. వీరు తమ మద్రసాలోను, మస్జిదు ప్రాంగణమునందును నిలుచుండి తమయౌన్నత్యముపై గర్వించుచుండిరి. అతడు 'కాబా' దేవాలయము రెండును సమానముగా గన్పడుచు రెంటి ధ్వజము లొకేసారి ఏకముఖముగా నెగురుచుండుట గాన్పించునట్టి విశ్వ ప్రణయసౌధాగ్రభాగమునుండి చూచుచుండెను.

సర్మద్ తన మనోభావములను నిస్సంశయముగా వెల్లడించెను. అనుమానప్రమాణములచే సంతృప్తినొందని జిజ్ఞాసువులు ప్రత్యక్షస్వరూపదర్శనముచే దమ విశ్వాసమును దృఢీకరించుకొన గోరెదరు. ఈ ప్రత్యక్షస్వరూపదర్శన మింకను సర్మద్‌కు లభింపకుండెను. అందువలన తాను చూడని పదార్థము 'కలద'ని యెట్లనును? జిజ్ఞాసామార్గమున నడచు పాంథులందర క్రీపయానమున దోవలో నిట్టిమెట్టుల దాటవలసియుండును. సర్మద్ గావించిన దోషమేమన నితరులు పరోక్షముగా దాచుచు ద్రావెడు మధువు నితడు ప్రత్యక్షముగాను, నిర్భయముగాను నోటికిపట్టెను. అందువలన శిక్షకు పాత్రుడయ్యెను. ఇట్లు నిర్భయముగా ప్రకటించుట గూడ సర్మద్ కవసరమైన యుపకరణమే. పరమేశ్వర సాక్షాత్కారమే కోరుచున్నవానికి నీవిధమున సారూప్యమును బొందుటయే ఫలము.

## కుత్తుక ఉత్తరింపు

ఇట్లు సర్మద్ పండితులయాజ్ఞను శిరసావహించుటకియ్యకొననందున వధ్యుడని యుత్తరువు గావింపబడియెను. మరునాడు వధ్యశిలకు తీసికొనిపోయిరి. ఇది ౧౦౭౦ హిజిరీ, యనగా నాలంగీరుచక్రవర్తి పట్టాభిషిక్తుడైన రెండవ సంవత్సరము. 'అనల్ హక్' (సోహంబ్రహ్మ) అని జీవబ్రహ్మైక్య సిద్ధాంతము నుచ్చరించు పరమయోగిపుంగవుడు 'మన్సూర్' ఒకడు, రెండవవాడు 'సర్మద్'. ఇతని వధ్యశిలకు గొంపోవునపుడు గుంపులుగుంపులుగా పురజను లందరు గుమిగూడి ఈయజ్ఞమును కనులార గాంచిరి. తలవరి తన కరవాలమును మెరపించుచు ముందుకు దుముకుచుండ, సర్మద్ ముందుకు నడచి "రమ్మురమ్ము! వచ్చితివా ? నీ వేరూపమున వచ్చినను నేను నిన్నెరుంగుదు" నని స్వాగత మొసగెను. ఈక్రింది పద్యమును చదువుచు

ధైర్యముతో తన శిరస్సును కరవాలమున కెరగావించెను.

"వింటిని తీవ్రనినాదము
కంటిని కనువిప్పి, 'నాస్తి' కలయయ్యెను; మే
ల్కాంటినో మరి నే కూరుకు
చుంటినో, విరహార్తి కుటిలశూన్యనిశీథిక !"

'మిరాఅతుల్ ఖయాల్' గ్రంథకర్తయు చక్రవర్తి యొక్క స్తోత్రపాఠములనుండి సర్మద్ యొక్క రక్తసిక్తమగు శవముపై రెండుకన్నీటిచుక్కల నైన విడుచుటకు తీరిక చిక్కలేదు. కాని యంతటితో తృప్తి చెందక నీరక్తపాతమునుగూడ నాలంగీరుయొక్క సుగుణవర్ణనకథనంబున నొక రత్నముగా పరిగ్రహించి ఈసుకృతఫలంబు నపేక్షించుచున్నాడు.

సర్మద్ యొక్క సమాధియని తలపబడు ప్రదేశము సమాధి కాదనియు, వధింపబడిన స్థలమనియు కొందరిమతము. కాని వధింపబడిన స్థలముననే యుకని శవమును సమాధిస్థ మొనర్చిరని 'షాలేబాగిస్తానీ' విశదీకరించియున్నాడు. కావున రెండు నొకటియే యని నమ్మవలెను. మరియు "నేను రెండవసారి ఈ సమాధిని దర్శించితిని. అన్నిఋతువులందును దానిపై పచ్చిక మొలచియుండును. ఈవిచిత్రము రెండవ మకానూరనదగు నీతని మాహాత్మ్యమేమో" యని వ్రాసుకొన్నాడు. ఈగ్రంథకర్త మహమ్మద్ షా కాలమున ౧౧౬౦ హిజరీలో దన గ్రంథమును రచించెను. ఇప్పటికిని ఈ సమాధిని దర్శించినవారు ఫాతిహా (శాంతిపాఠము) జదివి వెళ్ళుచుందురు.

బ్రతికియుండినపుడు 'లాఇలా' యను ప్రథమ భాగముమాత్రము పలుకుచుండిన సర్మద్ యొక్క ముఖము కంఠచ్ఛేదితమై 'లాఇలాహిలిల్లల్లా' యను పరిపూర్ణవాక్యమును మూడుసారు లుచ్ఛరించెననియు, లోకు లీదృశ్యమును గాంచిరనియు, వినిరనియు నైగ్రంథకర్త వ్రాసియున్నాడు. ఈకాలమున నిట్టి గాథలను పుక్కిటిపురాణములని జనులు విశ్వసింపక పోవచ్చును. కాని సత్యాన్వేషణకు పూనుకొనిన వానికిని, వసంతమున వికసించిన పువ్వులను హేమంతమున శుష్కించిన కొమ్మలను మాటలాడుచు వినిన వానికిని, ప్రణయబలికొసగిన సర్మద్ యొక్క శిరచ్ఛేదితములగు పెదిమెలు కదలుట, శబ్దములు వినిపించుట ఆశ్చర్యజనకమా?

పట్టాభిషిక్తుడైన రెండవయేట నీరక్తపాత మొనర్చిన యాలంగీరుచక్రవర్తి తరువాత ౪౬ సంవత్సరములు రాజ్య మొనర్చెను. ఈకాలమున నెప్పుడు నతనికి శాంతిలభింపలేదు. తుదకవసానకాలముకూడ పరస్థలములోను, విషాదావస్థయందును సంభవించినది. ఏమహాత్ముని రక్తబిందువుల ప్రభావమో? కాని యామహాత్ము లొకవాక్యమేని బలుకనప్పుడు మన కేల చక్రవర్తిపై కోపము?

['రుబాయ్యాత్ సర్మద్' అను కావ్య గ్రంథమునకు రాష్ట్రపతి అబుల్ కలాం ఆజాద్ గారు వ్రాసిన పీఠికకు ఇది సంక్షిప్తానువాదము.]



# మనోహరమైన ముఖ కాంతిని పొందుటెట్లు



కోమలమైన ముఖకాంతిని స్త్రీలు సామాన్యముగా పొందగలరు. దీనిని నిరాకరించిన మీ సౌందర్యమునే కొంతవట్టుకు చెడగొట్టుకొనెదరు.

స్త్రీయొక్క సౌందర్యమును అభివృద్ధిచేయుటకై అనాది నుండి అనేకసదుపాయములు ఉండినను ఆమెముఖము మోటుగాను అనాకర్షణీయముగాను యుండిన మీ ఉపాయములు ఏమియుపనికిరావు. చర్మరంధ్రములందు మలినము చేరుటవల్లను, ఎండ, వేడిగాలివల్లను చర్మము పగిలి మోటుగానుండుటవల్లను ముఖము కాంతివిహీనమగును. ప్రతిదినము తప్పక పాండ్స్ క్రీములు రెండిటిని వాడిన మీముఖము గులాబిరేకులవలె కోమలముగానుండును. వీటిలోనుండు తైలములు చర్మరంధ్రములలో బాగుగాజొరబడి అందుండుమురికిని పోగొట్టును. ప్రతిరాత్రి,ఉదయము ముఖమునకు మరియు మెడకు పాండ్స్ కోల్డ్ క్రీమును కొనవ్రేళ్లతో మెల్లగా రాయుము. రోమరంధ్రములందుండు క్రొవ్వును, మురికినికరగించుటకు కొన్ని నిమిషములు అట్లేయుంచిపిదపతుడిచివేయుము. పగలు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును ఉపయోగించుము. ఇదిచర్మముమీద కంటికి తెలియని,జిడ్డులేనిపొరనొకటినిఏర్పరచి ఎండ, గాలిదుమ్ములనుండిముఖమునురక్షించును. ఈదినమే పాండ్స్ క్రీములను ఉపయోగించుటకు మొదలిడుము. కొన్ని వారములలోనే మీముఖముయౌవనభరితమైయుండును.



# * పాండ్స్ క్రీమ్ *

# మనిషి మనసు

[ కథానిక ]

శ్రీ రా. సి. ఆంజనేయశాస్త్రి

౧

అతని చూపులు మొదట్లో నా కర్థంకాలేదు. రిక్షా ఎక్కి బళ్లో కెళుతుంటే వీథిఅరుగుమీది కొచ్చి మహాఆప్యాయంగా చూసేవాడు నాకేసి. బాగా చిన్నతనం. ౧౧,౧౨ ఏళ్లుంటాయేమో నాకు. నా పట్టుపరికిణీకేసి చూస్తున్నాడేమో ననుకున్నా మొదట్లో. సరికొత్తరకం. మా నాన్నే పట్నంనుంచి మొట్టమొదటగా తీసుకొచ్చాడు. కాని, మొన్నాడు మామూలు పరికిణీ కట్టుకొచ్చినాకూడా అల్లాగే చూశాడు. బహుశా నిన్నటి పరికిణీయే యివాళకూడా కట్టుకొస్తా ననుకున్నాడేమో! కాని మూడోనాడూ అంతేనే? ఓవేళ తల్లో పెట్టుకున్న దండకేనేమో! దండలు కట్టడంలో మా పనిమనిషి మహానేర్పరి. దండ పెట్టుకోని రోజు కూడా అలాగే చూస్తాడేం మరి! చేతిరుమాలూ, పూల జాకెట్టూ, పట్టుగొడుగూ, రబ్బరు బూట్సులూ- దేనికేనీ? దేనికోసమూ కాదు అతను చూసేది. అంతే మటుకు నాకు తెలిసేది. కాని ఎందుకు చూస్తాడో మట్టుకు అర్థమయ్యేదికాదు. ఎందుకో మరి, నాకేసి, నా మొహంలోకి, కళ్లల్లోకి గుచ్చుతున్నట్టు అల్లా చూడటం? ఓమాటు మా రిక్షా లాగే ముసలాడిని అడిగా కూడా— "ఎందు కతను రోజూ నాకేసి అలా చూస్తాడు?" అని.

"నీ కెలా తెలిసింది, ఆయనకేసి నువ్వు చూడక పోతే? అలా చూడరాదమ్మా..." అన్నాడు ముసలాడు. ఛీ! అతనికేసి నేను చూడట మేమిటి! అవునూ, రోజూ అలాగే అరుగుమీద నుంచుంటాడుకనక, రిక్షా అక్కడికి కొచ్చేసరికి, ఊరికే తమాషాకి అటు తిరుగుతాను, అత నున్నాడో లేడో అని. ఉండనే వుంటాడు...తరవాత తరవాత అతన్ని గమనించటమే మానేశా...అంటే అదే, ఆధ్యాసే లేదు.

ఒల్లెవాటు వేసుకుని ఒక్కత్తే వాకిట్లో కొచ్చిన గుర్తే లేదు నాకు. అది నా మనసుకి ఉగ్గైపోయింది. బడి మాన్పించి యింట్లోనే ఓ ముసలిపంతులుచేత చదువు చెప్పించటం మొదలెట్టారు. వెధవపొడుంవాసనా ఆయనా! చూస్తేనే అసహ్యంవేసేది. "లెక్క తప్పు చేశావేం?" అంటూ మాటిమాటికీ బుగ్గమీద చిటికెలు వేసేవాడు. మహా గరిపాడిచేది. ఎప్పుడన్నా ఏం తోచక వీధిగుమ్మంలో నుంచుంటే మా అమ్మో, అత్తయ్యో ఏదో పెద్దపనున్నట్టు లోపలికి పిలిచి "అమ్మాయీ! అలా నుంచోరాదమ్మా, ఎవరన్నా చూస్తే ఏమను కుంటారు?" అనేవాళ్లు. నాకు నవ్వొచ్చేది. ఎవరన్నా చూస్తారుట! ఏం చూస్తే? చూసి ఏమిటో అనుకుంటా రుట! ఏమనుకుంటారూ? ఏమనుకుంటేనేమట కేం? తప్పేమిటో నాకేమీ అర్థం కాలేదు. నాకదో జైలులో పెట్టినట్టుగా వుండేది — కమ్మటీ భోజనం, మంచి యిల్లూ వాకిలీ, నగా నాణెం అన్నీ ఉన్నా కూడా. నిన్న మొన్నటిదాకా లేని మార్పు నాలో కలిగింది. అస్తమానం వీధిమీదే ధ్యాస. బడి మానెయ్యటం, యింట్లో పనీ పాటా లేకపోవటం, పైగా, మా వాళ్లు వీధిగుమ్మంలో అడుగు పెట్టనియ్యకపోవటం- ఏమీ తోచేదికాదు.

ఒక్కత్తినీ మా గదిలో పట్టెమంచంమీద పడు కుని జరిగిన రోజులన్నీ తలపుకు తెచ్చుకుంటుంటే, రిక్షాలో వెళుతున్నప్పుడు వాళ్ల అరుగుమీద నుంచుని అతను చూసే చూపులు గుర్తుకు వచ్చేవి. ఆ చూపుల అర్థం ఏమిటో నాకింకా బాగా తెలీకపోయినా వాటిల్లో ఏదో అర్థం ఉందనిమాత్రం లీలగా అనిపించేది. ఎందుకనో చెప్పలేనుగాని గతించిన విషయాలన్నీ చర చరా వెళ్లిపోయినా ఆ చూపులదగ్గిరి కొచ్చేసరికి ఆగిపో యేది నా మనస్సు, ముందుకి జరగకుండాను. ఎందుకలా చూడాలి? ఇప్పుడుకూడా చూస్తే ఎంత బాగుంటుంది? కాని చూడరాదుటగా, మరి మా అమ్మావాళ్లూ అంటారు! అందుకనేకామాలు నన్ను వీధివాకిట్లోకి వెళ్లనివ్వరు! అంటే నేను ఎవరిచేతా చూడబడరాదన్నమాట! అయితే నేనూ ఎవర్నీ చూడరాదన్నమాటేగా? ఏమో, నేను అందరిచేతా ఆప్యాయంగా చూడబడటం, అందర్నీ నేను ప్రీతితో చూడటం-ఇది నాక్కావా లనిపించేది. ఇంట్లో నిర్బంధం ఎక్కువైనకొద్దీ నా యీ కోరికలు బలిష్ఠాలవటం మొదలెట్టాయి.

ఆనాడు నేను మామూలుగానే ఏమీ పనిలేక పట్టెమంచంమీద పడుకుని వెనకటి దృశ్యాలన్నీ కళ్లోకి తెచ్చుకుంటూ, అతని చూపులదగ్గిరి కొచ్చి, ఆగిపోయి, అర్థం తెలీక తికమకపడి పక్కకి తిరిగేసరికి, పక్క యింటి కిటికీలోంచి అతను సరిగ్గా యిదివరకటిలాంటి చూపులే చూస్తున్నాడు. నాకు కలగన్నట్టయింది. ఏమిటో కలవరం పుట్టింది. ఏం చెయ్యటానికీ తోచ లేదు. భరించలేకపోయా ఆ చూపుల్ని. నిట్టూర్పు విడుస్తూ, తొలగిన పమిట సవరించుకుని, చెంగున మం చంమీదినుంచి దూకేసి కిటికీ రెక్కలు మూసి సావిట్లో కెళ్లిపోయా. ఆ చూపులు నా హృదయానికి బాగా దగ్గిరిగా వచ్చి ఆర్పరాని జ్వాలలు రగిల్చాయి.

అనేక వస్తువుల్నీ, మనుష్యుల్నీ, విషయాల్నీ మామూలుగా చూస్తావుంటే, చూడాలనే ధ్యాసగాని, చూసినవాట్లమీద ప్రత్యేకమైన శ్రద్ధగాని వుండదు కళ్లకి. కళ్లకి తెరవేస్తేమాత్రం తెరదించుకుని చూడ బుద్ధవుతుంది. అతికష్టమ్మీద తెర దించుకుని ఎప్పుడో ఓసారి బైటపడేసరికి, కనిపించే ఏ ఒక్కదాన్నో ఎన్నో వాటిని చూసే కాంక్షంతా పోసుచేసి చూస్తాయి కళ్లు. ఆ ఒక్క వస్తువూ ఆకర్షణీయమైందౌతే చెప్ప క్కర్లేదు. ఆ చూపులో వుండతగినదానికంటే ఎక్కువ ఆసక్తి వుండటం అసంభవం కాదు.

కాళ్లూ చేతులూ విరిచి నాలుగుగోడల మధ్య కూలదోయబడ్డ నాకు అతనూ, అతని చూపులూ అంతు లేని ఆకర్షణ పుట్టించాయి. మనస్సునికూడా పెళ పెళా విరిచి ముక్కలు చెయ్యవలసిందిగా సంఘం మావాళ్లకి చెప్పలేదేమో! లక్ష్యం లేకుండా విచ్చల విడిగా చెల్లాచెదరై నడుస్తున్న భావాలూ, కోరికలూ అతని యీ చూపులవల్ల ఏకీకృతమై ఒకేదారిలో అతని వేపుకి చాలాదూరం పరిగెత్తాయి. నేనిక యీ ఏకాంత వాసం భరించలేను...అత నెందుకలా చూసేవాడో యిప్పుడు నాకర్థమైంది.

## ౨

నా గుండెల తలుపులు మూసినట్టనిపించింది కిటికీ రెక్కలు వేసేసరికి...వేసంగి సెలవులైపోయింతర్వాత యిల్లు మార్చాం. నిజానికి మేము వచ్చిన యింటిపక్కనే ఆ అమ్మాయి వుంటుందని అనుకోలేదు. ఆ అమ్మాయివిషయం నేను మరిచేపోయానన్నా కూడా ఆశ్చర్యపడక్కర్లేదు. చదువు మానెయ్యటానికి కారణం ఆ అమ్మాయి పెద్దమనిషవటం అనిమాత్రం నాకు చూచాయగా తెలిసింది. నిజమే, రిక్షాలో బళ్లో కెళుతుంటే తనివితీరా చూసేవాడిని. పచ్చని ఒళ్లూ, పట్టుపరికిణీ జాకెట్టూ, నల్లటిఉంగ్రాల జుట్టూ, నిగనిగలాడే పెద్దకళ్లూ, పాలుకారే చెంపలూ, చెంపల్ని తాకుతూండే పొడుగాటి లోలకులూ, తీర్చి దిద్దిన పలువరసా, మెరిసే పెదిమెల్లో కదిలే బుల్లినోరూ, కోటేరు వేసినట్టున్న ముక్కూ—కొంచెం బొద్దుగావుండేది ముద్దొస్తూను. అలాంటి అమ్మాయిని—లేకపోతే, ఆ అమ్మాయినే—పెళ్లి చేసుకుంటే బాగుండుననిపించేది. పాపం, ఆ అమాయకపుకళ్లతో నాకేసి చూసేది ఆ అమ్మాయికూడాను. నా చూపుల్లో వుండే విషయవాంఛల్ని అర్థం చేసుకునే యీడు లేదాపిల్లకి. పలకరిద్దామనుకునేవాణ్ణికూడాను. అయినా, పరాయి పిల్ల, మన కెందుకని ఊరుకునేవాణ్ణి. కొంతదూరమే వెళ్లి, ఆగి యిగిరిపోయిన నాభావాలు ఆ అమ్మాయిని యీస్థితిలో మళ్లీ చూసేసరికి తిరిగీ చైతన్యం పొంది నడవటం మొదలెట్టాయి. తీరని అస్పష్టవాంఛలు బలవంతాన ఆ అమ్మాయికళ్లల్లో అదిమిపెట్టబడ్డట్టు కనిపించింది. అందాలరాసులు బుగ్గలు స్పర్శకి తహతహ లాడుతున్నాయి. పొంగి పొర్లే అధరపు అరుణిమకి పెదిమెలు మూతవెయ్యటం అవసర మనిపించింది. నవనవలాడే బాహులు బంధించే వస్తువుకోసం వెతుక్కుంటున్నాయి. మెడమీద పడుతున్న ముంగురులు పురుషుణ్ణి ఆహ్వానిస్తున్నాయి. ఆపురుషుణ్ణి నేనే అవుతే...!

పురుషుణ్ణి అంత గాఢంగా వాంఛిస్తున్న ఆ అమ్మాయి గభీమని కిటికీతలుపులు వేసేయడం నా మీద విముఖతవల్ల కాదని తెలుసుకుంటానికి నా కట్టేసేపు పట్టలేదు. రెండునిముషాల్లోనే ఆ అమ్మాయి కిటికీ తెరిచి, క్షమార్పణసూచకంగా నాకేసి ఒక్కమాటు చూసి, కదపబోయే నాపెదిమెలికి నల్లతాచులాంటి తన జడని అడ్డంవేస్తూ లోపలి కెళ్లిపోయింది.

......మొన్నా డాగదిలో చిట్టుపీపా, బియ్యం డబ్బా, పాత నులకమంచాలూ, పాత్రసామాను బస్తాలూ కనిపించాయి.

పురిటి కెళ్లిన మాఆవిడ యింకా రాలేదు. ఆ అమ్మాయి ఎప్పుడన్నా ఆసామానుకొట్లో కొచ్చేసరికి ఏసంపెంగఘుమఘుమో, ఏగాజులమోతో, ఏసన్నదగ్గో నన్ను మాకిటికీదగ్గిరికి పిలుచుకెళ్లేవి. మూసీ ముయ్యని కిటికీ రెక్కల్లోంచి, కనిపించీకనిపించని ఆమె అనాస్వాదితదేహం నావాంఛలికి గిలిగింతలు పెట్టేది. ధర్మమార్గాలైన నాకోరికల్ని మళ్లించుకుంటానికి ప్రయత్నంచేస్తుంటే, నాపై నిలుప్పబడిన ఆమె దృష్టులు కొరడాల్తో కొట్టి తమవేపుకే లాక్కుపోయేవి. అపజయం అంగీకరించక తప్పేదికాదు. నేను డాబామెట్లెక్కుతున్నప్పుడు, ఆ అమ్మాయి నీళ్లకొట్లోంచి వెళుతుంటే, తడిపొడి ఉత్తరీయంలోంచి మెరిసే శరీరకాంతీ, లవండరు సబ్బువాసనా హెచ్చిన-అసలే సన్నగా వుండే బుగ్గల మెత్తదనం, అచ్ఛాదనం లేని గుండ్రని భుజాల నునుపూ, పెద్ద కళ్ల దీప్తి—అన్నీ నాహృదయానికి తెలిసేవి. క్రమంగా అలాంటి క్షణాలికి రోజంతా ఎదురు చూసేవి. ఆక్షణాల వ్యవధి ఎక్కువైనకొద్దీ కోరిక గాఢతరం అవటం మొదలెట్టింది. పెళ్లిఅయిన నేను ఆపిల్లని కోరటం అసంగతమని నాకు తెలుసు. అయినా నాలోని పశుత్వం అందాలు దొర్లే ఆదేహాన్ని అనుభవించాలని కోరమంది. కోరాను.

నిజానికి, మొదట్లో రిక్షాలో వెళ్లేటప్పుడా అమ్మాయిని చూసేవాడి నంటే, చూసేవాణ్ణి. అంతే. ఏదో తమాషాగా అనిపించేది "పెళ్లి చేసుకుంటే బావుండును ఆ అమ్మాయిని" అని. అంతేతప్ప అంతకన్న లోతుగా పని చెయ్యలేదు నామనస్సు. ఇప్పుడూ పని

చేసేదికాదు. కాని వాళ్లు ఆ అమ్మాయిగది మార్చటం, నాకంట పడకుండా వుంచటానికి ప్రయత్నం చెయ్యటం నన్ను ఊరించినట్టయింది. నాలోనిపశువాంఛకిఅంతులేని బలం చేకూరింది. అది అంతరాత్మని తొక్కేసింది. ఆశరీరాన్ని నేను అనుభవించితీరాలి ఎలాగన్నా సరే. అలా ఎప్పుడేనా మెరుపు మెరిసినట్టు కనిపించినప్పుడు కన్నుగీటడం, సైగలు చెయ్యడం, యీలలు వెయ్యడం మొదలెట్టా. ఉత్తరాలుకూడా రాశా.

ఇంతలోనే మహావైభవంగా ఆ అమ్మాయిపెళ్లి జరిగిపోయింది. నాకు చెడ్డ అవమానం జరిగినట్టనిపించింది ... ఆ అమ్మాయి అత్తారింటికెళ్లిపోయింది. పిల్లాడ్ని ఎత్తుకుని మా ఆవిడ వచ్చింది పుట్టింటినుంచి.

## 3

పెళ్లికిముందు ఆయన్ని నేను ఏమీ ఎరక్కపోయినా, పెళ్లయినతర్వాత, జ్వలితమైపోతున్న నాహృదయాన్ని ఆయన శాంతికలగజెయ్యగలడనే ఉద్దేశంతో ఆయనంటే యిష్టం ఏర్పడ్డది నాకు. కాని నెలతిరక్కుండానే ఆయన ట్రాములోంచి కాలుజారి పడి మరణించడం, ఆవార్త వినీవినడంతోటే, గుండెజబ్బు బైటపడి మా నాన్నకూడా చనిపోవడం—ఏమనాలో తెలీదుగాని మహావిచిత్రంగా జరిగిపోయాయి. దుఃఖంకంటె ఆశ్చర్యం ఎక్కువైంది నాకు. పుట్టింటికొచ్చేసింతర్వాత మా పింతండ్రిపెత్తనంలో నుంచుంటానికీ, కూర్చుంటానికీ నా కేమీ ఆటంకాలూ, అదిలింపులూ కనిపించలేదు. విదేశాల్లో చదువుకుని రావటంచేత మా బాబాయి అదోతరహాగా వుండేవాడు.

దుఃఖం కొంచెం ఉపశమించింతర్వాత బళ్లో చిన్నక్లాసుల్లో వెయ్యటం యిష్టంలేక, ప్రయివేటుగా పెద్దపరీక్షకి తయారుచేయిద్దామనే ఉద్దేశంతో, మా యింటిపక్కనే ఉండటంచేత ఆయన్ని ట్యూటరుగా ఏర్పాటుచేశాడు మా బాబాయి. చూడండి, ఎలా సమకూడుతాయో! ఆరోజు నాకు బాగా గుర్తుంది. మొట్టమొదటిగా ఆయనతో మాట్లాడేటప్పుడు నాఒళ్లు ఒణికిపోయింది. ముచ్చెమటలూ పోశాయి. రిక్షాలో వెళ్లే రోజులూ, గదిలో పట్టెమంచంమీద ఒక్కత్తెనీ ఆలోచిస్తూ పడుకునే రోజులూ, కిటికీలోంచి ఆయన చూడటం, నీళ్లకొట్లోంచి వస్తూంటే మెట్లమీదనుంచుని ఆయన చేసే చేష్టలూ, నాచూపులూ, పెళ్లి, భర్త చావూ, నాన్న మరణం, బాబాయి పెత్తనం, యీయన దగ్గిరే చదువూ — యింత భ్రమణం చేసేసరికి చాలా అలిసిపోయింది మనస్సు.

"అలా భయపడుతా వేమిటమ్మా? ఇంటిపక్కనేగా? వీరి నెరగవూ?" అన్నాడు మా బాబాయి.

"ఊఁ" అన్నా నిట్టూర్పు విడుస్తూ.

"చాలా ఘోషాగా పెంచారు లెండి. సరిగ్గా నన్ను చూసే వుండకపోవచ్చు" అన్నా డాయన.

"మారిపోతుంది లెండి యిహ" అని ఆయనతో అని, "శ్రద్ధగా చదువుకోవాలమ్మా, భయపడకుండా" అంటూ నావీపుమీద తట్టాడు బాబాయి.

ఆయనా ఉత్సాహంగానే చెప్పేవారు. నేనూ అరమరిక లేకుండా చదువుకునేదాన్ని. ఓరోజు చరిత్ర చెప్పిచెప్పి, విసుగుపుట్టి, ఏవన్నా కబుర్లు చెప్పుకుందాం అంటూ "రిక్షాలో బళ్లో కెళ్లే రోజులు గుర్తున్నాయా?" అన్నాడు.

"లేకేం!" అన్నా నేను ముక్తసరిగా.

"నువ్వు చాలా అందంగా వుంటావమ్మాయీ! వాంఛతో పొర్లిపోయే కళ్లతో చూసేవాణ్ని నేను నిన్ను" అన్నాడు పశ్చాత్తప్తుడల్లే.

"అవును. ఆసంగతి తరవాత తెలుసుకున్నా..." అన్నా గంభీరంగా.

"ఆరోజు కిటికీలోంచి నిన్ను చూసినప్పుడు నువ్వు పురుషుడికోసం తహతహలాడుతున్నావని భ్రమపడ్డా. తా నెంతో జగ మంత......" అన్నాడు వేదనతో.

"భ్రమకాదు. నిజమే. ఆపురుషుడు మీరే అవుతే బావుండుననుకున్నాను కూడాను...ఇప్పుడుమాత్రం మీరు నన్ను కోరటంలేదు. అవునా?" అన్నా ధైర్యంగా. ఆయన కొంచెం ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసు

కుని చూశాడు నా మొహంలోకి. నిజమేనన్నట్లు తలూపి "నువ్వెల్లా తెలుసుకోగలిగావు?" అన్నాడు. నేను చిరునవ్వు నవ్వి ఊరుకున్నా.

"ఇప్పుడు నీజీవితంలో ఉత్సాహం తగ్గిపోయిందనుకుంటా" నన్నా డాయనే కాస్సే పాగి.

"లేదు, తగ్గిపోలేదు. కాని కృత్రిమోద్రేకం మాత్రం చచ్చిపోయింది." అన్నా నిశ్చలంగా.

"అంటే?" అన్నాడు అర్థంకానట్టు.

"నాలుగుగోడలమధ్యా బంధింపబడటంవల్ల గాలి చొరని నాతల్లోని భావాలు అసహజమైన ఉష్ణాన్ని పొంది విచ్చలవిడిగా పరిగెత్తి కనిపించిన ప్రతిపురుషున్నీ తాకి మైలపడ్డాయి. ఇప్పుడు సహజంగా అందరితో కలిసిమెలిసి తిరగటంవల్ల కృత్రిమోత్తేజనం పొందని నాకోరికలికి, తగిన స్థిరమైన వస్తువుని ఎన్నుకునే స్తిమితమూ, దొరికేదాకా ఆగే నిగ్రహమూ ఏర్పడ్డాయి. ఆవస్తువు మీరు కాదని నేను తెలుసుకున్నట్టు మీరు గ్రహించారు. అందుకే నన్ను వాంఛించటంలేదు మీరు యిప్పుడు." అన్నా గంభీరంగా. ఇలా చెప్పటానికి చాలారోజులు తయారుచేసుకున్నా.

పెద్ద నిట్టూర్పు విడిచి "నేను నిన్ను ఎందుకు వాంఛించటం లేదో తెలుసుకుంటానికి చాలారోజుల్నించీ వ్యర్థప్రయత్నం చేస్తున్నా. అట్టే చదువుకోకపోయినా ఆ సత్యం నాకు అతిసులువుగా చెప్పేసేశావు, జ్యోతిష్యం చెప్పినట్లు. ఎలా తెలిసిందో నీకు?" అన్నాడు మరీ ఆశ్చర్యపోతూ.

"అనుభవజ్ఞానం..." అన్నా ముక్తసరిగా.

౪

"ఆ అమ్మాయికి మీరు చదువు చెప్పటం మానెయ్యండి" అంది మా ఆవిడ. నాకు చుర్రుమంది.

"ఎందుకు మానెయ్యటం?" అన్నా గద్దిస్తూ.

"ఎంత చదువుకున్నవాళ్లయినా, ఎంత అందగాళ్లయినా చేసుకున్న పెళ్లాన్ని - చెట్టంతదాన్ని ఎదట పెట్టుకుని పరాయిదానితో అల్లా వుండటం— పైగా ఓబిడ్డతండ్రులు కూడాను..." అంది మాటలు విరుస్తూను.

"అంటే? ఎలా వుంటున్నాననీ?" అన్నా విసుక్కుంటూ.

"ఆఁ, ఎలా ఉండకూడదో అలా వుంటున్నారు... నేను స్పష్టంగానే చెబుతున్నా... నాకు అనుమానంగా వుంది..." అంది ధైర్యంగా, నా మొహంలో ఏం మార్పు వస్తుందో అని జాగ్రత్తగా గమనిస్తూను. కోప్పడటంవల్లా, దబాయించడంవల్లా అనుమానాలు పోగొట్టడం అసంభవం. అందుకని సౌమ్యంగా నచ్చజెప్పదామనే ఉద్దేశంతో "...చూడూ, అనుమానాలికేమీ అర్థం లేదు...తగిన..." అర్థోక్తిలోనే అడ్డం వచ్చి చంకలోంచి జారబోతున్న పిల్లాడిని నా కందిస్తూ నా మొహంలో మొహం పెట్టి, "నిజంగా చెప్పండి, మీ రా అమ్మాయిని ప్రేమించటం లేదూ?" అని ప్రశ్నించింది అమాయికంగా చూస్తూను.

నిజంగానే ప్రేమిస్తున్నా. కాని నా ప్రేమకి పర్యవసానం ఆ అమ్మాయి దేహాన్ని అనుభవించడం కాదు. కాని ఆసంగతి దానికి అర్థమయ్యేట్లు చెప్పటం అసాధ్యం. ప్రేమించడం అంటే—అందులోనూ వయస్సులో వున్న ఓపరాయిస్త్రీని ఓయువకుడు ప్రేమిస్తున్నాడంటే—విషయవాంఛ తీర్చుకుంటానికే అని సంఘం ఉద్దేశం. విషయవాసన లేకుండాకూడా ప్రేమించటం కద్దని యీసంఘానికి తెలీదు. కనక వాళ్ల భావంలో చెప్పాలంటే నే నాఅమ్మాయిని ప్రేమించటం లేదనే చెప్పాలి.

"ప్రేమించటంలేదు, నిజంగా." అన్నా అందుకని.

"మీరు అబద్ధమాడుతున్నారని మీకళ్లే చెబుతున్నాయి. మీ నూలా నేటగా వాళ్లింట్లో ఆ అమ్మాయి గది అవతలవేపుకి మార్పించింది?" అంది నిదర్శనంతో సహా.

"నిజమే. అప్పు డా అమ్మాయిని వాంఛించా నేను." అన్నా కొంచెం గంభీరంగా.

"ఐతే మరి ప్రేమించటం లేదంటా రేం?" అని అడ్డుసవాలు వేసింది.

"ఊఁ, ప్రేమిస్తున్నా. కాని ఆమె దేహాన్ని వాంఛించటం లేదిప్పుడు. అప్పుడుమాత్రం వాంఛించా. క్షంతవ్యుణ్ని." అన్నా యింకా గంభీరంగా. తికమక పడుతున్నట్లు అమాయికంగా చూస్తూ "ఏమిటో మీ మాటలు నా కర్థం కావటంలేదు. ఆ అమ్మాయిని ప్రేమించారు మీరు. మీరే ఒప్పుకున్నారుకూడాను. ఈ అవమానం నేను భరించలేను. చాటుమాటుగా ఎక్కడ తెలిసిపోతుందో అని భయపడుతూ వ్యభిచరించడం కద్దు. కాని యిల్లా బహిరంగంగా నన్ను ఒట్టి శవాన్ని చేసి......" కళ్లనీళ్లు పెట్టుకుంది.

"వ్యభిచరించటం" అనేమాట వినగానే గుండెలు ఝల్లుమన్నాయి. పోట్లాడి తిట్టుకున్నా, కొట్టుకున్నా కూడా తట్టుకోగలంకాని ఆడది—అందులో భార్య కన్నీళ్లు పెట్టుకుంటే తట్టుకోటం కష్టం. కళ్లు తుడుస్తూ, "ప్రమాణంచేసి చెబుతున్నా. నే నాఅమ్మాయిని స్పృశించలేదు. ఆ ఉద్దేశంకూడా లేదిప్పుడు"అన్నా. పిల్లాడు నాచేతులోనే వున్నాడు. చటుక్కున పిల్లాడిని నాదగ్గిర్నుంచి లాక్కుని "ఛీ! ఆ దేమిటండీ, ప్రమాణాలెవరు చెయ్యమన్నారు?" అంది.

నేను చాలా అందంగా వుంటాననీ, చూసిన ప్రతిస్త్రీ నన్ను కామిస్తుందనీ దాని ఉద్దేశం. తను నిజంగా అనాకారిది కాకపోయినా నా అందానికి తగిన భార్య కాదని అనుకుంటూండేది. తనకంటే ఎంతో అందంగా ఉండే ఆ అమ్మాయితో అంతచనువుగా మాట్లాడుతూ చదువుచెప్పడం దానికి బాగా అనుమానం కలిగించింది. పైగా నేనే "అప్పు డెప్పుడో వాంఛించాగాని యిప్పుడుమాత్రం కోరడం లే"దని చెప్పానయ్యె. ఎలా నమ్మగలదు? అయినా, "ప్రమాణం చేసి చెబుతున్నా"అన్నతర్వాత నమ్మటానికిప్రయత్నం చేసింది. కాని దూరదూరంగా అందని పక్షిలాగా వుండేటప్పుడే ఆ అమ్మాయిని కోరినప్పుడు, ఆ అమ్మాయి తన దగ్గిరికే వచ్చి రోజూ గంటలకొద్దీ కబుర్లు చెబుతూ చదువుకుంటుంటే, ఆ కోరిక యింకా తీవ్రమై క్రియలోకి పరిణమించడం సహజం తప్ప ఎక్కడన్నా ఆ కోరిక చచ్చిపోతుందా? పైగా, ఆ అమ్మాయికి యిప్పుడు పెళ్లై, మొగుడు పోవడంకూడా జరిగిందయ్యె. అందమైనది. చదువుకుందికూడాను తనకంటె ఎక్కువ. ఆయన సరేసరి. తను చూడబోతే అనాకారిదయ్యె. చదువు సంధ్యలూ అంతంతమాత్రమే. నమ్మటానికి వీల్లేని బోలెడంత సాక్ష్యం ఉండగా నమ్మనూ లేకా, 'నమ్ము' అని తీవ్రంగా ప్రోద్బలం చేసే నా ప్రమాణాన్ని తోసేసే సాహసం లేకా, యిటునుంచి అటూ, అటునించి యిటూ కొట్టుకుంటున్న రోజుల్లో మా అత్తగారొచ్చింది.

ఇప్పుడు వయస్సు మళ్లినా ఆవిడ బాగా పడుచుదనంలో వున్నప్పుడే మా మామగారు పోయాడు. అంతకిముందు అందరిలాగానే వుండేదిట. మామామగా రదోరకంమనిషి. సమర్థుడూ, ప్రయోజకుడే కాని భార్యదగ్గిర మటుకు ఏ విషయంలోనూ 'కాదు' నే వాడు కాదు. అంతా ఆడపిల్లలే అవటం, ఉన్న మొగుడు కాస్తా చచ్చిపోవటం ఆవిడ నో బ్రహ్మరాక్షసిగా తయారుచేశాయి. తన ఇంట్లోనే కాకుండా తనకి సంబంధించినవాళ్లందరిమీదా, ముఖ్యంగా అల్లుళ్లమీద సర్వాధికారిలా చలాయించాలని ఆవిడఅభిలాష. అందుకని పెద్దకూతుర్ని తన తమ్ముడికీ, రెండోదాన్ని తన పింతల్లికొడుక్కీ యిచ్చింది. మూడోకూతురికి తప్పనిసరిగా పరాయిసంబంధం చెయ్యాల్సొచ్చింది. ఆ అల్లుడు కొంచెం పెంకితనంగా వుంటే ఎవరు చెప్పారో ఏమో ఏదో మందు పెట్టిందిట — తిరవాత వైటపడ్డది— ఏనాడు తీసుకుని తీసుకుని, చావాల్సిందేకాని, ఎలాగైతేనేం ముత్తయిదువ బతికాడతను. ఓ మొగాడూ ఆడదీ మాట్లాడుతుంటే, వాళ్ల వయస్సూ, కులగోత్రాలూ, సంగతిసందర్భాలూ ఏమాత్రం విచారించకుండా అమాంతం ఇద్దరికీ కట్టేస్తుందావిడ. అసలు ఆవిషయంతప్ప మొగాడికీ ఆడదానికీ వేరే మాట్లాడుకునే పనే వుండదని ఆవిడదృఢవిశ్వాసం. మాయింట్లో తుపాను వీస్తున్న సమయంలో ఆవిడ రావటం— ఏదో విపత్తు జరుగుతుందని శంకించా. కాని వచ్చిన ఆవిడని "మాయింట్లోంచి వెళ్లిపో" అంటానికి తగిన కారణం కనిపించలేదు. ముభావంగా వున్నా.

ఆసాయంత్రంకూడా మామూలుగానే వచ్చిందా అమ్మాయి చదువుకుంటానికి. లెక్కలుకామాలు చేయిస్తున్నా. మా అత్తగారు రుసరుసలాడుతూ గదిగుమ్మందగ్గిరి కొచ్చి, నిర్భయంగా "నువ్వేం భోగం ముండవనే? నాకూతురుకాపరం తియ్యటానికొచ్చావ్? ఛా లంజా! అవతలికి నడు. సిగ్గూ ఎగ్గూ లేకుండాను..." అంది యింత గొంతుక చేసుకుని. హఠాత్తుగా రాలిన యీ అవాకులికి ఆ అమ్మాయి తెల్లబోయింది. నాకు ఒళ్లు భగ్గున మండింది. ఒక్కదూకు దూకి పళ్లు రాలగొడుదా మనుకున్నాగాని ఆడదని అంతలో తమాయించుకుని "ఛీ! నీతిలేనిదానా, పళ్లు పీకేస్తా, నోరాపుకుని రానియ్యి మాటలు...నీ రాక్షసితనం నాదగ్గిర సాగదు. ఒళ్లు చీలుస్తా పేలేవా అంటే...నడు నాయింట్లోంచి ఎవ రనుకున్నావ్!" అంటూ గదితలుపు ఘెడేలున వేశా.

"చచ్చానర్రోయి! అయ్యో! చంపేస్తున్నాడర్రోయ్, బాబోయ్" అంటూ కొండంత గొంతుక చేసుకుని అరుస్తూ ఏడవటం మొదలెట్టింది. తలుపు సందున వేలా గీలా పడిందేమో ఓసేశ! ఒక్కనిముషంలో చుట్టుపక్కలవాళ్లు నలుగురూ చేరారు, ఏమిటేమిటంటూ!

"అయ్యో బాబూ, ఇంకా ఏముందర్రా, మొగుణ్ని మంచెట్టి చంపుకున్న ఆముండ నాఅల్లుణ్ని పక్కలో కేసి నాకూతురికాపరం తీస్తుంటే, యింతమందీ వుండి చూస్తూ వూరుకున్నారా నాయనా? కొత్త కన్నకడుపు గనక 'అమ్మాయీ బాగుండ' దని చెప్పబోతే, నానాకూతలూ కూసి నన్ను చంపేస్తున్నాడోయి బాబూ, నా అల్లుడు..." అంటూ మళ్లా రాగాలు తీసింది.

"చూడండి తండ్రీ ఆగడిలో...ఘోరం...... మహాపాపం...కలికాలం..." అంది ముక్కుతిప్పుకుని ఆవిడే.

సంఘంలో యింతకుళ్లుందని నేను ఊహించలేదు. ఆ అమ్మాయి వచ్చి నాదగ్గిర చదువుకుంటూండటం మాచుట్టుపట్లవాళ్లందరికీ తెలుసు. నేను ఏ సందర్భంలోనన్నా వాళ్లని కలుసుకున్నప్పుడు మర్యాదగానే మాట్లాడేవాళ్లుకూడాను. ఇప్పుడు ప్రతివాళ్లూ ముక్కుమీద వేలేసుకునేవాళ్లే! విడ్డూరంగా కిటికీలోంచీ, తలుపుసందులోంచీ మాకేసి చూస్తూ "అంతా చూస్తూనే వున్నామమ్మా! ఏం చెయ్యగలం?" అని ఒకళ్లూ, "మొగమహారాజు...ఇంతకీ ఆపిల్లలో వుంది...అమ్మొమ్మొ ఎంతసాహసం!" అని ఒకళ్లూ, "మంచివాడే...అయితే నేం, రోజులు బాగుండలేదు తల్లీ! అత్తగార్ని కొట్టడమేం? అమ్మో! తల్లితరవాత తల్లంతది!..."అని ఒకళ్లూ ఆవిడని ఓదార్చటం మొదలెట్టారు. ఆ అమ్మాయి మొహాన కత్తివాటేసినా నెత్తురుచుక్క కనిపించటం లేదు. నాకు దుఃఖం వచ్చింది. ప్రయత్నపూర్వకంగా దాన్ని కోపంలోకి మార్చుకుని దూకుడుగా వసారాలో కొచ్చి మూగివున్న జనాన్ని సంబోధిస్తూ "ఏమిటీ మీరంతా చూస్తేకారు? మమ్మల్నేమన్నా ఖూనీచేద్దామనా?"అన్నా.

"ఖూనీనుంచి తప్పిద్దామని..."అన్నాడో వెధవ ఓమూలనుంచి.

"ఎవరండీ ఆపెద్దమనిషి?"అన్నా కోపం దిగమింగటానికి చేసే ప్రయత్నంలో ఒణుకుతూ. అని,కళ్లు రుముతూ మాఅత్తగారివేపు చూశా.

"నాయనోయ్,మీరంతా రాకపోతే యీపాటికి నాపని అయ్యేపొయ్యేది... చూడండి బాబూ ఎలా నిప్పులు కురిపిస్తున్నాడో నామీద..." అంటూ మళ్లీ బావురుమంది ఆవిడ. ఇహ కోపం పట్టలేక, "తప్పుకుముండా, ముయ్యి నోరు..." అంటూ కాలెత్తా తందా మని.

"చాలు చాల్లేవయ్యా, ఆడదానిమీద చెయ్యేస్తున్నావ్? అడ్డమైన లంజలతోనూ పోతూ, పైగా తల్లిముండ కూతురుకాపరం కొత్త కుదటపరుద్దా మని ఏడుస్తుంటే కొడతావు? మా కేం తెలీకపోలేదు రహస్యాలు! పైగా చదువుకున్నాయనవి కూడాను!" అంటూ మాయింటికి అవతలవేపున్న కట్టెల అడితీ మనిషి అందుకున్నాడు. అతను పెళ్లాన్ని ఖూనీ చేశా డని వదంతి.

"పెద్దమనుష్యులు మళ్లో...మా కెందు కని చూస్తూ వూరుకుంటేను? ఇదేం భోగంబజా రనుకు

న్నారు గ్రామాలు!" అన్నాడు మొన్నీ మధ్యే దివాలా తీసిన ఓ పెద్దమనిషి. ఆయన ముక్కు యించుమించు సాంతం ఆపరేషను చేసి తీసేశారు కుష్ఠరోగాలవాలాన.

"ఇహానంతైనా అమ్మాయిని విడిచిపెట్టెయ్యండి" అని మా యింటిపక్క ప్లీడరు సలహా యిచ్చాడు.

ఎవరికి తోచినట్టు వాళ్లు అంటూనే వున్నారు. వెనకనుంచి ఎక్కడవాళ్లక్కడ చల్లగా జారుకున్నారు. నాకు పిచ్చెత్తినట్టయింది. తల తిరిగిపోతోంది. పడిపోయేవాడినల్లే స్తంభం పట్టుకుని నుంచుని ఒక్కక్షణం కళ్లు మూసి తెరిచేసరికి ఒక్క పిట్టన్నా లేదు. నిట్టూర్పు విడిచి 'యిది కలా, నిజమా' అనుకుంటూ ఆశ్చర్యంతో గదిలోకి చూచేసరికి గుండెలు పగిలిపోయాయి. ఆ అమ్మాయి శేలమీద పడుంది. ఒక్క అంగలో దూకి చెయ్యి పట్టుకు చూస్తే చల్లగా యుగం......

"నా కెందుకొచ్చిం దీ బెడదంతా" అనుకుని హృదయం స్పందించటం మానేసింది శాశ్వతంగా. నా కళ్లల్లోని రెండు జీవరక్తాశ్రువులు ఆ అమ్మాయి ప్రశాంత ఫాలంమీద మెరిశాయి. కుమిలిపోతున్న ఆ అమ్మాయి తల్లిని కిటికీలోంచి వచ్చిన ప్రాణాల్ని పీల్చే ఉష్ణ వాయువు ఎక్కిరించింది.





# శ్రీనాథుఁడు - అతని మనస్తత్వము

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

శ్రీనాథుఁ డొక యద్భుతవ్యక్తి. నాఁటి కాలమునకును, కవిసార్వభౌముని భావములకు నంతగాఁ బొత్తు కుదురలేదు. కాఁగా కాలమున కాతఁడే లొంగి పోవలసివచ్చినది. కాని, యాత్మస్వాతంత్ర్యము మాత్రము నివురుగప్పిన నిప్పువలె నణఁగియుండి, సమయము వచ్చినపుడు జ్వలించుచునే యున్నది. శైలిలో నాతఁ డనేకరీతులఁ దన యుద్దండతను గనుపరచెను. భావములలోఁగూడఁ బ్రత్యేకత భాసింపకపోలేదు. ఆ మహామహున కేమి కొదువ? కావలసిన సాధనసంపత్తు లన్నియు నట్టింట నమరియుండినవి. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడు. అంతేనా? బ్రహ్మాండాదిమహాపురాణనిచయములఁ గబళించి, యరిగించుకొన్న మనీషి. శాస్త్రములలో నిశ్శంకటవిహారము చేసినాఁడు. ఈ పాండిత్యమునకుఁదోడు చల్లని హృదయము గల సహృదయుఁడు. సౌందర్యమును భావింపఁగల తపస్వి. భావించినదాని నీలోకమునకు దించి, యంతెనో యింతెనో అనుభవింపవలెనను గట్టి యాసక్తియు, సామర్థ్యమును శ్రీనాథున కుండినవి. అందులకుఁ దగినట్లు, మనవంటి దౌర్భాగ్యజీవితముగాక, పుణ్యవశమున నెమ్మదిగల జీవితము కుదిరినది. వేమభూపాలుని విద్యాధికారిత్వము. నాటివారిలో నట్లుండనీ — రాజులలో మర్యాద, రాకపోకలు, స్వర్ణపాత్రలలో — విస్సనమంత్రితోడి సహపంక్తిభోజనము. ఎక్కడఁ జూచినను శిష్యబృందము — పల్లకీలు — వీరవిహారము. కవిసార్వభౌముఁడు నిత్యజీవితములోఁగూడ సార్వభౌముఁ డైనాఁడు. లక్ష్మీదేవి దన యింటి పంచఁ గాచినది. అందులకే కవితలోఁగూడ సార్వభౌముఁ డైనాఁడు. జీవితములోని తెగువ, సాహసము కవితలోనికి వ్యాపించినవి. కడుపుకొలఁది దాను దిన్నాఁడు; చేతులకొలఁది యొసఁగినాఁడు. నిజముగా నాతనిది మహారాజుల — కాదు, సులతానుల మెప్పు. దమయంతీ స్తనద్వయము లాలించిన, శ్రీనాథునకుఁ దృప్తి లేదు. మరియేమి? ఘుమ్మని ఘాటుగా నివతాళింపవలెను. (1) దయ్యమునె త్తికోలు సిద్ధించినఁ జాలదు. తుదిఁ దాఁకవలెను. (2) ప్రతిరసమును నాతఁ డిట్లే పోషించును. 'శాంతి' యనునది యాతని జీవితమునకే యంటని

---

1. "ఇఱ లాలించు విదర్భరాజతనయా హృద్యస్తనద్వంద్వమున్" (శృంగారనైషధము)
2. "దయ్యమునె త్తికోలు తుదిఁ దాఁకుట గానఁగనయ్యె నయ్యెడన్" (శృంగారనైషధము)

వస్తువు. కొన్నియెడల మన "కబ్బా! వెక్కసమైన" దనిపించును. కాదా మరి! ఆతనిది రాజభోజనము. మనవంటి క్షుద్రజీవు లరిగించుకొనలేరు. మరి యజీర్ణముగాక నేమగును? కాశీఖండములో నాతఁడు వర్ణించిన యేడ్పు చూడుఁడు:

"కొనసరి వసంతకాలమునఁ
గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్జసరుహనేత్ర కొండచరి
బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ
గాటుకకన్నుల నీరు సోనలై
యుసిరికకాయలంతలు ప
యోధరము ల్దిగజారునట్లుగన్."

కన్నీరుగారిన దన్న శ్రీనాథునకుఁ దృప్తిలేదు. ఎట్లును నేడ్చినది బాగుగా నేడ్వనిమ్మని యాతని తలఁపు. అందుకే, యుసిరికకాయలను బట్టుకొనివచ్చి నాఁడు తీరికగా. నిషధరాజు దమయంతీదర్శనమునకై యంతఃపురమునకుఁ బోయినపుడు ఒకయిద్దరు ముద్దియలు "మదగజరాజకుంభముల మచ్చరికించు" నిండుకుండలవంటి కుచద్వయములతో నాతని నొత్తిరఁట. ఆ రగడలో నారాజకుమారుఁడు, పాపము, పదమద మైపోయినాఁడు. ఈ తెగువయే యాతని శైలికినిగూడ మూలము. కారకములలోని వైచిత్రి, క్రియల సొంపు, నూతనపదసృష్టి మొదలగువన్నిటిని గూడ నీయుద్దండతతోనే కవిసార్వభౌముఁడు నడపెను. జీవితమున హాయియుఁ, దెగువకుఁ దగిన యనుకూలములు నుండుటచే, నందుకుఁబోలు గుణములన్నియు వరుసగా నీతనిలోఁ గ్రందుకొన్నవి. శ్రీనాథునకు హాస్యముపై మక్కువ యెక్కువ. ఈ గుణముతోనే యాతఁడు చరమదశయందుఁ గలిగిన యిక్కట్టులన్నియు జీర్ణించుకొని బ్రదుకఁగలిగినాఁడు. రాయల దర్శనమునకు వెళ్లినాఁడుగదా! ఆ దేవరాయల దర్శనమునకై యెన్నియో దినము లొడలంతయుఁ గన్నులుగాఁ గాచుకొన్నాఁడు. ఎందరినో యాశ్రయించి, ఎన్ని తిప్పలో పడినాఁడు. నిజముగా నితరుఁడైనచో బావురుమని యేడ్చియుండును. కాని శ్రీనాథుని మనస్తత్వ మట్టిది గాదు. హాస్య మాతని కొక గుణముగాఁ గాక, పీడరాని యలవాటుగా మారిపోయినది. తనకుఁ దెలియనిదే యది దూకును. కడ కదియే శ్రీరామరక్షయైనది. శ్రీనాథునిది స్మితము గాదు, హాస్యము గాదు; మరి యట్టహాసము. పాఠకులు పడిపడి నవ్వవలె నని యాతని యాశ. ఈకోలాహలములో నాతని యాకొసంత దుఃఖము నుమాదింజవలె నెగిరిపోయినది. అతఁ డన్నది చూడుఁడు:

"కుల్లావెట్టితిఁ గోకఁ జుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టముల్ మెసవితిన్
విశ్వస్త వడ్డింపఁగా
చల్లాయంబలి త్రావితిన్ రుచులు దో
సం బంచుఁ బోనాడితిం
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయ లే
దా? నేను శ్రీనాథుఁడన్."

పాఠకుల మెప్పించుట యను చాపల్యమునకు ముందు పుణ్యపాపవిచారముగూడ లేదాతనికి. కుల్లాయుంచుటయుఁ, గోకజుట్టుటయుఁ, గవకంబలి త్రావుటయు నంత పెద్ద యిక్కట్టులుగాఁ దోఁచలేదా మహానుభావునకు. విశ్వస్తచేతి యన్నమును దినవలసివచ్చెనే యనునదే పెద్ద దుఃఖమై బాధించినది. ఔరా రాజసము! లేకున్న, చేతులయందలి కంకణముల గలగలలతో, నవమనము పూలబంతులవంటి కోరమాపుల త్రేటులతో, కిలుజకలతో, కొంగుతాకులతో, చల్లని యూర్పుతావుల నన్నమును జల్లార్చి యప్సరలవంటివారు వడ్డింపఁగా, బంగారుపాత్రలలో రాజభోజనము గావించిన యదృష్టశాలి కీయష్టావక్రమూర్తులు ముందు నిలిచిన నేడుపుగాక మరేమి గలుగును? పలనాటి కాతఁడు పోయినపుడు, అచట వానలేకపోఁగా నీశ్వరునిగురించి యొక పద్య మల్లినాఁడు. అది హాస్యమో గర్వమో మీరే నిగడింపుఁడు:

"సిరిగలవానికిఁ జెల్లును
దరుణులఁబదియారువేలఁ దగఁ బెండ్లాడన్

తిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా! గంగవిడుము పార్వతిచాలున్"

కేవలము చాటువులలోనే కాక, కథాసన్నివేశములను, ఔచిత్యమును గాపాడుకొనవలసిన కావ్యములలోఁగూడ వాఁ డీగుణమును విడువలేదు. నైషధమున నలవివాహవర్ణన మంతయు, మూలమున నంతగా లేకున్నను, నిట్టిఘట్టములతోనే నిండియున్నది. ఇట్టిసమయములఁ బాఠకుల నాతఁడు లక్ష్యపెట్టఁడు. తనదారినే పడి యొడలు దెలియక పోవుచుండును. విదర్భరాజ వివాహమున—ఆంధ్రుఁడుగనుక చక్కని యావకాయ వండినాఁడు. అది సామాన్యమైనది గాదు సుఁడీ. దాని ధాటి కందరికిని ముక్కులలోఁ బొగలు (ఓ—గకెం) లేగినవఁట. ఈభావ మాతని దృష్టికి హాస్యమే గాదు; ఇంకను దీవ్రమైనవి చాల్లగా నున్నవి. హాస్యమునకన్న నవహేళనముపై సార్వభౌమునకుఁ బ్రీతి. ఇతరులఁ గొంతవరకైన నఁగుట్టవలెను. సంస్థానములలోని పండితులు నేర్పిన—నేర్చుకొనుచున్న విద్య యిది. శ్రీనాథునకుఁ బ్రపంచ మొక తమాషా. తాను నాయకుఁడనియుఁ, బ్రపంచమంతయు నొక క్రీడారంగమనియు భావించినవాఁ డాతఁడు. లోకమునందలి మెప్పులు-కష్టనిష్ఠూరములన్న నాతనికిఁ జిల్లాట. ఇతరులు దన చమత్కారముచే, మేధస్సుచే 'బెలపడి'నపు డాయన కంతులేని యానందము. మాడుఁడు, సర్వజ్ఞ సింగమనీని దగ్గరకు వెళ్లినవాఁడు

"సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్వింజెల్లును నితరుని
సర్వజ్ఞుం డనుట కుక్క సామజమనుటే."

అని బ్రహ్మాండముగాఁ బొగడినాఁడు. ఇతర ద్వేషము లాతనికిఁ గాఁబట్టవు. గుణ మగుపించెనా, నోరారఁ బొగడును. దోషము లేకున్నను, దన యభిరుచికి సరిపోకపోయెనా, తనివిదీరఁ దిట్టును. అంతకు ముందు జరిగిన వన్నియు స్వప్నమువలె మఱచి పోవును. సరి—వెనుకకు వచ్చినాఁడు. నిండుసభలో విద్వేషిని బొగడినాఁ డని వాకు వచ్చినది. బ్రదుకు పోవు పరిస్థితి యేర్పడునేమో యను భయ మంటినది. ఆదర్శములకై యల్లాడు టాతఁ డెఱుఁగఁడు. ఇఁకఁ గష్టమేమున్నది? అర్థమును మార్చినాఁడు. "విరోధిని బొగడలేదులే" యనుకొని యనవోతనాయఁడు సంతసించినాఁడు. వాని వెకలితనమును జూచి యాతఁడు నవ్వినాఁడు. శ్రీనాథుని మనస్తత్వ మట్టిది.

ముఖ్యముగా సార్వభౌమునకు శృంగారముపైఁ జాపల్య మెక్కువ. అతని కేమికొదువ? పాండిత్యము, వైభవము, చక్కని రూపము- అన్నియు నమరినవి. "వెన్నవలెం గరంగు నలివేణుల" నెందరినో కౌఁగిటఁ జేర్చిన భాగ్యశాలి. అక్కడ నాతఁడు చాదస్తముగ పుణ్యపాపవిచారము గావింపలేదు. రసికతకును, ధార్మికదృష్టికిని జాలదూరమని శ్రీనాథుని తలఁపు. అటులని నాస్తికుఁడును గాఁడు. శైవాగమము లన్నియు మూలమట్టముగ శోధించినాఁడు. బ్రాహ్మీని మనసార నుపాసించినాఁడు. కాశీఖండమున నాతఁడు గావించిన మణికర్ణికావర్ణన "లీతఁడే నిజము భక్తుఁ" డనిపించునంత వాడిగా నున్నవి. కాని శ్రీనాథుఁడు పరివర్తనశీలుఁడు. పాదరసమువంటివాఁడు. ఒకచోట నిలువఁడు. ఒకసిద్ధాంతమునే యంటియుండఁడు. ఒకదానిని తుదముట్టింపఁడు. అందులకే యాతఁడు పురాణముల వదలివేసి, తన ప్రవృత్తి కనుకూలముగ ప్రబంధరచనకుఁ బూనుకొనెను. ఈ గుణములలోఁ దెనాలిరాముఁడు సార్వభౌమునకు సరిపోలును. ఇరువురును జాలసేపొక దానిని బరీక్షింపలేరు. అయిదు నిమిషములు గడచు లోపలనే పురుగు దొలుచును. కాని, చూచినంతసేపు గంభీరముగాఁ జూతురు. "భగవత్స్వరూపా! అది యొక వైపు. భోగములా! ఇది యొకవైపు. ఈ రెంటికిని సంబంధమే లేదు. హృదయపావిత్ర్యమా! దాని లోఁతును గమనించిన దెవ్వరు? మానవున కిది యొక్కటియేనా చాపల్యము? దీనిని విడిచినంతనే వైకుంఠము చేత నిలుచునా? ఇతరములు వదలవలసిన వెన్ని లేవు? వదలుచున్నామా? అసలీవిచార మంతయు నెందుకు, హాయిగా బ్రదికి కన్నులుమూసికొనిపోక" యని శ్రీనాథుని యాలోచనలు. అతని జీవిత మొక తుఫానువంటిది. అందులో మంచిచెడ్డలన్నియుఁ గొట్టుకొనివచ్చినవి. మనకుఁ గావలసినవానిని వింగడించు

కానవలె నంటే. అతనిని నిందించినచోఁ జచ్చినవానికి నష్టము లేదు, మనకు లాభము లేదు. బహుశః యాతని కింటఁ దన తృష్ణను దీర్చికొనుటకుఁ దగిన గృహిణి లభింపలేదేమో!(3) అతని యూహ కందు సుందరాంగు లెవ్వరు లభింతురు? దీనికిఁ దోడు భగవంతుఁడు బహు దేశాటనమును వదుట వ్రాసినాఁడు. పోయినచోట నంతయు ముందు కీర్తి, వెనుకఁ దాను. సన్మానములు, వివాదములు. వర్ణించుటకు స్త్రీలు దొరకిన శ్రీనాథున కొక పండుగ. నోరార వర్ణింపవలెనని యాతని యాశ. ఆనాలుక దురదను బోఁగొట్టుకొనుట కాతఁ డనేకములు చాటువు లల్లినాఁడు. అల్లిన వన్నియు నాణిముత్తెములే. సౌందర్యమును మనసార భావింపవలెను. చవులూర ననుభవింపవలెను. ఆ రసికత కంతు లేదు. శృంగారమున నాతఁ డౌచిత్యమును గమనింపఁడు. ఎదిరించినవారిని "పోరా! నాయిష్ట" మని గద్దించి నైచు గావుసుండె యాతనిది. ద్రాక్షారామమునందలి "గంధర్వాప్సరోభామినీవక్షోజద్వయకుంభికుంభములపైఁ" బంధుకొని యెన్నియో వెన్నెలరాత్రులు గడపిన యుపమానరేఖాశాలి. పచ్చిపోగ రుట్టిపడు "నూనూఁగుమీసాలనూత్నయౌవనము"నుండియు గ్రంథరచనమునకు దొరఁకొన్నాఁడు. కౌమారముననే 'శాలివాహనసప్తశతి' వంటి యుత్తమశృంగారకావ్యముల వైపు దృష్టి పారినది. చదివిచదివి యానందించినాఁడు. తాను గనుఁగొన్న నిగూఢార్థములను—వేమారెడ్డికి సాహాయ్య మాచరించు నెపమున దాని వ్యాఖ్యలోఁ గ్రుమ్మరించినాఁడు. కడకు రసపిపాసియై, రసతపస్వియై దాని నాంధ్రీకరించినాఁడు. ఆంధ్రులమగు మన యభాగ్యవశమున అది మనకు దక్కకపోయినది. శృంగారమును లలితముగా భావించి వ్రాయు కొద్ది మందిలో శ్రీనాథుఁ డొకఁ డనుటకు సందేహము లేదు. అన్నిటిలో నాతని కున్న తెగువ యిందులోను గూడినది. సార్వభౌముని రసికత గొప్పది. కాని యది పరిమితి నెరుఁగదు. పాలకురికి సోమనాథుఁడు శైవాగమములలోవలె, పోతన భక్తియందువలె, వాల్మీకి కరుణయందువలె, పెద్దన ప్రకృతియందువలె శ్రీనాథుఁడు శృంగారమున నోలలాడుచును. అతఁడు "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమున" వ్రాసిన భీమఖండమునఁగూడ నీగుణమే పుంజుకొనియున్నది. తక్కిన వన్నియు మారినవి గాని, జీవధర్మము నిజమాత్రము వాడలేదు. కాశీఖండమును దెనిఁగించినాఁడుగదా, మూలమున లేని వెన్నియో శృంగారపద్యములు గల్పించినాఁడు. కల్పించిన వన్నియు నాతని మనస్తత్త్వమున కద్దమువలె నున్నవి. శృంగారచ్ఛాయ మూలమునఁ గానఁబడినఁ జాలును, దాని వదలఁ బెట్టి యాతఁ డుండుకొనును. తనివిదీర వర్ణించి, తన కాయాస మైనపుడు మరల కథ నందుకొని పోవుచుండును. ఇంతగా వర్ణించుమనుగదా, విసు గనిపించునా? నాన కాలమునందలి ప్రవాహముల యురవడివంటి యాతని కవితలో శరీరము మఱచి మనము గొట్టుకొని పోదుము. శృంగారమున శ్రీనాథుఁ డెన్నిపోకడలైనఁ బోఁగలఁడు. గడుసుగాఁ బలుకఁగలఁడు. మృదువుగా దిద్దఁగలఁడు. సర్వరీతుల నందగాఁడైన పండితుఁడు. నైషధములోని యీపద్య మెంత రమ్యముగా నున్నది :

" తోఁకచుక్కలఁబోలు దృక్కోణజముల
వెలితిలేకుండ విూఁబోటిచెలులఁ జూచు
కాంత వీక్షింప దరకంటఁగాని మమ్ము
మేముచేసినయపరాధ మేమి చెప్పుము ! "

పై యుపమానము నాతఁ డెన్నిదినములనుండి జాగ్రత్తపరచెనో! 'వెలితి' యను పదమున కర్థము వెలితిలేకయే యున్నది. 'అరకంటఁ' జూడలేదనుటలో ధ్వనిగాదుగాని చమత్కార మున్నది. "ఏము చేసిన యపరాధ మేమి" యనుమాట చక్కని వ్యవహారదక్షుఁడే వాడఁగలఁడు. వాడిన ప్రతిపదమును వాచ్యార్థమున కుపస్కారకమే. తక్కినవలెఁ బ్రతిపదమును శ్రీనాథుఁడు దాఁచివేయలేఁడుగాని, వాడి నంతవరకు కందముగనే యుండును. అతని జీవితము వంటిదే శైలిగూడ. ధ్వని యున్నను, లేకున్నను వాడిన పదములు పూవులవలె, కోడిపుంజులవలె విచ్చుకొని, మెడలు మలఁచికొని జంభముగా నడుచు

3. ఈభావము వేటూరివారిది. సమంజసముగ నుండుటచే గ్రహించితిని.

వలెను. తాను పల్లకిలోఁ గూర్చొని పోవునపుడు ముందు స్తుతిపాఠకులు సేయుచుఁ బోవు వందిమాగధులవలె ముస్తాబై డాబుగా నడచినచో యాతనియాత్మ సంతోషించును. శ్రీనాథునకు ధ్వనిదృష్టి లేదనరాదు గాని, యంత ప్రధానము మాత్రము గాదు. ముఖ్యముగా నాతఁడు వాచ్యకవి. శబ్దార్థ మెంత తీక్ష్ణముగా— గంభీరముగాఁ బొట్టేలువలె నున్న నాతని కంత యానందము. ఇది లేని ధ్వనిగూడ రంజకము గాదు. పదచాపల్యమున నొక్కొకసారి కవిసార్వభౌముఁ డర్థమునుగూడ విచారింపఁడు. చూడుఁడు:

"ప్రకుపిత శాంకరీచరణ
పంకజకుంకుమ పంకసంకర
ప్రకటనిరంకశంకరక
పర్దశశాంకకళంక కారముల్"
(శృం. నై.)

నిరంకుఁడను చంద్రుఁడని తాఁ జే వాచ్యముగా నన్నాఁడు. కాని 'శశాంక' పదము వాడునప్పటి కా తలఁ పంతరించినది. ఆ శైలిలో, ఉయ్యాలతూగు వంటి యా దర్జానడకలో పదప్రయోజనమును గమనించు దీక్ష యెవరికని యాతని నమ్మకము. ఈ గుణమునకుఁ గారణ మేమి? అతఁడు స్వయముగా నావేశి. చదివిన గ్రంథములుగూడ నావేశభిక్షయే యిచ్చినవి. పాలకురికి సోమనాథుఁడు, నాచన సోమన, నన్నయ శ్రీనాథున కారాధ్యదేవతలు. తిక్కనను జక్కఁగాఁ జదివినాఁడు, ఆనందపడినాఁడు. కాని యాతని 'రసాభ్యుచితబంధము' మాత్రము సార్వభౌముని కంటలేదు. జీవితమున లేని మితము, వశిత్వము కవితయందుమాత్ర మెక్కడనుండి వచ్చును? పూర్వాపరముల గమనింపకపోవుట — దన యారాధ్యదేవతలకువలెనే — యాతనికిని వచ్చినది. వచ్చినను పరవాలేదు. ధ్వని లేకున్నను, వాచ్యార్థమున మఱెవ్వరికిని రాని తీక్ష్ణత గ్రందుకొన్నది. దానితో నొక విశిష్టత గలిగి, యాతని కొక ప్రత్యేకస్థానమును సంపాదించి యిచ్చినది. వాచ్యమున శ్రీనాథుఁడు పోయినన్ని పోకడలు మఱెవ్వఁడును పోవఁడు, పోలేఁడు. భాషాభాండారము సమృద్ధిగాఁ గల ధనవంతుఁ డాతఁడు. అతనికిఁ బ్రపంచమున్నను, ప్రత్యర్థులున్నను లెక్కలేదు. యుద్ధవీరునివలె నాతని శైలి రొమ్ము విఱుచుకొని నడచును. దుష్కర ప్రాసములు పెద్దలైన యిక్కట్టులు శ్రీనాథుని బాధింపవు. పద్యము మొదలుపెట్టినచోఁ గడపటివరకు బాణమువలె సాగిపోవలసినదే. పిలుచుటయే తడవుగాఁ బదబంధము వచ్చి నుఱుకొనును. అతని వాచ్యశైలులు గొన్ని చూడుఁడు:

"జాతరూపచ్ఛదచ్ఛటాజాతరూప
లక్ష్మి యింతొప్పనే మరాళమున కనుచు"
(శృం. నై.)

"కాలకంఠకఠోరకంఠహుంకారంబు
చెవులుసోకనినాఁటి చిత్తభవుఁడు."
(శృం. నై.)

"సలిలంబు త్రిషవణస్నానక్షమం బొనె
యంభోజపత్రదీర్ఘాయతాక్షి."
(హరవిలాసము)

"చిగురుదామరపాకుజివ్వనఁ జనుదోయి
మొనల క్రొవ్వేడికి ముడుగఁబాతె
తరుణరంభాగర్భదళతాళవృంతమ్ము
పై గాలిసోకినఁ బలుకఁబాతె
తరుణచక్రాంగ! పాథఃపతంగశక్ర"

ఈ క్రింది పద్యమువంటి దాతని సాధారణము శైలి:

"కాలాంతఃపురకామినీ కుచతటీ
కస్తూరికా సౌరభ
శ్రీలుంటాకము, చందనాచల తట
శ్రీఖండ సంవేష్టిత
వ్యాలస్ఫారఫణాకఠోరవిష ని
శ్వాసాగ్ని పాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము ప
క్షీ! చేయు దాక్షిణ్యముల్?"
(శృం. నై.)

శ్రీనాథకవి మహాభిమాని. వానికిఁ బాండిత్య బలము వెన్నెముకగా నుండినది. కవిత్వ మనన దాతనికిఁ గళమాత్రమే కాదు, ఒక ఉద్దీపనదీపముగూడ. ప్రౌఢదేవరాయల యాస్థానమున గౌడడిండిమభట్టు గలఁడని తెలిసినది. ఇఁక వానికి నిద్ర పట్టలేదు. వానిని జయించు టెట్లు! ఈసమస్యయే ప్రబలముగాఁ బట్టుకొన్నది. అప్పు డామహానుభావుఁడు చెప్పిన చాటు విది:

"కంటికి నిద్రవచ్చునె, సు
ఖంబగునే రతికేళి, జిహ్వకుం
వంటక నిండునే, యితర
వర్తనము ల్పదివేలు మానసం
బంటునె, మానుషంబు గల
యట్టి మనుష్యున కెన్నఁడేనియుం
గంటకుఁడైన శాత్రవుఁ డొ
కండు దనంతటివాఁడు గల్గినన్."

కవి డిండిమభట్టారకుని జయించి "పసుల్ఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క" అని హాయిగాఁ జెప్పికొనువర కాతనికిఁ దృప్తిగలుగలేదు. సార్వభౌమున కీమన స్తత్వ ముండఁ బట్టియే యాతని కాంతరంగిక శత్రువులు కొంద ఱేర్పడిరి. అతనికి విద్యాశాఖాధికారిపదచ్యుతి జరిగినయనంతరము గాఁబోలు, వా రతని కవిత్వమును గర్ణాటభాష యని నిందించిరి. వారికి శ్రీనాథుని యుత్తరము ఉత్తరమమాత్రమే గాక ఒక చపేటమైనది. అతని యుత్తరమున నెంతటి యభిమాన ముట్టిపడుచున్నదో చూడుఁడు:

"ప్రౌఢిఁబలికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్రభాషయండ్రు
ఎవ్వ రేమన్నఁ గాని నా కేమి కొఱఁత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష."

దీనిలో మర్యాద యున్నది. ఎదుటివారినిగూడ గౌరవించినాఁడు. తన నిర్లక్ష్యత నగుపరచినాఁడు. "ఎవ్వ రేమన్నఁగాని నాకుఁ గొఱఁత లే" దనుటలో నెంతరైనను గంభీరత గలదు. అన్ని యున్నవిగాని, కడ కదృష్టము వక్రించినది. తిక్కనవలె మితముగా మాటలాడలేఁడు గాని మాటలాడవలె నను నిచ్ఛ మాత్రము గలదు. ఈ పాండిత్యపు 'దొమ్మపాసరు' వశిత్వమును నిలువనీయ దాతనికి. తనంతఁదాను ముందు దూకును. ఇది యంతయు నాతని బహిరంగమూర్తి. ఇఁక నాతని యాంతరికమన స్తత్వ మన్నివేళ లెట్టిది? శ్రీనాథుని జీవితమున నొక యాదర్శమే లేదా? యుండినది. అతనిది విజ్ఞాన తపస్సు. ఆ తపములో — ఆ యాదర్శములో నాతని జీవిత మాఁగిపోయినది. రాత్రింబగళ్లు బరిశ్రమ చేసినాఁడు. చేసినదానికి సంపూర్ణముగా ఫలమనుభవించినాఁడు. ఆ పాండిత్యములో — ఆ వైభవములో మంచిచెడ్డ లన్నియు నుండినవి. తన హృదయము నొకచోట చేనియు దాఁచుకొనలేదు. తన యందలి గుణదోషము లన్నియు స్పష్టముగా నెత్తి చెప్పి "వినకుఁ గావలసినదాని చేరుకొనుఁ" డని గుప్పపోసినాఁడు. తప్పులుపట్టువారిని చూచి లొట్టలు వైచి "యెవ్వ రేమన్నఁగాని నా కేమికొఱఁత" యని మదగజమువలె వెళ్లిపోయినాఁడు. శ్రీనాథునిలో మహా పరవశత్వ మున్నది. స్త్రీల నాదరిం యధిక్షేపించు వెఱ్ఱి వెంగళయ్యవేదాంతులను జూచి

"లాలామూత్రపురీషఘర్మజలకీ
లాలాత్ములౌ నారు లం
చేలా రోతలుపుట్ట నాడెదరు యో
గీంద్రుల్ వృథాలాపముల్
లాలామూత్రపురీషఘర్మజలకీ
లాలాత్ములో దార లే
ప్రాలేయాద్రిపటీరపంకఘనసా
రణాద్రదివ్యాత్ములో"

(శృం. నై.)

అని బాహాటముగా ధిక్కరించుట కాతఁడు జంకలేదు. శుష్కవాదములతోఁ గాలముగడుపుచుండు నైయాయికులను జూచి "పంకంబులోని కంబంబు తర్క" మని వెక్కిరించినాఁడు. అతని తెగువ కంతు లేదు. పొగడిన నంతే, తెగడిన నంతే.

ఇన్ని యున్నను - సమయము వచ్చినపు డెక్కడ లేని గొప్పతన మాతనికి వచ్చును. అపుడు శ్రీనాథుం డొక జ్యోతిర్మయుండుగా, తానుపాసించిన బ్రాహ్మీ రూపుండుగాం గానంబడును. అల్పులగు ప్రతివాదులు దన్నాక్షేపించినపుడు వారితో వాదమునకుం బూనుకొనుటయే సరిగా దనుకొన్నాండు. వారి కాతం డొసంగిన యుత్తర మిది:

"నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నడరి కాకులు సేరి బిట్టఱచినప్డు
ముదధిరాయంచ యూరకయుంట లెస్స
సైంప రాకున్న నెందేనిం జనుట యొప్పు."

కాని యీయాయా స్ఫూర్తి కప్పుడో అరుదుగాం గలుగును. సాధారణముగా నాతని శైలి యిట్టిదే.

"ఓర్పు కొంచెంబు, గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు, మచ్చరము ఘనము
కూపమండూకములువో లెంగొంచెమెఱింగి
పండితమ్మన్యులైన వైతండికులకు."

(భీమఖండము)

అంతే. ఆతం డొక్కరి కేల భయపడును? భయపడుట కవసర మేమి? నైషధము నధిక్షేపించు చిలుతసాహిత్యము వారిని జూచి

"...లేజవరాలు చెక్కుంగీ
టిన వనవల్చు బాలకుండు
డెందమునన్ కలగంగ నేర్చునే."

అన్నాండు. తానే రసచక్రవర్తి యన్న గర్వ మాతనికి. తాను మెచ్చినది లోకము దప్పక మెచ్చవలె ననునంతవర కభిమాన మున్నది. విశంకటమైన పాండిత్య ముండినది. ఆతని జీవితాదర్శ మదే. దానిలో శ్రీనాథుండు — పాపము — కొంచెము మత్తుండైనాండు. చేతులార నార్జించినాండు. అద్వితీయగౌరవ మనుభవించినాండు. తెగడినవారిని బాతాళమునకుం ద్రొక్కినాండు. వలచినవారిని నెత్తిపైం బెట్టుకొన్నాండు. జీవితమున, కవితలో నాతనికి దారిద్ర్యము లేదు. తెగువ – తెగువ. ఆతని జీవితమంతయు నిదియే. మహాభిమాని. ఆదర్శమును సాధించిన మనీషి. పగలు, రాత్రి యెడతెగక సుఖములే యనుభవించిన రేఖాశాలి. బ్రాహ్మీదయతోం గాక స్వశక్తితో, కలముతో జగమునేలిన సార్వభౌముండు. వంచన యెఱుంగని మనస్వి. బృహస్పతికిం గూడం దల వంపని గర్వి. వాఙ్మయరంగమునం దాతం డొక వీరుండు. అన్ని దేశములు దిరిగినాండు. అన్ని రుచుల ననుభవించినాండు. హాస్యలోలుపుండు. శృంగార శ్రీనాథుండు. జగమంతయు స్త్రీమయమే, తలంపులన్నియు సౌందర్యమయమే కావలెనని యాతని యాశ. సార్వభౌముని నడకలో, కనుబొమ్మలో, మాపులో ప్రతిదానియందును రాచఠీవియే గలదు. శృంగారముగూడ రాజసమే. త్యాగశీలి. కావున్న – కనకాభిషేకము జరిగినప్పుడు— పోసిన దీనారములలో — యింకొకండైనచో — పది జన్మములు — సాఫ్యమైన — సుఖముగా బ్రతికియుండును. కాని—శ్రీనాథుండు నిలుపుకొన్నాండా? — అవి యన్నియు మూండుదినములలో వెదచల్లి కడపటం దానుమాత్రము మిగిలినాండు. ముసలితనమున హాయిగా కన్నులు మూసికొనిపోక — పాపము — పాపము కొద్దిగాం బండినది. తన యొప్పు దిని తనకు జోహారులిడిన ద్రోహు లందరు కృతఘ్నులైనారు. జీవనాధారము కష్టమైనది. యోగ్యత నాదరించి గౌరవించువారు లేరు. ఇంట నన్నము లేదు. కలము పారవేసి కర్షకుండైనాండు. అదృష్టము పూర్తిగా వక్రించినది. కన్నులలో రెండు బాష్పబిందువులు అభిమానమును పెకలించుకొనివచ్చి నిలచినవి. గర్వ మాగినదా? మరణకాలమున "దివిజకవివరు గుండియ ల్దిగ్గురనంగ" అని తనకుందానే గౌరవము చేసికొన్నాండు. అంతర్నిహితమైన యభిమాన మొక్కసారి పొంగివచ్చినది.

అమరకవి యస్తమించినాండు. గుణదోషములచే — తేజస్తమస్సులచే శబలితమైన యాతని జీవితమునుండి మధురకావ్యములు బయలుదేరినవి. మహాకవికిం గూడుపెట్టక బలవంతముగాం జంపిన మన మాతని కావ్యములు నేంటికిని జదివి లొట్టలు వైచుచున్నాము.



# సిప్రో

## వనస్పతి సంబంధమైన టాయిలెట్ సబ్బు

చాల ఎక్కువ నురుగు, అనుకూలమైన పరిమళముతో కూడినది. చర్మమునకు ఎక్కువ మృదుత్వము చేకూర్చునట్టియు, పరిశుద్ధమైనట్టి దినుసులిందు చేర్చబడినవి. సుకుమారులకుగూడ యీ సబ్బు సంతృప్తిని కలిగించును.

**కేశచర్మములకు నిరపాయకరమైనది**

**Bengal Chemical & Pharmaceutical Works Ltd., Calcutta & Bombay.**

మదరాసు ఏజంట్లు :— యన్. దేశాయిగౌండర్ అండ్ కంపెనీ, 41, బందరు వీధి.

---

### ఇప్పుడే భీమా చేసికొనుట వివేకంగాదా?

అనిశ్చయమైన భవిష్యత్తుతో ప్రతివారును రాబడిని కూడబెట్టి కాపాడుకొనుటలో శ్రద్ధగా పని చేయుట ముఖ్యమైన పని.

మీరు యింతకుమునుపే జీవితము భీమా చేసుకొనిన దానిని విడువవద్దు, తప్పిపోనీయకుడు. మీకు భీమా లేకపోయిన నేడే భీమా చేసికొనుడు. ఒక జీవితపాలసీ మీకు ఉత్కృష్టమైన రక్షణ యొసంగును. అది మీకు యిప్పుడే తరువాతకంటె చౌకగా నుండును. ముందుగా హెచ్చరిక కలిగియుండుట రక్షణ కవచమువంటిదను వాక్యోక్తి సత్యమైనది.

మిగతా వివరములకు సలహాకు వ్రాయుడు :

## నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

ప్రధానకార్యాలయం: కలకత్తా. స్థాపితము: 1906

బ్రాంచి ఆఫీసు :

"నేషనల్ ఇన్సూరెన్సు భవనములు"

362, చైనాబజారు రోడ్డు, ఎస్ప్లనేడ్, మద్రాసు.

సబ్ ఆఫీసులు : 171, న్యూస్ట్రీట్, మధుర.

5, కెంపెగౌడ రోడ్డు, బెంగుళూరు.

---

## రాజమోహన హేరాయులు



శ్రేష్ఠమయిన సువాసన గల తెలనూనె. మెదడుకు చల్లదనమును కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమమయినది.

తలపోటు, కూడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవనొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమమయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అండు కంపెనీ,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.



సీరియల్ నాటకము = **రాజరాజు** = శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి



## పదిహేడో రంగం

రత్నాంగి నగరిలో సారంగధరుడి వాస గృహం.

అప్పటికి జామున్నర పొద్దుంది.

ఆంధ్రమహాభారతం ఆదిపర్వం చదువుకుంటూ, సారంగధరుడు పడకకుర్చీలో కూచుని వున్నాడు.

సారంగధరుడు—"ఏను దాశరాజు కూఁతురఁ, దండ్రినియోగంబున నిక్కార్యంబు ధర్మార్థంబు సేయుచుండుదు ననిన దాని యభినవరూప సౌందర్యంబులు దొల్లియు విని వెలెంగినవాఁడై యక్కోమలిం గామించి దాశరాజుకడకుం జని తన యభిప్రాయం జెలెంగించిన నతండును సంతసిల్లి శంతను నత్యంత భక్తిం బూజించి యిట్లనియె.

పుట్టినప్పుడ కన్యకఁ బోలనట్టి
వరున కిచ్చుట యిది లోకవర్తనంబు
వసుమతీనాథ నీయట్టి వరున కిచ్చి
ధన్యులము గామె యిక్కన్య దద్దపేర్మి.

అయినను నా డెందంబునం గలదానిం జెప్పెద నిక్కన్యకఁ నీవు ధర్మపత్నిగాఁ జేయునట్టి యిష్టంబు గల దేని నా వేఁడినదాని నిమ్మనిన శంతనుండు దాని నీవను దేని యిచ్చెదఁ గాని నాఁ డీచేర నది యేది చెప్పుమనిన దాశరా జిట్లనియె.

భూపాల నీకు నిక్కోమలియందుఁ బుట్టిన సుతుఁడు
నీపరోక్షంబున రాజు గావలె సమ్మి నిట్లేఁగ
నొప్పు చేయునిన శంతనుఁడు గాంగేయు యువరాజుఁదలఁచి
యీపలుక్కు దక్కఁగ నొండు వేఁడుము యిచ్చెద ననిన.

నా కొండెద్దియు నిష్టంబు లే దనిన విని యద్దాశ రాజుచేతం బ్రతిహతమనోరథుం డయి క్రమ్మఱి వచ్చి శంతనుండు చింతాక్రాంతుం డయి సత్యవతిన తలంచుచు పీతకార్యావసరుం డయి యున్న నొక్కనాఁడు గాంగేయుండు తండ్రిపాలికి వచ్చి యిట్లనియె.

భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టి శా
త్రవనివహంబు లేదు వసుధాప్రజ లెల్ల ననంతసంతతో
త్సవముల రాజులెల్ల ననిశంబు విధేయుల నీవు నిట్లు మా
నవవృషభేంద్ర యేలొకో మనఃపరితాపముఁ బొంది
యుండఁగన్.

అనిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి, శంతనుండు గొడుకున కిట్లనియె.

వినవయ్య యేకపుత్త్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మవిదుల్
విని నీకుఁ దోడు పుత్త్రుల
ననఘా పడయంగ నిష్ట మయినది నాకున్.

జననుతి యగ్నిహోత్రం
బును సంతానమును వేదములు పెడబెగఁగాఁ
జన దుత్తమవంశజులకు
ననిరి మహాధర్మనిపుణు లైన మునీంద్రుల్.

నీ వస్త్ర శస్త్ర విద్యా
కోవిదుఁడవు రణములందుఁ గ్రూరుఁడ వరివి
ద్రావణసాహసికుండవు
గావున నీయునికి నమ్మఁగా నోప నెడన్.

బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయవలయు
వివాహం బయ్యెద—"

అడవిలో, నదిలో రేవుపడవ నడిపే పల్లెపిల్లను చూశాటప్పటికి మనస్సు చెదిరిపోయింది. నగరిలో, దేవాంశసంభూతు లైన దేవవ్రతుల వారిని చూశాటప్పటికి "ఉంటాడో పూడిపోతాడో" అని అపనమ్మకం కలిగిపోయింది. మహాధర్మనిపుణు లైన మునీంద్రులకు, ఇది, అపూర్వమైన గొప్ప ధర్మ సందేహం అయిపోయింది. దానిమీద, వారు, ధర్మశాస్త్రాలు పరిశీలించి "మళ్లీ పెళ్లిచేసుకోవలసిం" దని శంతనుమహారాజులుంగారికి ఆజ్ఞాపించారు.

ఔచిత్యం అక్కర్లేదూ?..... పోనీ, నిజంగా బహుపుత్త్రత్వమే ప్రధానం అయితే మరొక సుందరి పనికిరాదూ?......తరిచి చూస్తే యీ సంప్రదాయం పుత్త్రపౌత్త్రాభివృద్ధిగానే కనపడుతోంది. అక్కడ, యయాతి మహారాజులుంగారు, కొడుకు యౌవనం స్వీకరించి, ఆకొడుకుని కన్న తల్లితోనే చిరకాలం క్రీడించారు. ఇక్కడ, శంతను మహారాజులుంగారు, పెళ్లియీడు వచ్చివున్న యేకపుత్రుడికి శాశ్వతబ్రహ్మచర్యం అంటగట్టి కొత్తపెళ్లికూతుర్ని సంపాదించుకున్నారు. సరి, యిప్పుడు, నాయనగారు మరో అడుగే ముందుకి వేశారు.

ఇది వంశాచారం అయిపోయిం దన్నమాట...

......ఇది కాదు, మరో ఘట్టం చదువుకుందాం. (కొన్ని పుటలు తిరగవేసి)

"యాదవకులవిభుఁ డగు శూరుఁ డను వానిఁ
దాత్మతనూజలయందుఁ బెద్ద
దాని నంబుజముఖి ధవళాక్షి వసుదేవు
చెలియలిఁ బృథ యను చెలువఁ బ్రీతిఁ
దన మేనయత్త నందనుఁ డపుత్రకుఁ డైన
యాకుంతిభోజున కర్థితోడఁ
గూఁతుఁగా నిచ్చినఁ గోమలి యాతని
యింటఁ దా నుండి యనేకవిప్ర
వరుల కతిథిజనులకు నవారితముగఁ
దంత్రిపని నిష్టమృష్టాన్న దాన మొనరఁ
జేయుచున్న దుర్వాసుఁ డ న్సిద్ధమునియు
వచ్చె నతిథి యై భోజనవాంఛఁ జేసె.

కుంతియు నమ్మునివరు కోరిన యాహారంబు పెట్టిన సంతుష్టుండై యమ్మునివరుం డిట్లనియె నీ మంత్రంబున నీ వెవ్వేని నొక్క వేల్పు నారాధించి తద్వేల్పు నీకోరినయట్టి పుత్త్రకుల నిచ్చు నని యాపద్ధర్మంబుగా నొక్క దివ్యమంత్రంబుఁ బ్రసాదించి చనిన—"

ఎక్కడి కెక్కడికి సంబంధం? కుంతీ అమ్మవారు భక్తిశ్రద్ధలతో సపర్యలు చెయ్యడమూ ధర్మంగానే వుంది. దుర్వాసులు ఆసేవలకు సంతుష్టులై వరం ప్రసాదించడమూ వుచితంగానే వుంది. కాని యిదేమి వరమూ?.........కోరిన దేవతలు దిగి రావడమూ, కోరిన కొడుకుల నివ్వడమూనా? ఈ వింతవరాని కగత్యం యేమి వచ్చిందీ?......... ఇది కుంతీ అమ్మవారి కోరిక కాదే?......... ఆమె వరమే కోరుకోలేదే? దుర్వాసు లయినా యోగదృష్టితో పరిశీలించి ఆమె యిలా వుబలాట పడుతున్నట్టు గమనించలేదే? వారికి, అదిగంగా పరిశీలించవలసిన ఆవశ్యకమున్నూ కలగనే లేదే? పైగా, కోరిన భర్త లభించడానికయినా కాదే యీవరము? .........ఇది, భర్తవల్ల కాక, పైవారివల్ల సంతానం కన మని ఆమెని ఆశీర్వదించడం అయిందే? ............ఈడు వచ్చిన్నీ యింకా పెళ్లి కాని కన్యకు యిలాంటి వరం దయచెయ్యడం, శీలభంగం చేసుకో

మని ఆమెని పురికొల్పడం కాదూ? దీనివల్లనే ఆమె అప్పటికప్పుడే శీలభంగం చేసుకున్నదే? .......... ......పోనీ, కుంతీ అమ్మవారి ప్రవృత్తి "సులభంగా శీలభంగం చేసుకునే మనిషి" అని నిర్ణయించడానికనువుగా వుండినదా? అదే నిజమయితే దుర్వాసులామె సేవలు తిరస్కరించవలెన్నే? .......... ఆపద్ధర్మంగా దయచేశారట యీవరం. ఏమిటా ఆపద? కుంతీ అమ్మవారికిప్పుడీ వరం అనుగ్రహించకపోతే తరవాత సంతానం కలగదా? .......... యమాదులవల్ల ధర్మరాజాదుల జననం ఆపద గడవబెట్టడానికయితే, మరి, భాస్కరులవారివల్ల కర్ణులవారి జననం రెందుకోసం అయినట్టూ?.........(విసుగ్గా భారతం మూసేసి) ఏమిటీ యీగాథోరణి? కలుషిత మయిపోయిన మనస్సు కుదుటపరుచుకుందామని భారతం విప్పితే యిలాంటి సందేహ పరంపర కలుగుతోందేమీ? దీనివల్ల మనస్సు మరింత కలిగిపోవడం లేదూ?.........(నమ్రం కేసి మాస్తూ) ఎవరక్కడ?

[ఒక పరిచారిక వస్తుంది.]

పరిచారిక—నేనున్నాను బాబయ్యా!

సారంగధరుడు—గౌరిని పిలు.

పరిచారిక—పిలుస్తాను బాబయ్యా!

[పరిచారిక వెళ్ళిపోతుంది. సారంగధరుడు, భారతం, పక్కనున్న బల్లమీద వుంచేసి ఆలోచిస్తూ వుంటాడు. ఇంతలో గౌరి వస్తుంది.]

గౌరి—ఎందుకు బాబూ?

సారంగధరుడు—అమ్మగారి దర్శనం అవుతుందా?

గౌరి—తొందరగా కావాలా బాబూ?

సారంగధరుడు—వీలయితేనే.

గౌరి—ఇప్పుడు వీలు కాదు.

సారంగధరుడు—అలాగా?

గౌరి—జక్కులదేవి రాణీగారు దయచేసి వున్నారు.

సారంగధరుడు—ఓహో, వారు దయచేసి వున్నారా?

గౌరి—బాబయ్యగారు వేటకి వెంచేసినప్పణ్ణుంచీ దినదినమూ దయచేస్తూనే వున్నారు వారు. దయచెయ్యడమే కాదు, అమ్మగారిని విడిచి, వో పట్టాన, తమ నగరికి వెంచెయ్యలేకుండా వున్నారు కూడానూ.

సారంగధరుడు—అంత ఐకమత్యంగా వుంటున్నారూ వారిద్దరూను? చాలా బాగుంది. పోనీ, నేను బుల్లిబాబయ్యగారి దర్శనానికి వెడతాను, నువ్వు వెళ్లు.

గౌరి—మంచిది బాబూ!

[గౌరి బయలుదేరుతుంది.]

సారంగధరుడు—చూడూ, అమ్మగారి దర్శనానికి—(అర్థోక్తి)

గౌరి—(వెనక్కి తిరిగి) ఏమిటి బాబూ?

సారంగధరుడు—అమ్మగారి దర్శనానికి ప్రత్యేక కారణం యేమీ లేదు. ఒక్కమాటు దర్శనం చేసుకుని బయటికి వెడదా మనుకున్నాను, అంతే.

గౌరి—సరే బాబూ!

సారంగధరుడు—సుబుద్ధి అయ్యవారు కనపడి, వాహ్యాళికి వెళ్లడం తటస్థపడితే కొంచెం ఆలస్యంగా రావచ్చు. కనక, వేళ కాగానే అమ్మగారిని ముందు భోజనం చెయ్యమని మనవి చెయ్యి.

గౌరి—అలాగే బాబూ!

[గౌరి వెళ్లిపోతుంది.]

సారంగధరుడు—దినదినమూ దయచేస్తున్నారా? దయచేసి యిక్కణ్ణుంచి వెంచెయ్యలేకపోతున్నారా? బాబయ్యగారు వేటకి వెంచేసినప్పణ్ణుంచీనా యిది? కారణం? అమ్మగారి పాదాల దగ్గిర కూమని, నిన్న, ఏదో మాట్లాడుతూ వుండినవారు వారే అయి వుంటారా? ఆ వినయానికి హేతువు? ఈనడమంత్రపు పుట్టి మునక తటస్థించి వుండకపోతే సావిత్రీ అమ్మవారికి బదులు అమ్మగారినే పూజించుకుంటూ వుండే కేమో వారు? ఆ భక్త్యాదరాలు చూసుకుని, సవ

అయినా అంత మురిసిపోతూ వుండిన అమ్మగారు, కోడలే అయితే ఎంత పొంగిపోతూ వుందురో?... (విసుగ్గా) ఊ! ఇదంతా గతజలసేతుబంధనమూ, అసంభవప్రతీక్షానూ. (నాలు గడుగులు వేసి, అంతలో ఆగి) బుల్లి బాబయ్యగా రిపాటికే మొగసాలకి వేంచేసి వుంటా రేమో?.........చూతాం.

[వెళ్లిపోతాడు.]

## పద్ధెనిమిదో రంగం

అయిదు గడియల పొద్దువేళ.

రాజరాజు నగరికి వెనకా, పశ్చిమ ప్రాకారానికి చేరీ వున్న పూలతోటలో, మనస్తిమితం కోసం, సారంగధరుడు తిరుగుతూ వుంటాడు.

స్నానంచేసి, పట్టుచీర ధరించి, పువ్వుల కోసంవచ్చి, చిలక ఆతోటలోనే తిరుగుతూ వుంటుంది.

ఎవరిమట్టుకి వారు అలా తిరుగుతూ వుండడంలో కొంత సేపటికిద్దరూ వొక గోజ్జంగి చెట్టు దగ్గిర తారసపడతారు.

తారసపడతారంటే – ఆ గోజ్జంగిచెట్టు చిటాచివర వొక పెద్ద పువ్వుంటుంది. అది చూసి, ముగ్ధఅయి, పూలసజ్జ వొకచోటవుంచి చిలక అది అందుకోడానికి రెండుమూడు మాట్లు సుతారంగా ఎగురుతుంది.

ఆసమయంలో వస్తాడు, సారంగధరుడు, వెనక వేపుకి.

చిలకను చూసి మొదట చకితుడున్నూ అవుతాడు.

సారంగధరుడు— (చూసి చూసి) ఏమీ, పువ్వుం అందడం లేదూ?

[అది విని, చకితా లజ్జితా అయి, నింపాదిగా సారంగధరుడి కేసి తిరిగి, యథాపూర్వంగా నమస్కరించి సాకూతంగా చూస్తుంది చిలక.]

సారంగధరుడు—(ఒకమాటు ఇలాగా అలాగా చూసి) పువ్వుం అందడం లేదూ?

చిలక—అంద కేమీ, చివాకి అందుతుంది మహాప్రభూ! కొంచెం శ్రమ, అంతే.

సారంగధరుడు—కొంచె మేమీ, చాలా శ్రమ పడ్డావు పాపం.

చిలక—మా అమ్మ శ్రమముందు నా శ్రమ యేపాటిది మహాప్రభూ?

సారంగధరుడు—అవునవును. మీ అమ్మగారి శ్రమా గొప్పదే, నీ శ్రమా గొప్పదే. అందుకు తగ్గట్టు ఆ పువ్వున్నూ గొప్పదే.

చిలక—గొప్పది కనకనే నన్ను లక్ష్యపెట్టడం లేదు మహాప్రభూ అది.

సారంగధరుడు—ముళ్లడొంకలో యిరుక్కుని వున్నదికదా, దానిమీద నీ కంత ఆగ్రహముండడం ధర్మమా? పోనీ, నేను కొమ్మవంచతాను, నువ్వు పువ్వుం అందుకో. (వంచుతాడు)

చిలక—(ఆకొమ్మ చేత్తో పట్టుకుని) ప్రభువులు మా శ్రమలో పాలు పుచ్చుకోవడం చూస్తే — (సారంగధరుడి కేసి కీగంట చూస్తూ) సావిత్రీ అమ్మవారు తప్పకుండా అనుగ్రహిస్తా రని — (పువ్వు చిదిమి చూస్తూ) ఇంత పెద్ద పువ్వుం నే నెక్కడా చూడలేదు మహాప్రభూ! దీని సంగతి విన్నా చూసినా మా అమ్మ పొంగిపోతారు. (సజ్జలో వుంచుతుంది.)

సారంగధరుడు—(చెట్టుపరిశీలించి) ఆ వొక్క పువ్వే వుంది, మరి లేవు.

చిలక—సజ్జ నిండింది, చాలు మహాప్రభూ!

సారంగధరుడు—అవును, మళ్లీమళ్లీ పట్టుకు వెళ్లవలసిందే కాదూ పువ్వులు? ఇవెలాగా చాలవు కాదూ?

చిలక—తేమరు సెల విప్పించిన ట్టివి యేమూలకి మహాప్రభూ! నేను వెళ్లి, మా అమ్మగారికి స్నానం

చేయించి, పూజలో కూచో పెట్టి మళ్లీ వస్తాను, సెలవిప్పించండి.

సారంగధరుడు—ఇంకా స్నానం కాలేదూ?

[చిత్రాంగి నగరు అక్కడికి వంద గజాలలో వుంది. చిలక యాదాలాభంగా అటుచూస్తుంది. డాబామీద నుంచుని చిత్రాంగి యిటే చూస్తూ వుంటుంది.]

చిలక—(చిత్రాంగిని చూపిస్తూ సారంగధరుడితో) అదుగో మాఅమ్మ—(అర్ధోక్తి)

సారంగధరుడు—(చకితుడై అలా చూస్తాడు)

చిలక—వాకోసం కనిపెట్టుకుని వున్నారు. సెలవు మహాప్రభూ!

[జవాబు కోసం చూడకుండానే మళ్లీ నమస్కరించి, పూలపజ్జ అందుకుని బయలుదేరి, చిలక, ఒక పూవుపొదరం మాటుచేసుకుని వుండి సారంగధరుడి యింగితం కనిపెడుతూ వుంటుంది.]

సారంగధరుడు—(ఒకమాటు అటూ యిటూ పరకాయించి, మళ్లీ చిత్రాంగి కేసి చూస్తూ) ఎవర్ని చూస్తున్నట్టు? ఆచూపుల్లో యేమి వున్నదో తెలుసుకోవాలంటే దూరమయిపోయిందే, యేమిటి దారి? మూడేళ్ల నాటి పాపికొండల సంఘటన నామనస్సునూ, నేటి యీదూరదర్శనం నాచూపులనూ కలిచేస్తున్నాయి, నిలవరించుకోవడం యెలాగా? (గుండెలు పిసుక్కుంటూ) దావానలం మళ్లీ రేగుతోంది. ఇక్కడ వుండగూడదు.

[సారంగధరుడు వడిగా మరో వేపుకి వెళ్లిపోతాడు. "దారిలో పడుతున్నాడు" అన్నట్టు ఒకమాటు తలపంకించి చిలకా వెళ్లిపోతుంది.]

## పంథొమ్మిదో రంగం

నాలుగు ఘడియల పొద్దుంది.

ఆపూలతోటలోనే మరొకచోట—చిత్రాంగినగరికి మరికొంచెం దగ్గిరగా, సారంగధరుడు పాలరాతి అరుగుమీద కూచునీ, సుబుద్ధి అరుగు ఆనుకు నుంచునీ వున్నారు.

ఇద్దరూ దిగాలుపడిపోయి వున్నారు.

సారంగధరుడు—రెండు మాసాల కిందట పుష్కరునక. ఇవాళ పొట్టపండు. రోగం కాని రోగం భట్టారకులవారిని పీల్చేసింది.

సుబుద్ధి—మనోరోగాన్ని మించిన రోగం యేమిటి మహాప్రభూ? ప్రతిభావంతులను అది అలుముకుంటే యిక చెప్పడానికేం వుందీ?

సారంగధరుడు—మతి చలించినా జీవించి వుంటే, వారికి అవస్థే అయినా, వారిమీద ప్రాణాలు పెట్టుకునివున్నవారి కదొక సంతోషం; కాని ఆ అదృష్ట మయినా లేనట్టే సెలవిస్తున్నారు తమరు.

సుబుద్ధి—చిత్తం, నారాయణభట్టుగారు, వ్యవహారం అంతా యిక ఘాటల్లో వుందని నిర్ధారణ చేసేశారు. మా నాయనగారున్నూ—(అర్ధోక్తి)

సారంగధరుడు—వారే అలా సెలవిస్తే యింకేమి ఆశా? (కళ్లు తుడుచుకుని) తండ్రి తరవాత అంతవారు. ఇప్పటంతకంటేనూ యెక్కువవారు; కాని వారు—నన్ను—విడిచి—(దుఃఖోద్రేకంవల్ల యిక మాట్లాడలేక రెండు చేతులా మొగం కప్పుకుంటాడు)

సుబుద్ధి—(చకితుడై) ప్రభూ!

సారంగధరుడు—(మాట్లాడలేడు)

సుబుద్ధి—(అతని చేతులు పట్టుకోబోతూ) మహాప్రభూ!

సారంగధరుడు—(చేతులు తీసేసుకుంటూ) ఆ!

సుబుద్ధి—తమరే యిలా అయితే—(అర్ధోక్తి)

సారంగధరుడు—(కళ్లు తుడుచుకుంటూ) కాకుండా వుండడం యెలాగా? ఈవ్యాధి నెమ్మదిస్తుందనీ, కొద్ది దినాల్లోనే వారు నాకు చిత్తశాంతి అనుగ్రహిస్తారనీ ఆశిస్తూ కాలం నెట్టుకుంటూ వచ్చాను. ఇంకేమిటీ దారీ?

సుబుద్ధి—తమకి తామే స్థైర్యం చిక్కబట్టుకోవాలి. నేను చెప్పగలవాణ్ణా తమకు?

సారంగధరుడు—(సుబుద్ధి కేసి వొక్క క్షణం గంభీరంగా చూసి, కొంచెం ఆవేగంతో) తమరు నాకు ఆంతరంగికులని అనుకున్నాను; కాని నా స్థితిగతులు తమరు గుర్తించలేదన్నమాట. నా యాతన తమకు అర్థమే కాలేదన్నమాట.

సుబుద్ధి—(చకితుడై, పరితాపంతో) అయింది మహాప్రభూ, చక్కగా అర్థం అయింది. అంచేతనే తమర్ని చూస్తే నా మనస్సు చెదిరిపోతోంది. మరొకటి తలుచుకుంటే నా కడుపే చెరువయిపోతోంది.

సారంగధరుడు—(ఆదుర్దాతో) అదేమిటి? మరేమి విపత్తు వచ్చింది?

సుబుద్ధి—కొత్తది కాదు మహాప్రభూ, పాతదే; కాని నేను ఇప్పటికి కళ్లు తెరిచాను.

సారంగధరుడు—(చకితుడై) పాతదా?

సుబుద్ధి—అవును. పోల్నాడు రాజపుత్రికా, తమరూ వుమ్మడిగా పందిని పొడిచినప్పుడు నా కది హఠాత్తుగా స్ఫురించింది; కాని యీ పదిదినాలూ "అవునా కాదా" అన్న చర్చలో గడిచిపోయాయి. ఇప్పటి తమ అవస్థ చూశాటప్పటికి, అవునని నిశ్చయబుద్ధి కలిగి నా నరాలు కుంగిపోతున్నాయి. (సారంగధరుడి కాళ్లదగ్గిర కూలబడి) క్షమించమని ప్రార్థించడానికయినా నాకు యోగ్యత లేదు. నే నపరాధిని, క్షుద్రుణ్ణి, పాపాత్ముణ్ణి.

సారంగధరుడు—(సుబుద్ధిని లేవదీస్తూ) తప్పు తప్పు. తమ రిలా చెయ్యడం ధర్మమా, నాకు శ్రేయస్కరమా?

సుబుద్ధి—(దోసిలి వొగ్గి) మహాప్రభూ! నాయెడల తమ భావన అలాంటిదే; కాని నేను తమ శ్రేయస్సు కాల రాసేసిన కిరాతుణ్ణి. నా అపరాధం దావానలమై కీలకీలునా వ్యాపించి నన్ను నిలువునా కాల్చేస్తోంది. నేను భరించలేకుండా వున్నాను.

సారంగధరుడు— (సుబుద్ధిచేతులు పట్టుకుని) మనస్సు కుదుటపరచుకోండి. తమరు నాకు చేసిన ద్రోహం యేమిటి?

సుబుద్ధి—ద్రోహం యింతా అంతానా మహాప్రభూ? ఈ దుస్థితి కంతకీ కారణం నేను.

సారంగధరుడు—ఏదుస్థితికి?

సుబుద్ధి—తమ దుస్థితికి, అమ్మగారి దుస్థితికి, భట్టారకులవారి దుస్థితికి, మహారాజులుంగారి దుస్థితికి. ప్రాజ్యచళుక్యసామ్రాజ్యానికే నామూలాన తీరని దుస్థితి యేర్పడింది. ఈయెరుక నన్ను భస్మం చేసేస్తోంది.

సారంగధరుడు—తమ ఆందోళన నేను చూడలేకుండా వున్నాను. నామనస్సు పరిపరివిధాల పోతోంది. అదేదో త్వరగా సెలవిప్పించండి.

సుబుద్ధి—(గాఢమైన పరితాపంతో) చెప్పడాని కేం వుంది మహాప్రభూ? ఏ మొంగం పెట్టుకుని చెప్పను మహాప్రభూ? ఇంతవరకూ వచ్చాక చెప్పి మాత్రం యేమి ప్రయోజనం మహాప్రభూ?

సారంగధరుడు—స్సే, మహాదేవా! (అని మొగం తిప్పుకుంటూ సుబుద్ధిచేతులు వదిలేసి వొక్క అడుగు వెనక్కి వేస్తాడు)

సుబుద్ధి—(కంగారుపడుతూ దోసిలి వొగ్గి) మొగం చెల్లక మనవిచేసుకోలేకపోతున్నాను, క్షమించండి మహాప్రభూ! ఇప్పుడు మనవిచేసుకుంటున్నాను మహాప్రభూ!

సారంగధరుడు—(మెల్లిగా సుబుద్ధికేసి మొగం తిప్పుకుంటాడు.)

సుబుద్ధి—ఆవేళ—? మూడేళ్లనాడు పాపికొండల్లో—? పులివేట ముగిశాక, తమ గుడారాని కొక్కమాటు దయచెయ్యవలసిం దని జక్కులదీవి మండలేశ్వరులు తమర్ని ప్రీతితో ఆహ్వానించారు.

సారంగధరుడు—అవును, ఆహ్వానించారు.

సుబుద్ధి—చిత్రాంగీదేవమ్మగారి విభ్రమవిలోకనాలూ, తమ గంభీరకటాక్షాలూ అప్పటి కప్పుడే

ప్రీతి పెరుగుతున్నాయి. ఆహ్వానం విన్నదే తడువుగా తమ రొక్క అడుగున్నూ వేశారు; కాని తమర్ని నేను వారించాను.

సారంగధరుడు—తమరు వారించడం నిజమే. అయితే?

సుబుద్ధి—అనవసరంగా వారించాను. ప్రతిభావంతుణ్ణనే గర్వం కళ్లు కప్పివుండడంవల్ల దూరాలోచన చెయ్యలేక అవివేకినై వారించాను.

సారంగధరుడు—అయితే యేమిటి? పరమార్థం సెలవిప్పించండి

సుబుద్ధి—అప్పుడే కనక మనం వారి సుదారానికి వెళ్లి వుంటే వుత్తరక్షణంలో గాంధర్వవివాహం జరిగిపోయివుండును.

సారంగధరుడు—(ఇది విని ములుకు గుచ్చుకున్నట్టు బాధపడుతూ మొగం పక్కకి తిప్పుకుంటాడు.)

సుబుద్ధి—అప్పుడు నేను తమర్ని వారించి వుండకపోతే మహారాజులుంగా రిప్పుడింత అపహాసం చెయ్యడానికి—(అర్ధోక్తి)

సారంగధరుడు—(గభీమని సుబుద్ధిచేతులు పట్టుకుని) చాలు. ఇక మాట్లాడవద్దు.

సుబుద్ధి—నాతప్పు విన్నవించుకోకుండా—(అర్ధోక్తి)

సారంగధరుడు—బోధపడింది. వద్దంటున్నాను. ఇప్పుడంతకంటే పెద్ద తప్పు చేస్తున్నారు తమరు. ఇక ఆవూసెత్తవద్దు.

సుబుద్ధి—(నిర్విణ్ణుడయి వూరుకుంటాడు)

సారంగధరుడు—ఒక్క క్షణమైనా తమరిక్కడ వుండవద్దు. భట్టారకులవారి సన్నిధికే వేంచెయ్యండి. వారి స్థితిగతు లన్నీ పరిశీలించి, అపాయం వచ్చేటట్టుంటే, రాత్రి భోజనానంతరం దయచెయ్యండి. మనం వుభయులమూ కలిసి మళ్లీ వెడదాం

సుబుద్ధి—ఒక్క మనవి.

సారంగధరుడు—అగత్యం లేదు.

సుబుద్ధి—ఈస్థితిలో తమర్ని విడిచి-(అర్ధోక్తి)

సారంగధరుడు—(దృఢస్వరంతో) మాట్లాడవద్దన్నాను. నేం చెయ్యమంటున్నాను. సంకోచవద్దు.

[విధి లేక, తల వంచుకుని, కాళ్లీడ్చుకుంటూ సుబుద్ధి వెళ్లిపోతాడు. అతను కనపడ్డంతసేపూ సారంగధరుడు అలా చూస్తూనే వుంటాడు.]

సారంగధరుడు—తేలిపోయింది. అదే దీని కంతకీ మూలం. నా శ్రేయస్సు కోరారే గాని, సుబుద్ధి అయ్యవారు, అది సాధించలేకపోయారు. వారి అవిమృశ్యకారిత మా భవిష్యత్తును చిక్కుపరిచేసింది. మా ఆశాసౌధానికి చిచ్చు పెట్టేసింది. మా నిండు జీవితాలను దగ్ధపటలమే చేసేసింది.

. అయితే, నా వివేకం అంతా యేమయిపోయిందీ? నా స్వాతంత్ర్యనిరతి యెక్కడికి పోయిందీ? మాట చెప్పగలడే కాని, మంత్రికొడుకు, చెయ్యి పట్టుకుని వెనక్కి పడలాగగలడా?

పడిపోయిన్నీ ఘూర్జిల్లుతూనే వుండిన ఆపులిని కాల్చేసిన చిత్రాంగి ఆ చూపులు, ఇటు మళ్లుతూనే ముగ్ధమోహనా లయి నన్నెంత ఆకర్షించలేదూ? ఆ చూపుల్లో యెంత మమత—ఎంత ఆశ—ఎంత జాలి—చివరి కెంత విషాదం పొంగిపోలేదూ?

అప్పుడు నే నెందు కంధుణ్ణయిపోయానూ? బధిరుణ్ణెందు కయిపోయానూ? అభావదశకే యెందుకు పడిపోయానూ?

మూడేళ్లుగా భావించుకుంటూనే వున్నానే? స్మరించుకుంటూనే వున్నానే? మననం చేసుకుంటూనే వున్నానే? ధ్యానించుకుంటూనే వున్నానే? కలలు కనుక్కుంటూనూ వున్నానే? రగిలి, రాజి, కమిలి, కుమిలి, బుగ్గే అయిపోతున్నానే?

మరి మట్టిముద్దనయి, జీవచ్ఛవం అయిపోయి వున్నానేమిటి? ఆమెకోసం ప్రయత్నమే చెయ్య

లేకపోయా నేమి ?పోనీ, అన్నాళ్లనుంచి నుచ్చినుచ్చి అడుగుతూ వున్న అమ్మగారికి సూచనగా అయినా అందించ లేకపోతానేమి ?

ఇదంతా సిగ్గా, వినయమా, క్లైబ్యమా ?

తాను కోరిన పురుషుడు తన్ను ప్రేమించినన్నీ యిలా దాసై అయిపోయి వున్నట్టు తెలిస్తే ఏయువతి సహించగలదూ ?

అయితే, నేను తన్ను ప్రేమించివున్నట్టు ఆమెకి నష్టేమిటీ ?

కాకపోతే, ఆమెకీ వ్రతం యేమిటీ ? నాయన గారిని దూరంగా వుంచడానికే కాకపోతే యిదెం దుకూ ? ఇప్పటికీ నామీదే తన హృదయం లగ్నం అయిపోయివుండకపోతే నాయనగారిని దూరంగా వుంచవలసిన అగత్యం యేమిటీ ?

నాయనగా రంటే విరక్తా ? అమ్మగా రంటే భక్తా ? నాయనగారి యెడల భర్తృభావం యేపాటి వున్నా రాత్రివేళా, సంధ్యల్లోనూ దర్శనం కూడా నిషేధించడం యేమిటీ ? అమ్మగారి యెడల సపత్నీ భావమే వుంటే ఆ పాదసేవ లేమిటీ ?

చిలకచూపుల్లోనూ, మాటల్లోనూ నాకోసం సాకూతమదనలేఖ ల్లేవూ ? లేకపోతే, వ్రతంసంగతి చిలక నాతో చెప్పడం యెందుకూ ?

(మళ్లీ చిత్రాంగి నగరి కేసి చూసి)

అదిగో, చిత్రాంగి యింకా అక్కడే వుంది, ఇలాగే చూస్తోంది. ఎవరి కోసం ఆ చూపులు? (అటూ యిటూ చూసి) ఆచూపులు పడుతున్న యిక్కడ నేను కాక మరి పిట్ట అయినా లేదే! సందేహం లేదు. నన్నే చూస్తోం దామె. నామీదే వుంది ఆమె చూపు. నేనే వున్నా నామెహృదయంలో. నాయనగారు లేచేలేరు.

జక్కులదీవి రాజపుత్రిక-చిత్రాంగి నాసొత్తు. కాని, నాచిత్రాంగి—నాహృదయేశ్వరి పరులపా లయి పోయింది. నన్ను నాథకింద కట్టి నాకంఠం పెనవేసు కుని వున్న నాభాగ్యదేవతను పరులు లాగేసుకున్నారు.

ఛీ! ఎంత సిగ్గులచేటు!

వడిచేతులతో భల్లూకాలను పడగొట్టానే! పిడి గుద్దులతో పెద్దపులులను కూల్చానే! నాహృదయేశ్వరిని దక్కించుకోలేని నాబలపరాక్రమా లెందుకు కాల్చ నా? చళుక్యయువరాజు శివిలేశ్వరే అపహృత అయి పోయిందే, మరెవరి భార్య క్షేమంగా వుండగలదూ? యువరాజుగా వుండే యింత పందతనం కనపరిచానే, జనులు తమ మహారాజుగా నన్నంగీకరిస్తారా? రాజ్య లక్ష్మి నన్ను కీగంట నయినా చూస్తుందా?

నేను మానవంతు ణ్ణేనా? నేను రాచపుట్టుకే పుట్టానా? జగదేకవీరు లైన పాండుమహారాజులుం గారి దివ్యరక్తమే నారక్తనాళాల్లో ప్రవహిస్తోందా?

శత్రువు, తమ పట్టపుదేవి కట్టుపుట్టాలు నిండు సభలో వొలుస్తూ వుంటే పాండవులు అనాథలై చూస్తూ వూరుకున్నారు. ఆపోలికే నాకూ వచ్చింది. అయితే, తరవాత, వారు తమవైరం తీర్చుకున్నారే? తమపట్టమహిషి హృదయశల్యం తొలగించుకున్నారే? ఆపోలికకూడా నాకెందుకు పట్టదూ? ఇప్పుడే నాసొత్తు నే నెందుకు స్వాధీనపరుచుకోగూడదూ? నా చిత్రాం గిని తెచ్చుకుంటే నన్నెవ డడ్డుకోగలడూ?

(మళ్లీ చిత్రాంగి నగరి కేసి చూసి)

అదిగో చిలక. ఇద్దరూ ఏదో చెప్పుకుం టున్నారు. ఇద్దరూ నాకేసే చూస్తున్నారు. అపవా రించి, చిలక, నాకు చేసన్న చేస్తోంది అదిగో, నమ్రు రాలై చిత్రాంగి దోసిలి వొగ్గుతోంది. చిత్రాంగి నా సొత్తు. చిత్రాంగి నాహృదయేశ్వరి. చిత్రాంగి నా ప్రాణం! ఇదే నా చిత్రాంగిని నేను తెచ్చు కుంటాను.

[రంయి మని సారంగధరు డొక్క అడుగు వేస్తాడు. వెంటనే వొక పావురం వచ్చి అతని మీద వాలుతుంది. ఆగిపోయి దాన్ని అతను చేతుల్లోకి తీసుకుంటాడు.]

సారంగధరుడు—(పావురంతో) ఇప్పుడెందుకు వచ్చావు? అన్నట్టు నువ్వు చిత్రాంగిపావురంతో జతకట్టుకున్నావు కాదూ? చిత్రాంగి నిన్నెప్పుడేనా ముద్దుపెట్టుకుందా? చిత్రాంగి యెప్పుడేనా నామాట తెస్తుందా? చిత్రాంగి నన్ను తలుచుకుంటోందా? చిత్రాంగి నన్ను నమ్ముకునే వుందా? చిత్రాంగి నా కోసమే యిక్కడికి వచ్చిందా? చిత్రాంగి నాహృదయేశ్వరేనా? నన్ను చిత్రాంగి నగరికి వెళ్లమంటావా?

నాపావురమా! నా ప్రాణమా! ఇదిగో నిన్ను విడిచిపెడుతున్నాను. నువ్వు చిత్రాంగి నగరికి వెడతావా, నేనూ వస్తాను. నువ్వు మరో దారి పడతావా, నేను గోదావరి పడతాను.

(పావురాన్ని విడిచిపెట్టి ఆత్రంగా చూసి)

ఆ! ఆ! చిత్రాంగి నాసొత్తు. చిత్రాంగి నా హృదయేశ్వరి. చిత్రాంగి నాకోసమే వచ్చింది. చిత్రాంగి నాకోసమే యెదురుచూస్తోంది. కనకనే నాపావురం చిత్రాంగిచేతుల్లో వాలింది. నేను చిత్రాంగిపాదాలమీద వాల్తాను.

[దురుసుగా వెళ్లిపోతాడు.]



—

# దేవతార్చన

శ్రీ హనుమచ్ఛాస్త్రి



ఉపనిషత్తులలోన ఊరేగు దేవా!
ఉర్విదార్జన్యాల కూరుకున్నావా ?
కొండశిఖరాలపై కొలువుకూర్చుండి
కూటిపేదల మొడుపు గుంజుతున్నావా ?
వైకుంఠమందిరం పగిలిపోలేదా ?
కైలాసపర్వతం కరిగిపోలేదా ?
దిగిరమ్ము దిగిరమ్ము దేవాదిదేవా!!
పేదఆకలిబాధ పంచుకోవాలి —
మతగురువుపీఠాన మడివిగ్రహాలలో
మణగిపోయిన దేవ — మాటాడలేవా ??

—'జ్వాలాతోరణము' నుండి.

# నారదీయ భక్తి*

రచయిత :
● శ్రీ పూర్ణానంద ●



లీలావిలాసినే భక్తిమంజరీ లోలుపాలినే,
మాధ్ర్యసార్వజ్ఞ్యనిధయే గోకులానంద తే నమః. [విశ్వనాథచక్రవర్తి]

మనకు లభ్యములగు ప్రాచీన భక్తిశాస్త్రగ్రంథములలో నారదభక్తిసూత్ర మొక ఉత్కృష్టగ్రంథము. నారదు డీగ్రంథమున భక్తి 'తత్త్వము'ను గురించి ఎక్కుడుగ ఆలోచింపకపోయినను, సాధనను విశదముగ నుడివియుండుటను కనగలము. కనుక, భక్తిపథము ననుసరించువారు దీనిని విశేషముగ సమాదరించుచున్నారు. సాధకాగ్రేసరులగు శ్రీరామకృష్ణపరమహంస ఈశ్వరదర్శనపిపాసువులగువారికి నారదీయభక్తియే ఈ కలియుగమున శ్రేష్ఠమని వచించుచుండెడువాడు.

పూర్వ మీ దేశమున విద్య గురుపరంపరాక్రమముగ ఉపదిష్ట మగుచుండెడిది. శిష్యుని సుఖబోధకై శాస్త్రములన్నియు సూత్రరూపమున సంగ్రహింపబడెడివి. అల్పాక్షరములలో అసందిగ్ధముగ సారతత్త్వమును దెల్పుటయే వీని విశేషము. ఇట్టిదే నారదుని సూత్రగ్రంథము. ఇందు పది అధ్యాయములుగ విభజింపబడిన ఎనుబదినాలుగు సూత్రము లున్నవి.

ఇతరసూత్రముల కున్నట్లు దీనికి భాష్యముగాని, టీకగాని యున్నట్లగుపించదు. సూత్రము లత్యంత సరళములును, విశదములును అయియుండుటచే దీనికి గారణము కావచ్చును. మద్రాసు రామకృష్ణమఠమువారు ప్రచురించిన ఆంగ్లానువాద మొకటి యున్నది.

ఈశ్వరుని ప్రతి పరమప్రేమయే భక్తియని నారదుడు నిర్దేశించియున్నాడు. ఈభక్తి అమృతస్వరూపము.

ఇంత కెక్కుడుగ నారదుడు భక్తిని గురించి చెప్పలేదు. బహుశః చెప్పజాలకపోయియుండవచ్చును. తరువాత "మూగ రుచియొక్క అనుభవమును చెప్పజాలనట్లు, ప్రేమస్వరూపమునుగూడ నోటితో చెప్పజాలము." అనెను.

వర్ణన ప్రత్యక్షపరముగగాని, పరోక్షముగగాని యుండవచ్చును. ప్రత్యక్షవర్ణన అసంభవ మగుటవలన

* ఈవ్యాసమును సమకూర్ప మా (కొంబై) రామకృష్ణమఠాంతర్భూతులగు ప్రేమఘనానంద స్వామివారి సాయమును గ్రహించితిని.

నారదుడు ఒనరించిన పరిశీలవర్ణన ననుసరించి ఏవస్తువును బొందిన మనుష్యుడు సిద్ధుడగునో, అమృతుడగునో, తృప్తుడగునో అదియే భక్తి. ఏవస్తువును బొందిన మనుష్యుడిక నెద్దానిని గోరకుండునో, దేనికొఱకు శోకింపకుండునో, ఎవరిని గాని ద్వేషింపకుండునో, జగత్తునందలి మరేవస్తువునైన పొందిన ఆనందము బొందకుండునో, లేక ఎద్దానినైన పొంద నుత్సహింపడో అదియే భక్తి. దేనిని గ్రహించిన మనుష్యుడు మత్తుడును, స్తబ్ధుడును, ఆత్మారాముడును నగునో నదియే భక్తి.

ఈ భక్తియందెట్టి కోరికయు నుండజాలదు. ఏలయన, నియ్యది నిరోధస్వరూపము.

లోకప్రాప్తములగు వస్తుజాలమునుండి ఒకానొక ఉత్కృష్టతమవస్తువును గ్రహించినను, ఈ భక్తిలక్షణము లన్నియును దానియందు వర్తింపజాలవు. భోగవాసనా పరిచాలితులగు కొందఱికి అభీప్సితవిషయము తాత్కాలికముగ తాదృశమని తోచినను, ఆ భ్రమ నశించుదిన మచిరముననే అరుదెంచును. కనుక, భక్తి అలౌకికమగు అపూర్వవస్తువు.

సామాన్యముగ మనము శాస్త్రవిధులను సాంఘిక నియమముల ననుసరించి నడుపుచుందుము. మనుష్యుడీ భక్తిని బొందిన సాంఘిక శాస్త్రీయవిధులను దాటిపోవును. అప్పుడీ నియమము లాతని మనస్సును అరికట్టజాలవు. అతడు లౌకిక శాస్త్రీయ విషయములను పరిత్యజించును. నారదీయపరిభాషలో నీత్యాగమే నిరోధము. భక్తిని బడసిన మనుష్యుడితర ఆశ్రయముల నన్నిటిని పరిత్యజించి, హృదయము నీశ్వరుని కొఱకే సమర్పించును. ఇతర విషయములలో నాతడుదాసీను డగును. భక్తికి సాహాయ్యకరములగు లౌకిక శాస్త్రీయానుష్ఠానములను గ్రహించుట కాతని కభ్యంతరము లేదు కాని, తదితరవిషయములను సంపూర్ణముగ త్యజించును.

భక్తి లక్షణమును వర్ణించు సందర్భమున నారదుడు ఇతరాచార్యుల అభిప్రాయములనుగూడ చేర్కొనినాడు. అందు: పూజాదుల అనురాగమే భక్తి యని పరాశరుడు. భగవత్కథానురాగమే భక్తి యని గర్గుడు. విరోధహీనమగు ఆత్మరతియే భక్తియని శాండిల్యుడు. కాని, నారదుడు ఈశ్వరునియందు సమస్త ప్రాపంచికవిషయములను సమర్పించుటయు, ఆయనను విస్మరించుటవలన పరమవ్యాకులత కలుగుటయు అను విషయములనే భక్తిలక్షణములని నిర్వచించి, తన అభిప్రాయమును తేటపరచెను.

అయిన, నారదునకు ప్రాచీనాచార్యులయందు విశ్వాసము లేదా అను ప్రశ్న జనింపవచ్చును. గౌరవము లేక పోలేదు. ఈలక్షణముల నాతడు భక్తిని ఏకాదశధా విభజించిన చోట అంతర్గత మొనర్చుకొనియే యున్నాడు. కేవలము పూజాదుల అనురాగమని యూరకున్న, అది క్రియాకలాపము లనబడు యాంత్రికనియమమున ఆబద్ధమై యుండిపోవు నను భయమున్నది. ఒక డాజీవితము ఈక్రియల నొనర్చుచుండినను, చిత్తశుద్ధి కలుగక పోవచ్చును. అతడు 'జయించితిని' అని భ్రమపడవచ్చును. ఇట్లే కథాదుల అనురాగ మనిన నయ్యది కేవలము శ్రవణముతోడనే పరిసమాప్తము కావచ్చును. ఆత్మరతి శుష్కజ్ఞానవిచారముగ తేలిపోవచ్చును. కనక నారదుడు ఏతద్దోష విరహితమగు లక్షణమును నిర్దేశించి, ఇట్లగుట సంభవమా అను శంకను లేవదీయువారికి "వ్రజగోపికల యందిట్లు జరిగిన" దని ప్రత్యుత్తరించినాడు.

ఈ భక్తి అవర్ణనీయమైనను 'క్వాపిపాత్రే' ప్రకాశితమగుటను మనము కాంచగలము. ఇది సత్త్వ రజస్తమము లను గుణముల కతీతము. ఇందెట్టి కామనయు నుండదు. ఇయ్యది విరామవిహీనమగు సూక్ష్మానుభవము. ప్రతిక్షణము వర్ధితమగుచునే యుండును. దీనిని బడసిన సాధకుడు కేవల మద్దానినే కాంచును, వినును, నుడువును, చింతించును.

ఇంతవఱ కాలోచింపబడిన భక్తి పరిపక్వావస్థ యందే సంభవించును. మనుష్యుడు ప్రప్రథమముననే ఈస్థితిని బడయజాలడు. ప్రథమమున నాతడు అత్యంత సామాన్యమగు స్థితినుండి పైకి లేవవలసియుండును; తుదకీ స్థితినే బొందవలయును. ఇదియే భక్తుని ఆదర్శము. ఆదర్శము సంపూర్ణముగ మనస్సున చిత్రితమై

యుండకపోయిన పథ మెట్టిదో తెలియక చిక్కుపడ కలసియుండును. సిద్ధి కంతరాయము లనేకముగ వాటిల్లును. కనుక, లక్ష్యము నత్యంతవిశదముగ నారదుడు వర్ణించినాడు. ఈ పరిపక్వస్థితిని వర్ణించుచు, ఆయన నిమ్నతర సోపానములను విస్మరింపలేదు. ఆయన అనిర్వచనీయమగు గుణాతీత ముఖ్యభక్తినుండి ఒకింత క్రిందకు దిగి గుణభేదము, ఆర్తభేదముల ననుసరించు గౌణభక్తియొక్క త్రైవిధ్యమును నిరూపించినాడు. గుణముల ననుసరించి సత్వ,రజ, స్తమోరూపములుగను, అధికారిభేదము ననుసరించి ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థి రూపములుగను నియ్యది ప్రకాశితమగును. వీనిలో పూర్వపూర్వములు శ్రేయతములు.

అర్థార్థి ఈశ్వరుని భోగసుఖములకొఱకు ప్రార్థించును. జిజ్ఞాసువు జ్ఞానముకొఱకు. ఆర్తుడు దుఃఖితుడై హృదయపూర్వకముగ, గజేంద్రునివలె ఆహ్వానించును.

“సత్వగుణియగు భక్తుడు అత్యంత మేకాంతమగుచోట ధ్యాన మొనరించును. నిద్రించుచున్నాడని అందఱును తలతురు. కాని, అతడు దోమ తెరమాటున, రాత్రియంతయు ధ్యానమునచే గడపివేయును. ఆరోగ్యము సరిగ లేనందున ఇకను పక్క విడువ లేదని నలువురు ననుకొందురు. ఈవైపున, శరీరముపట్ల ఆదరము ఆకలితీరునంతమటుకు. శాకాన్నము లభించిన చాలును. ఆహారవసనముల ఆడంబరము లేదు. ఇంటిలో వస్తువులను కూడబెట్టుటలేదు. ఇతరులను పొగడి ఆతడెప్పుడును ధనమును సంగ్రహింపడు. పత్రపుష్పములతో ఆతని పూజ ముగియును.

“రాజసికభక్తుడు తిలకమును దిద్దును, రుద్రాక్షమాలను ధరించును. ఆ మాల బంగారముతో చుట్టబడియుండును. పూజచేయునప్పుడు పట్టుబట్ట కట్టుకొనును. నానావిధమై నైవేద్యముల నర్పించును. ఎవ్వరైన నింటికి వచ్చిన ‘ఈవైపున ఇంకను చూడవలసినది ఉన్నది’ అని దేవతాగృహమును చూపును.

“తామసిక భక్తుని విశ్వాసము తీక్ష్ణము. ‘ఒకసారి ఆయననామమును ఉచ్చరించితిని - ఇంకను పాపమా ?!’ అనును. బందిపోటువేసి ధనమును దోచుకొనునట్లు ఆత డీశ్వరుని నొత్తిడిపరచును. కొట్టును, కట్టును, నరకును — ఈరీతిగ బందిపోటు జరుగునట్లు”

అని శ్రీరామకృష్ణ పరమహంసులు తమ సహజ సరళ భాషలో వర్ణించియుండిరి.

గౌణభక్తిని గుఱించి నారదు డింకేమియును చెప్పలేదు.

జీవితమున అన్నిటికంటె కఠోరమగు సత్యముగ వచ్చి నిలచునది మృత్యువు. దీనిని ఎవరును తప్పించుకొనజాలరు. కాని, మనుష్యుడు ఆదిసర్గమునుండి మృత్యుపారమును జేర అమృతత్వమును బడయ అభిలషించుచున్నాడు. అత డమృతస్వరూపుడగుట వలన, యుగయుగాంతరములనుండి, మృత్యువక్షమున నిలబడి దానిని జయింప యత్నించుచున్నాడు. రూపరసాదులతో గూడిన విశ్వమును తనలోనికి ఆకర్షించుకొనుట కతని వ్యర్థయత్నము. కాని, అతడెంతగ భోగించినను తృప్తియనునది లభింపకున్నది. అతని హృదయ మింకను, చాలగ, ఉత్కృష్టమగుదానిని బడయ నాకాంక్షించును. అతడు భూమాస్వరూపుడగుటవలన, అతనికి క్షుద్రవిషయములు తృప్తినొసగజాలకున్నవి. దుఃఖ మనంతముగ నలుపుచున్నను, అతడు సుఖాశను పరిత్యజింపజాలడు. ఆనందస్వరూపుడగుటవలన సర్వావస్థల నాతడు కోరునది ఆనందమే.

మనము పొందగోరు వస్తువును ఇష్ట మందురు. అమృత స్వరూపమును, ఆనందమయమును నగు భూమావస్తువే మన ఇష్టము- మన యథార్థసత్త. ప్రతి ప్రాణియును ఈవస్తువును బొందుమార్గముననే—తమకు తెలిసియున్నను తెలియకపోయినను— నడచుచున్నారు. మాయ, లేక అజ్ఞానమువలననే మనకు ఇష్టప్రాప్తి యగుచుండుట లేదని విశేషజ్ఞుల అభిప్రాయము. ఈ ఇష్టప్రాప్తికి వారు నిర్దేశించిన మార్గములు భక్తి, కర్మ, జ్ఞాన, యోగములు. వీనియందు ఇది తక్కువది, ఇది గొప్పది అను భేదము లేదు. దేశ కాల పాత్రముల ననుసరించి, అధికారి భేదము ననుసరించి ఒకొక్కప్పుడు ఒకొక్కటి ప్రయోజనీయ మగును. గీతోపదేశకుడగు శ్రీ కృష్ణునియొక్కయు, దక్షిణేశ్వరవాసియగు శ్రీ రామకృష్ణునియొక్కయు ధర్మవాణి

యందు సమదృష్టితో గూడిన యోగచతుష్టయ సమ్మేళనము ధ్వనించియున్నది. ఈ సమన్వయ వాణి జగత్తు యొక్క ఆధ్యాత్మిక చరిత్రయం దశ్రుతపూర్వము. మత ప్రచారకుల మాట విడచినను, మహాపురుషులనబడువారిలో చాలమంది పక్షపాతబుద్ధిని వదలజాలకపోయిరి.

నారదుడు కర్మ, జ్ఞాన, యోగములకంటె భక్తియే శ్రేష్ఠమని నుడువుచున్నాడు. కారణము — సమస్తసాధనల ఫలము భక్తి. ఇతర సాధనలలో అభిమానమునకు దావున్నది. ఈశ్వరు డభిమానమును క్షమింపడు. ఆయన కోరునది దైన్యము. భక్తి సాధకుని యందు దీనతను విస్ఫారజేయును. అందువలన భక్తియే శ్రేష్ఠము. జ్ఞానసాధనవలన భక్తి లభించునని కొందరు, జ్ఞాన భక్తులు పరస్పర సాపేక్షము లని మఱికొందరు. కర్మ, యోగ, జ్ఞానముల సాయము నపేక్షింపకయే భక్తి ఫలప్రదమని బ్రహ్మకుమారుల అభిప్రాయము. రాజప్రాసాదమును గాంచిన రాజదర్శన మగుచుండుట లేదు. ఖాద్యవస్తువుల గాంచిన క్షున్నివృత్తి కాజాలదు. అట్లే భక్తిరహితములగు ఇతర సాధనలును. అందువలన ముముక్షువులకు భక్తియే గ్రహణీయము.

అయిన, ఇతర సాహాయ్యము నపేక్షింపకయే సాధన సంభవ మగునా? 'విచార' మొనర్పకుండ భక్తి పథమును మనము గ్రహించుచున్నామా? ఇష్టచింతె 'మనస్సంయమము' లేకున్న ఒనర్పగలమా? భగవద్గుణానువర్ణన, శ్రవణములు 'కర్మ' కాదా? అను ప్రశ్నలకు జవా బీయవలసివచ్చిన, ఇవి జ్ఞాన, యోగ, కర్మాంతర్గతము లనదగును. కాని, వీటినిగూడ భక్తి యోగాంగముల గ్రహించి 'భక్తి'గ నారదుడు నిర్వచించియున్నాడని గమనింపనగును. కనుకనే, ఇతర యోగముల సాహాయ్య'మవసరము లేదనెను.

అదియునుగాక, మనుష్యులను పరీక్షించి చూచిన జ్ఞాన, యోగముల కధికారులగువారు 'నూటికి కోటికి' ఒక్క రగుపింతురో అగుపింపరో చెప్పజాలము. కర్మ మనుష్యుని సహజప్రవృత్తి. ఏదో ఒక కార్యము నాచరింపనిదే అతడుండజాలడు. ముసలి తాతను ఏమి చేయుచున్నా వని ప్రశ్నింపుడు. "ఏమియును తోచక దడి కట్టుచున్నా" ననియో, లేక "పాదుకు మడి కట్టుచున్నా" ననియో వచించును. అందువలన చాలమంది దీని కధికారులు. తరువాత, ప్రేమ యనునదిగూడ మనుష్యుని సహజప్రవృత్తి. దేనినో ఒకదానిని ప్రేమింపకుండ అతడుండజాలడు. ఈప్రవృత్తిని భగవదభిముఖీన మొనర్చుటయే భక్తి.

కనుకనే, నారదుడు ఇతర ఉపాయములకంటె భక్తియే ఇష్టలాభమునకు సహజోపాయ మనుచున్నాడు. దీనిని నిరూపింప ఇతర ప్రమాణముల అవసరములేదు. భక్తియే స్వయముగ దీనికి ప్రమాణము. భక్తిసాధనవలన సాధకుడు శాంతిని బడయును. పరమానందమును బొందును. అందువలన భక్తిపథము సహజము, భక్తియే శ్రేష్ఠము.

కాని, జగత్తునందలి సాధకుల నందఱిని ఈభక్తిపథమునకే ప్రవేశపెట్ట మనము కోరిన, వ్యర్థకాముల మగుదుము. అందఱికిని ఒకే కొలతగల చొక్కా సరిపడదు. జ్ఞానము, లేక కర్మము ఉపాయముగ గైకొను అధికారముతో జన్మించినవారికి భక్తి ఉపకారము నొనర్పజాలదు. అగుచో, నారదుని అభిప్రాయ మందఱిని భక్తియే అవలంబింప మనియా?

కాదు. నారదు డీవిషయమున ఔదార్యమునే చూపినాడు. తన గ్రంథము కేవలము భక్తిసాధకులకే యని నుడువుచున్నాడు.

భక్తులలో ఐకాంతికభక్తులే శ్రేష్ఠులు. వారు పరస్పరము ఈశ్వరుని గుఱించి సంభాషింతురు. ఆనందమున కంఠరోధ మగుచు, ఆనందబాష్పములు పడుచు, శరీరము పులకితమగును, వారివంశము పవిత్రమగును. పృథివి పావనమగును. వారివలన తీర్థములు తీర్థము లగును. కర్మ సుకర్మ యగును. శాస్త్రములు సచ్ఛాస్త్రము లగును. వారు సర్వదా తన్మయులై యుందురు. వారి పితృదేవతలు ఆనందింతురు. దేవతలు నృత్య మొనర్తురు. పృథివి సనాథ యగును. వారియందు జాతి, విద్యా, రూప, కుల, ధనభేదములు లేవు. కర్మ గతము గాని, లేక అన్యవిధమగునట్టిగాని భేదముకూడ ఉండదు. ఏలయన వారు భగవంతునికి చెందినవా రగుచున్నారు. భక్తులకును భగవంతునకును భేదములేదు.

ఇక, గౌణభక్తుల ప్రసంగ మేమియును కానరాదు.

భక్తిలాభమునకు ముఖ్యోపాయము మహాత్ముల కృప. లేక, భగవంతుని కృపాలేశము. మహాత్ముల సంగము దుర్లభము, అగమ్యము. కాని, అమోఘము. మహాత్ములకృప కేవల మున్నచాలును, భక్తి లభించియే తీరును. ఏలయన, భక్తునకు భగవంతునకు భేదము లేదు.

"భక్తుని హృదయము భగవంతుని కచ్చేరిసావిడి. బాబుగారు తమ ప్రాసాదమునందంతటను తిరుగుచున్నను, ముఖ్యముగ ఆయనదర్శనము కచ్చేరీ సావిడియందే లభించును. కనుక, భక్తునకు భగవంతునకు భేదము లేదని శ్రీరామకృష్ణపరమహంస నుడివెడువాడు. ఒకతడవ ఆయన భాగవతపురాణమును వినునప్పుడు ఒక 'అనుభూతి' కలిగెను. అది: శ్రీకృష్ణుడు ప్రత్యక్షముగ నిలుచబడియుండెను. ఆయననుండి కాంతికిరణమొకటి వెలువడి భాగవతమును స్పృశించి, పిదప పరమహంసనుగూడ స్పృశించెను. అచ్చటనుండి ఆయన ఉపర్యుక్తమగు ఉపదేశమును ఒనర్చుచుండెడువాడు.

నిరంతరము, అవిరామముగ భగవద్భజన నొనర్ప నారదుని ఆదేశము. సుఖదుఃఖములు, లాభాలాభములు మున్నగువానిని పరిలక్షింపక, నిమేషమాత్రకాలమైన వ్యర్థ మొనర్పక సర్వవిధముల నిశ్చింతచిత్తముతో ఈశ్వరభజన నొనర్పవలెను. ఇతరులకడ భగవద్గుణశ్రవణ మొనర్చినను, కీర్తన మొనర్చినను భక్తి సాధితమగును. భగవంతుని నామగుణగాన మొనర్ప, ఆయన శీఘ్రముగ ఆవిర్భవించును. భక్తుల నాతడు తన ఉనికిని అనుభవించునట్లొనర్చును. దాస్యభావమునో, లేక మధురభావమునో అవలంబించి, ఆయనయందు ఐకాంతిక భక్తిని నిల్పవలెను. భక్తియే సాధ్యము, దానినే సాధింపుము.

భక్తిశాస్త్రముల మనన మొనర్పుము. భక్తిని వృద్ధినొనర్చు కార్యముల నొనర్పుము. వాగ్వాదముల నొనర్పకుము. దాన వ్యర్థవిషయము లరుదెంచుటకవకాశ మున్నది. వాగ్వాదమునకు మితి లేదు. అహింసాదులను పాలింపుము.

అభిమానము, దంభము మున్నగువానిని పరిత్యజింపుము. ధన, శత్రు, నాస్తిక, స్త్రీప్రసంగముల వినకుము. ఇతరులు అపకార మొనర్తురనిగాని, లేక ఇతరులకపకార మొనర్పవలెనని గాని చింతింపకుము. ఏలయన, నీసర్వస్వము—లౌకిక శాస్త్రీయకర్మలు ఈశ్వరుని కర్పింపబడినవి. విషయములను పరిత్యజింపుము. దుస్సంగమును సర్వదా పరిత్యజింపుము. దీనినుండియే కామ, క్రోధ, మోహ, స్మృతిభ్రంశ, బుద్ధినాశ, సర్వనాశములు సంభవించును. దుస్సంగమున, అలలుగ నున్న దుర్గుణములు సముద్రముగ మారగలవు.

భక్తుని కర్మలన్నియు భగవంతునికే నివేదింపబడినవి. కనుక కామ, క్రోధ, అభిమానముల బూనవలసిన, ఆయనపట్లనే వహింపుము. అనగా, ఈవృత్తుల నన్నిటిని ఆయనపైపునకే మళ్లింపుము. ఆయనదర్శనమును గోరుము. దర్శనప్రతిరోధకములపై క్రోధమును బూనుము. సాక్షాత్కరింప నేమని అభిమానమును దాల్చుము.

సాధనాసమయమున భగవంతునితో నొకసంబంధమును స్థాపించుకొనినయెడల భక్తి దృఢమగును. సాధనకూడ సహజమును, మధురమును అగును. భగవంతునిపట్ల భావస్థాపనమునే నారదుడు ఆసక్తి యనుచున్నాడు. ఈ ఆసక్తి ఒక్కటియే యైనను, గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయాసక్తి, పరమవిరహాసక్తి అను పదకొండు రూపములను ధరించుచున్నది.

నారదుడు చెప్పిన భక్తిలాభోపాయములు ఆరు. అవి: మహాత్ముల, లేక భగవంతుని కృప, ఐకాంతిక భజన, భక్తిశాస్త్రానుశీలన, కుసంగపరిత్యాగ శీలనిర్మాణములు, భగవంతునిపట్ల ప్రవృత్తి వ్యావృత్తీకరణము, భావాశ్రయణము అనునవి.

అనురాగమునకు ఉదాహరణ వ్రజగోపికలు. వారి యనురాగమున మాహాత్మ్యజ్ఞానము లేదనుట అపవాదము! అది లేకున్న జారత్వమే యగును. ప్రేమాస్పదుని సుఖమే తన సుఖమను భావము జారప్రేమయందు లేదు.

సాధనపథమున ప్రధానాంతరాయము మాయ, లేక అజ్ఞానము. ఈమాయ నెవరు తరింపగలరు? సంగ

త్యాగి, సాధుసేవి, నిర్మముడు అనువాడును, నిర్జన వాసియు, లోక బంధరహితుడును, త్రిగుణాతీతుడును, యోగక్షేమరహితుడును, కర్మత్యాగియును, కర్మఫలత్యాగియును, ద్వంద్వహీనుడును, విధినిషేధముల కతీతుడును, నిరవచ్ఛిన్న అనురాగియును నను వాడొక్కడే మాయను తరింపగలడు. తరించుటయే కాదు, ఇతరులనుగూడ తరింపజేయగలడు.

విధి నిషేధములను, అనగా వానిని విధించు శాస్త్రములను త్యజింప నుపదేశించుటవలన నారదుడు శాస్త్రవిరోధి యనుకొనరాదు. భక్తి దృఢమగునంతవఱకు ఆతడు వానిని మన్నింపుమనియే నుడివియున్నాడు. లేకున్న పతితుడ వగుదువు. సర్వస్వము భగవంతునకు నివేదింపజాలనంతవఱకును లౌకికకర్మలను విడువ గూడదు. ఈశ్వరునియందు దృఢబుద్ధి కలిగినచో లౌకికకర్మ లుండవు. శరీరపాత మగునంతవఱకు భోజనాదికర్మలు మిగిలియుండును.

విరుద్ధవాదుల నుపేక్షించి, కుమార, వ్యాస, శుక, శాండిల్య, గర్గ, విష్ణు, శాండిల్య, శేష, ఉద్ధవ, ఆరుణి, బలి, హనుమంత, విభీషణాది భక్తియోగాచార్యులతో నేకీభవించి నారదుడు సమకూర్చిన శివోపదేశమును విశ్వసించినచో శ్రద్ధాళులగువారు ఇష్టవస్తువును పొందెదరు. సందేహము లేదు.

వర్తమానకాలమున జగత్తునందు ఉన్న మతముల నన్నిటిని, ముఖ్యముగ వాని ఆనుష్ఠానిక భాగమును పరిశీలించి చూచినచో నారదు డుపదేశించిన అమృతోపమ మగు ఈభక్తియే విభిన్నరూపముల అభివ్యక్త మగుచు, ఆయా సాధకులకు విమలమగు ప్రశాంతిని ప్రసాదించు చుండుటను కనగలము.

న ధర్మనిష్ఠోఽస్మి నచాత్మవేదీ, న భక్తిమాం స్త్వచ్చరణారవిందే,
అకించనో ఽనన్యగతి శ్శరణ్యాం, త్వత్పాదమూలం శరణం ప్రపద్యే.

[శ్రీ యామునాచార్యులు]



# పురాతనవస్తుపరిశోధనశాఖ, ఆంధ్రదేశము

శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు

౧౯౩౮-వ సంవత్సరము మార్చి నెలలో లండను ఇండియా ఆఫీసువారు హిందూదేశములో పురాతనవస్తుపరిశోధనశాఖ (ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా) ఏ రీతిగా పని చేయుచున్నదియు, ఏమేమి సంస్కారణము లావశ్యకములైనదియు మొదలయిన విషయములనుగురించి సలహా నొసగవలసిన దని డాక్టరు సర్ లియొనార్డ్ ఊల్లీ గారికి ఒక జాబు వ్రాసిరి. ఆత డాపని నంగీకరించెను. ఆతనికి వ్రాసిన ఉత్తరమునందు, ఇండియా గవర్నమెంటువారికి ఈ క్రింది విషయములపై సలహా నీయవలసియున్నదని తెలుపబడెను:

౧. మిక్కిలి ఉపయుక్తములును, లాభకరములును నగు పురాతనస్థలములు, 'పాడు' లు ఎక్కడెక్కడ నున్నవి? ముందు ఎట్టివాటిని త్రవ్వించి పరిశీలింపవలయును?

౨. ఏ విధముగా యీ 'పాడు' లను సులభముగా, మిక్కిలి కొద్దిపాటి ఖర్చుతో విశేషమయిన లాభమును, చరిత్రజ్ఞానమును సంపాదించుటకు వెదకించి త్రవ్వించవలయును? ఈ వెదకుటలు, త్రవ్వటలు మొదలయిన పనులను ఎంతవఱకు ప్రభుత్వమువారు పూనుకొని చేయవలయును? ఎంతవఱకు ఈ పనులను ఇతర సంస్థలకు, అనగా యూనివర్సిటీలకు, పరిశోధనము చేయుచున్న ఇతరసంస్థలకు వప్పగింపవచ్చును?

౩. అసలయిన ఇతిహాసమును బహిరంగపరపగల 'పాడు'లను వెదకి త్రవ్వించుటకు శాస్త్రజ్ఞులయిన ఉద్యోగులు కావలయును గనుక, అట్టివారికి ఉత్తమశిక్షణ ఎక్కడ, ఎవరిచేత ఇప్పింపవలయును? ప్రత్యేకనైపుణ్యమును, శాస్త్రజ్ఞానమును సహజముగ సంపాదించినవారి నీ పరిశోధన చేయుటకు నియోగింపవచ్చునా?

౪. పై మూడింటిలో చేరని యితర విషయములనుగురించి సందర్భములను బట్టి తెలుపదగిన అంశములు.

డాక్టరు ఊల్లీగారి కంతట నొక సంశయము కలిగెను. తమకు తోచిన అభిప్రాయములను నిశ్శంకగా తెలుపవచ్చునా, ఒకవేళ తాము తెలిపిన విషయములనుబట్టి చూచినపుడు ఇండియాప్రభుత్వమువారు ప్రస్తుతము వెచ్చించుచున్న ధనముకంటె నెక్కువ ధనమును ఈ పరిశోధనశాఖపై ఖర్చుచేయుదురా యని ప్రశ్న కలిగెను. ఆ ప్రశ్నకు ఆయనకు గల్గిన సందేహమే కారణము. "ధనము వెచ్చించి బహుపురాతన

మైన 'పాడు' లను వెదకించి త్రవ్వించినపుడు, అందు లభించు ప్రాచీనవస్తు సంచయమును భద్రపఱచుటకు మ్యూజియములను (ప్రాచీనవస్తుప్రదర్శనశాలలు) కట్టించవలయును. అట్టి మ్యూజియములను సద్వినియోగపఱచి, పరిశోధన అభివృద్ధి పఱచుటకును, అందు ప్రదర్శించిన పురాణవస్తుసంచయమును గురించి విపులముగా, సాధ్యమయినంత సులభముగా పాఠకులకునయితము బోధపడునట్లు గ్రంథములను వ్రాయగల పండితులను, శాస్త్రజ్ఞులను క్యూరేటరులు(ప్రదర్శకులు)గా నియమింపవలయును. మ్యూజియము, ఇతిహాసపరిశోధన ఇత్యాదివిషయములను గురించి ఎంత పనిచేసినను అంతముండదు కావున దానికొరకు ధనవ్యయము హెచ్చగును. ఇండియాగవర్నమెంటువారు నానాటికిని ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా శాఖకు ఏటేట నిచ్చు గ్రాంటు సొమ్మును క్రమక్రమముగా తగ్గించుచువచ్చుచున్నారు గనుక, ఇపుడు క్రొత్త సిఫారసులను ఏమయినను చేసినయెడల అవి నిరర్థకములయిపోవును." ఇట్టి సంశయములనేకములు డాక్టరు ఊల్లీగారికి కలిగెను. తాను ఇండియాకు వచ్చిపోవుట నిష్ప్రయోజనమగు నని తోచెను. దాని మీదట ఇండియా ఆఫీసువారికిని, ఊల్లీగారికిని కొంతకాలము ఉత్తరప్రత్యుత్తరములు జరిగెను. చివరకు ఇండియాఆఫీసువారు ఊల్లీగారిని ఒకవిధముగా సమాధానపరచి, సాధ్యమయినంతవఱకు అన్ని విషయములను గురించి విపులమయిన నివేదికను తయారు చేయవలసిన దనియు, ధనాభావముచొప్పున వారి సిఫారసులను త్రోసివుచ్చ మనియు 'వాగ్దాన' మిచ్చిరి.

ముందుగా, ఈ సర్ లియొనార్డు ఊల్లీ ఎవరో, ఈ పనికి వారిని ఎందుకు నియోగించవలసి వచ్చినదో అన్న సందేహము గలుగవచ్చును. హిందూదేశములో నున్న మ్యూజియములు ఏ విధముగా పనిచేయుచున్నవి, ఏయే సంస్కారణములు వాటి అభివృద్ధికి ఆవశ్యకములు అను విషయములనుగురించి ఇండియాగవర్నమెంటువారు ఒక నివేదికను తయారు చేయించినారు. మార్కహామ్, హార్‌గ్రీవ్సు అను ఇరువురు మ్యూజియం అధికార్లను (సూపరింటెండెంట్లను) ఆ పనికి నియమించినారు. హిందూదేశములో ఉన్న మ్యూజియములు అన్నియును మిక్కిలి దౌర్భాగ్యస్థితియందున్నవి, అవి ఎందుకొరకు సృజింపబడినవో ఆ కర్తవ్యమును అవి నెరవేర్చుటలేదు అన్న సారాంశము తేల్చి వారిరువురు నొక నివేదికను తయారుచేసిరి. ఆ నివేదికను చూచునప్పటికి ఇండియాగవర్నమెంటువారికి ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాశాఖవారి పని సంతృప్తికరములయిన మార్గములందు పనిచేయుట లేదా యని సంశయము కలిగెను. ఆర్కియోలాజికలువిషయములపై తమకు ఆలోచన చెప్పగలవా రెవ్వరయినా ఉన్నారా గ్రేటుబ్రిటనులో నని ఇండియాప్రభుత్వమువారు లండనులోనున్న ఇండియా ఆఫీసువారికి వ్రాసిరి. అపుడు జగత్ప్రసిద్ధుడైన సర్ లియొనార్డ్ ఊల్లీకి ఇండియా ఆఫీసువారు కబురంపిరి.

సర్ లియొనార్డ్ ఊల్లీగారికి, సర్ జాన్ మార్షలుగారి కున్న యశస్సునుబట్టి, హిందూదేశములో పురాతనవస్తుపరిశోధనశాఖ కడు చక్కగా పనిచేయుచున్న దని

మొదట నమ్మక ముండెను. హిందూదేశమునకు రాకపూర్వము ఊల్లీగారికి ఇక్కడ జరుగు చున్న పనినిగురించి కొంత తెలుపుట మంచిదని ఇండియా గవర్నమెంటువారు ౧౯౨౩ మొదలుకొని ౧౯౩౭ వఱకు ప్రకటితములయిన ఆర్కియాలాజికలు సర్వే ఆఫ్ ఇండియా శాఖవారి వార్షికనివేదికలను కట్టకట్టి పంపించిరి. సర్ ఊల్లీగారు వాటిని సమగ్రముగా చదివిచూచిరి. వాటిని చూచినపిమ్మట వారికి తొలుత ఉండిన మంచి అభిప్రాయము కృష్ణపక్షచంద్రునివలె క్షీణించిపోయెను. హిందూదేశమునకు వచ్చినతరువాత దేశములో కేంద్రప్రభుత్వమువారి అధీనమం దున్నవి, స్థానికప్రభుత్వమువారి రక్షణలో నున్నవి, మొత్తము మీదఉన్న మ్యూజియముల నన్నింటిని వారు సందర్శించిరి. నిదానముగా పరీక్షించిరి. అప్పటి వఱకు త్రవ్వించినవి, త్రవ్వించుచున్నవి పురాణవస్తుసంచయమును బయటకు తీసిన 'పాడు' లను రమారమి ముప్పదిఆరింటిని పరిశీలించి చూచిరి. ఆసేతుహిమాచల పర్యంతము, ఆర్కియాలాజికలు ఉద్యోగులు ఎక్కడెక్కడకు తీసుకొనివెళ్లిన అక్కడక్కడకు బోయి చూచిరి. చూచినతరువాత తమకు కలిగిన అభిప్రాయమును నిశ్శంకముగా వారు తెలిపిరి. "కేవలము ధనలోభముచేతనే కాదు ఈ శాఖయొక్క పని యింత కొఱతగా నున్నది — హెచ్చుగా ధనముండినను ఇప్పటి ఉద్యోగులవలన, ఇప్పుడు జరుగుచున్న పని కంటె విలువైనపని కానేరదు. ఈ శాఖ ఉద్యోగులకు 'ఆర్కియాలజీ' శాస్త్ర పరిజ్ఞానము, అనుభవము మొదలయిన ప్రధానగుణసంపత్తి పూర్తిగా కొఱతవడియున్నది. ఈ ఉద్యోగులు చాలమంది మంచి ఉత్సాహవంతులు, మేధావంతులును అగుదురుగాక; కాని వారి కృషి యంతయు నిష్ఫల మగుచున్నది. నిజము చెప్పవలసినచో ఈ శాఖ యందు ఆర్కియాలజీయందు సుశిక్షితులయిన పండితులు బొత్తిగా లేరు." అని తెలుపుచు నొక నివేదికను వ్రాసి ఇండియాప్రభుత్వమునకు బంపియుండిరి.

మొదటినుంచి చివరవఱకు డాక్టర్ ఊల్లీ గారు ఈ భావమునే పూలదండలోని సూత్రము లాగున నివేదికలో తెలియపరచిన ప్రతిసిఫారసుయం దును స్పష్టపఱచినారు. వారు మంచి అనుభవజ్ఞులు, మహాపండితులు, జగత్ప్రసిద్ధులు. వారి అభిప్రాయములు అమూల్యములు. అవి నిశ్చయముగా పరిశీలింప దగినవి.

ఆర్కియాలాజికలుశాఖవారు తమ పనిని మూడు భాగములుగా విభజించినారు. మొదటిది ఎక్స్ప్లొరేషను (Exploration) — పురాతనస్థలములు, కట్టడములు మొదలయినవాటిని వెదకుట, పరిశోధించుటాది విషయములు. రెండవది ప్రాచీన స్థలములను, కట్టడములను, ఇతర పురాణవస్తుసంచయమును భద్రపఱచుట. దీనిని వారు కన్సర్వేషన్ (Conservation) అని అందురు. మ్యూజియములు, రక్షణవిధానము దీనిక్రిందకే వచ్చును. మూడవది ఎపిగ్రఫీ — ప్రాచీన లేఖ్యములు (మనము 'శాసనము' లని వ్యవహరించు చున్నాము) ఎక్కడెక్కడ దొరకినను వాటి నన్నిటిని సేకరించి వాటిలో నున్న చారిత్రక విషయములను ప్రకటించుట. ఈ మూడు ఉపశాఖలక్రింద పాలింపబడు చున్న ఆర్కియాలాజికలు సర్వే ఆఫ్ ఇండియా శాఖను హిందూదేశమునం దంతటను ఆరు సర్కిళ్ల క్రింద విభజించిరి. మనకు కావలసినది చెన్నపురిరాజధాని. అది సదరన్ సర్కిలులో చేరినది. చెన్నరాజధానిలో కొంతభాగము, నిజాంరాష్ట్రములో కొంతభాగము చేరి యున్నది మన ఆంధ్రదేశము. ఈ సదరన్ సర్కిలుకు ఇతర సర్కిళ్లవలెగాక ఒకఆర్కియాలాజికలు సూప

రింటెండెంటు, ఒక ఎపిగ్రఫీ సూపరింటెండెంటు—ఇద్దరు ఉన్నారు. హిందూదేశమునకు మొత్తమువిూద గవర్నమెంటు ఎపిగ్రఫిస్టు ఫర్ ఇండియా అను ప్రాచీనలేఖ్యములను పరిశీలించు పండితు డొకడు గలడు. మిగిలిన సర్కిళ్లలో ప్రతి ఆర్కియోలాజికలు సర్కిలుకును ఒక్కొక్క సూపరింటెండెంటు ఉన్నాడు. వీరందరిపై అధికారి డైరెక్టరు జనరలు ఆఫ్ ఆర్కియాలజీ. ఈయన న్యూఢిల్లీలో నుండును.

ఆర్కియోలాజికలు శాఖలో పనిచేయువారికి ఉండవలసిన ప్రజ్ఞ, పాండిత్యము, సాధనసంపత్తి, 'శాస్త్ర' జ్ఞానము మున్నగువాటిని గురించి లియొనార్డ్ ఉల్లీ గారి యభిప్రాయములు పరిశీలింప దగినవి. "పురాణస్థలములను వెదకుటకును, వాటిని 'శాస్త్ర'మర్యాద పాటించి క్రమముగా త్రవ్వుటకును ఒకవిధమైన ప్రత్యేకముగా అలవరచుకొన్న 'విశేష' పాండిత్య ముండవలెను. పాండిత్యముతో పాటు చిరకాలాభ్యాసము, శుశ్రూష వలన అలవడిన అనుభవ పరిజ్ఞాన ముండవలెను. కొన్ని యేండ్లు శిక్షణ బడసిన పిమ్మట మరికొన్ని యేండ్లు అనుభవము కలిగినవారికడ పనిచేసి శాస్త్రజ్ఞానము పూర్తిగా నలవరచుకొనియుండుట ఆర్కియోలాజికలు ఉద్యోగులకు అవసరము. ఇంతే కాదు, 'పాడు' స్థలములను త్రవ్వు ఆర్కియాలజిస్టులకు చిత్రలేఖనము, ప్లానులు తయారుచేయుట, సర్వే చేయుట, ఫొటోగ్రాఫులు తీయుట మొదలయిన కొన్ని శాస్త్ర విద్యలయందు పాటవ ముండవలెను. శిథిలము లయినవాటిని మరల భద్రముగా కాపాడుటకు ఆ యధికారి మరికొన్ని శాస్త్రవిద్యల నభ్యసించినవాడుగా నుండవలెను. ఆ యుద్యోగి వాస్తుశాస్త్రజ్ఞుడు కావలయును. విచక్షణ గలవాడు, అందాలు తెలిసినవాడు, విశేషించి ఇతిహాస జ్ఞానము గలవాడు నై యుండవలెను. ఎక్స్కవేషను, ఎక్స్ప్లొరేషను పనులతో సంబంధించినది మ్యూజియం పని. ఆపని కన్సర్వేషనులో చేరినది. దానికి ఉత్సాహము గల మేధావి గావలయును. ప్రస్తుతపు పరిస్థితులను బట్టి చూచినపుడు ఆర్కియోలాజికలుశాఖవారికి మిక్కిలి ఆవశ్యకమైన శిక్షణ సలహా నొసగుటకు ఒక ఆర్కియాలజీపండితుడు, యూరోపు, పశ్చిమాసియా ఖండములందు పనిచేసి మంచి పాటవము సంపాదించిన మహా పండితు డొకడు 'అడ్వయిజరు' ఆవశ్యకము. ఈ అడ్వయిజరు కనీసము అయిదు సంవత్సరములపాటు ఆర్కియోలాజికలు సర్వే ఆఫ్ ఇండియా శాఖవారికి సలహా నొసగుచు, అవసరమైన శిక్షణ యొసగదగును.

భరతఖండ మంతయు దిరిగివచ్చినతరువాత ఉల్లీ పండితుడు ప్రస్తుతము ప్రాచీనశిథిలములు గల 'పాడు' లను త్రవ్వుట కొంతకాలమువఱకు నిలిపియుంచుట మంచిది, అవసరము నని కూడ అభిప్రాయ మిచ్చెను. అందుల కాత డిచ్చిన కారణములు మిక్కిలి సమంజసములుగా నున్నవి. "మొట్టమొదట ఆర్కియోలాజికలు సర్వే ఆసేతుహిమాచల పర్యంతము దేశమందంతటను జరుగవలెను. అనగా ఎక్కడెక్కడ శిథిలమయిన పురాణ వస్తుసంచయము కలదో, ఎక్కడెక్కడ త్రవ్విన అట్టి ప్రాచీనవస్తుసామగ్రి విరివిగా లభింపగలదో అట్టి తావుల నన్నిటిని ఏర్చి, తాలూకా, జిల్లా, రాజధానీలవారీగా పూర్తిగా వివరములతో వర్ణనలతో వ్రాయించి సిద్ధపరచవలెను." కొన్ని యేండ్లక్రిందట అట్టి చక్కని పని మదరాసు గవర్నమెంటు రాబర్టు సూయలుగారిచే చేయించిరి. సూయలుగారి కృషి రెండు సంపుటములుగా ప్రకటితమైనది. కావున ముందు జరుగవలసిన ఎక్స్కవేషను పనికి ఇది నాందీప్రస్తావనవంటిది. భూమిపన్ను లాగుటకు గవర్నమెంటువారు భూములను సర్వే చేయించిన విధముగా పురాణశిథిలవస్తుసంపదను భూగర్భమునుండి వెలికి దీయుటకు ముందు ఆర్కియోలాజికలు సర్వే అత్యావశ్యకము. ఆర్కియోలాజికలుపనులకు ఇతిహాసవృత్తము తెలుసుకొనుటకు ఉపయోగపడు స్థలములకును, త్రవ్వించవలసిన స్థలములకును 'మాపులు'-పటములు తయారుచేయించుట ముఖ్యావసరము. ఈరీతిగా ఆర్కియోలాజికలుశాఖోద్యోగులు సంపాదించిన వృత్తాంతమును సమగ్రముగా, విపులముగా సంపుటీకరణము చేసియుంచవలెను. ఈ పనియందు మిక్కిలి ప్రధానమైనది పురాతనకాలమునాడు మన పూర్వు లుపయోగించిన మృణ్మయపాత్రల సంపాదనము. ప్రాచీన మృణ్మయపాత్రసంచయమే ఒక దేశము యొక్క ప్రాచీనచరిత్రను, ఆ దేశమునందు వర్ధిల్లిన

ఆదిమనివాసుల నాగరికతను, ఇతిహాసమును, సంస్కృతిని తెలుపగల ప్రధానవస్తుసాక్ష్యమని పండితులు అన్నిదేశములవారును ఒప్పుకొనినసూత్రము. పైన వివరించిన విధముగా, ఇంతవరకును, ఆర్కియాలాజికలుశాఖవారు హిందూదేశమునందు ఆర్కియాలాజికలు సర్వేను చేయించి యొకగ్రంథమును వ్రాయించియుండలేదు. ఇది పెద్ద లోపము, శోచనీయ మని ఆతని అభిప్రాయము. ఈసందర్భమున ఆతడు ఇంకొకమాటను గూడ తెలిపెను. ఇంతవఱకుఆర్కియాలజీలో ఒక అంతర్భాగమైన 'ఇతిహాసకాలమునకు పూర్వస్థితి'నిగురించి-ఇంగ్లీషులో దీనిని ప్రాటొహిస్టరీ అనెదరు—హిందూదేశమున ఎట్టి కృషియును జరిగియుండలేదు. మామూలుగా ఆర్యులు - ద్రావిడులు - వేదకాలము - రామాయణ మహాభారతకాలములు అని చెప్పి, పిదప బుద్ధుడు, మహావీరుడు, శిశునాగవంశము, నందులు, అలెగ్జాండరుచక్రవర్తిదండయాత్ర, మౌర్యచంద్రగుప్తుడు అని మన చరిత్రపాఠ్యగ్రంథములు ఇతిహాసమునువర్ణించుచున్నవి. అనగా మహాభారతవృత్తాంతకాలము మొదలుకొని యుధిష్ఠిరుడు, పరీక్షిత్తు, జనమేజయుడువరకును, అది మొదలుకొని శిశునాగవంశము ప్రబలువరకును గల నడిమికాలముయొక్క ఇతిహాసము, అనగా ఇంచుమించు ౧౫ శతాబ్దములకాలము భరతఖండముయొక్క ఇతిహాసము మనకు ఎక్కడను లభించుట లేదు. ఋగ్వేద - ఐతరేయబ్రాహ్మణకాలములకు పూర్వపు ఇతిహాసము మనకు అసలు ఏమియు తెలియదు. మహంజోదడోమహానగరపు పాడుత్రవ్వుట ప్రారంభించినపుడు ఈ 'పూర్వస్థితి' యొక్క ఇతిహాసపఠనమందు- అనగా ప్రాటొహిస్టరీయందు - మనదేశీయులకు అభిరుచి కలిగినది. ఆకాలపు ఇతిహాసమును తెలుసుకొనవలయు నని కోరిక అప్పటినుండి నానాటికిని ఎక్కువయగుచున్నది. ఆకోరిక భారతీయులయందు కంటె పాశ్చాత్యఖండవాసులందు మిక్కిలిగా మొదటినుండియు పెరుగుచున్నది. మహంజోదడో'పాడులో' దొరికిన పురాణవస్తుసముదాయము, అక్కడ దొరికిన 'చిత్రలిపి'యు పాశ్చాత్యపండితుల నాకర్షించినరీతి చూడ నాసందర్భమున మన చరిత్రకారులు, ఇతిహాసజ్ఞులు చేయవలసిన కృషి యెంత కలదో ఇపుడు కొంచెముగ మనకు తెలియుచున్నది. ఇటీవల పూనహాలోను, బొంబాయి విశ్వవిద్యాలయమువందును ఇట్టి పరిశోధన ప్రారంభమయ్యెను. ఊల్లీపండితుడు హిందూదేశమునకు రానున్నాడని వార్త ప్రకటింపబడిన తక్షణమే ప్రాటొహిస్టరీ యందు అభిరుచిగలవారు, పండితులు అనేకులు యూరపు, అమెరికా దేశముల నుండి ఆయనకు ఉత్తరములమీద ఉత్తరములు వ్రాసి ఆ సందర్భమున నేదైన కొంతపని చేయ మని బ్రతిమాలుకొనిరి. "భరతవర్షముయొక్క మిక్కిలి ప్రాచీనకాలపు ఇతిహాసము — శిలాయుగము — అనగా జనులు లోహముల నెఱుగని కాలమునాటి కథ మన ఐతిహాసికులకు బొత్తిగా తెలియుటలేదు. ఈప్రపంచములో నన్నిప్రాంతములకంటెనుకూడ భరతఖండము నందు నాగరికులయిన జనులు ఆదికాలమునకూడ నివసించుచుండిరని తెలియుచున్నది. ఏతత్సంబంధమయిన సాక్ష్యము ఇంతవఱకును లభింపకుండుట శోచనీయము. కావున, మీరు ఇండియాప్రభుత్వమువారితో సిఫారసు చేసి ప్రోటోహిస్టరీ—శిలాయుగము నాటి—ఇతిహాసమును గురించి కొంత కృషిసల్పుడు." అనుచు ఎందరో ఊల్లీ మహాశయునికి వ్రాసియుండిరి. ఈమాటలను మనసులో నుంచుకొని సర్ లియొనార్డ్ ఊల్లీ ప్రోటోచరిత్రపండితులను ఇరువురను తక్షణము ఒకరిని ఉత్తరహిందూస్థానమునకును, మరియొకరిని దక్షిణహిందూస్థానమునకును నియమింపవలసియున్న దని ఇండియాప్రభుత్వమునకు సిఫారసుచేసెను. దక్షిణహిందూస్థానమునకు నియమింపబడిన పండితుడు చెన్నపట్టణమును కేంద్రముగ నుంచుకొని మిగిలిన ఆర్కియాలాజికలుశాఖోద్యోగస్థులతో కలసి దక్షిణాపథమునుగురించి పనిచేయవలసిన పనియు, అట్లే రెండవప్రాటోహిస్టరీపండితుడు ఢిల్లీని ప్రధానకార్యస్థానముగా నుంచుకొని ఉత్తరాపథమునుగురించి కృషిచేయుచుండవలయునని యు ఊల్లీపండితుడు సూచనచేసెను.

ఎక్స్కవేషను విషయమై ఆతని సూచనలు విచారణ చేయదగినవి గలవు. హిందూదేశములో త్రవ్వించవలసిన పురాతనస్థలములు 'పాడు'లు అనేకములున్నవి. వాటినన్నింటిని త్రవ్వించవలెనన్న ఇండియాప్రభుత్వము వారికి ఒక్కరికి సాధ్యము కాదు. అందుకు కారణములు

రెండు. ఒకటి: ధనము విశేషముగా కావలయును; రెండవది: పని అంతములేనిది. ఒక్కొక్క 'పాడు' తీసుకొని త్రవ్వుట ప్రారంభించినయెడల పని పూర్తియగునప్పటికి ఎంతకాలము పట్టునో ఎవరు చెప్పగలరు? అట్టిపాడులు ఎన్నెన్ని కలవో? ఒకవేళ 'పాడు'లను ఒకదానివెనుక నొకదానిని త్రవ్వించి, అందుండి బహిర్గతమగుచుండు పురాణవస్తుసామగ్రిని వెలికితీయుటకు పూనుకొన్నచో, వాటిని భద్రపఱచుటకు, వాటికి వివరములు వ్రాసి, కాగితపుముక్క లంటించి, పండితులకు పామరులకుసయితము ఉపయోగపడునట్లు చేయుటకు దేశమంతటను ఎన్నో మ్యూజియములు (ప్రదర్శనశాలలు) కావలెను. కావున ఈపనియంతయు ఒక నియమితకాలములో నెరవేరదు. ఎంత ధనమును చాలదు. కావున ఈపనినంతయు నెరవేర్చుటకు ఇండియాప్రభుత్వమునకు సాధ్యము కాదు. ప్రభుత్వముపై ఆధారపడియుండుట ప్రజలకును భావ్యముకాదు. పాశ్చాత్యదేశములలో నున్న విద్యాసంస్థలు, ఇతిహాసపరిశోధకసంస్థలు, హిందూదేశీయసంస్థలు, విశ్వవిద్యాలయములు, ఇతిహాసపరిశోధనయందు అభిరుచిగలసంస్థలు, ధనవంతులు సమానముగ నీపనికి కొంతవఱకు పూనుకొనవలయును. పాశ్చాత్యదేశీయులు, విద్యాసంస్థలు, పురాతనవస్తుసంపాదనకై 'పాడు'లను త్రవ్వినపుడు అందు లభించు వస్తుసముదాయమును రెండు భాగములుగ చేసి, ఖర్చుపెట్టి పనిచేసినందులకు ఒక భాగము వారును, అనుజ్ఞ ఇచ్చినందుకును, కాణాచికలిగి యున్నందుకును మిగిలిన సగము ఇండియాప్రభుత్వము వారును పంచుకొనుట యుక్తము. ఇతిహాసరచనకును, పరిశోధనకును అవసరమగు పురాణవస్తుసంచయము మిక్కిలి అమూల్యమైనది. అట్టి వస్తుసామగ్రిని పోగొట్టుకొనుటకుగాని, దానిని ఈదేశమునుండి విదేశములకు గొనిపోవుటకుగాని భారతీయు డెవ్వడును, దేశహితమును గోరు దేశభక్తు డెవ్వడును సమ్మతింపజాలడు. మనదేశమందు ఆమాత్రము సాహసము, ఉత్సాహము, ఔదార్యము కల ధనికులు లేకపోలేదు. కాని మనదేశీయులకుగూడ ఉత్సాహము జనించి, ధనము వెచ్చించువారు జనించువఱకు పని నిలిపియుంచలేము. అట్లని ఇతరదేశీయులు తమంతట తాము ధనము వెచ్చించి పాటుపడి త్రవ్వింతుమని సాహసించి ముందుకు వచ్చినపుడు, వారి సహాయము నిరాకరించుట పాడిగా దనలేము. త్రవ్వించి వస్తువులను వెలికితీసినవాడు వాటి నన్నింటిని చేరి సమానముగ విభజించి, మేలురకమును — అనగా ఒకేరకపు వస్తువులు రెండింటికి మించి దొరకినపుడును, దొరకనప్పుడునుగూడ — ఇండియా ప్రభుత్వమువారును, రెండవరకమును ఆ విదేశీయసంస్థలును తీసుకొనుటకును, మంచివాటిని భరతఖండమునందే ప్రసిద్ధములయిన స్థలములందు ప్రదర్శించుటకును ఏర్పాటుచేసుకొనుట మంచిది. ఒక్కొక్కప్పుడు కొన్ని అమూల్యవస్తువులనుగూడ పైవారికి ఇవ్వవలసివచ్చును. అట్లు జరిగినపుడు దానికై హిందూదేశీయులు వాపోవరాదని వూల్లీగారి మతము. అట్టివి మనము కొన్నింటిని పాశ్చాత్యులకివ్వకున్నచో, పాడుపడియున్న దిబ్బలను త్రవ్వుటకు వారికి తగిన ప్రోత్సాహకారణ ముండదు. ఇప్పటివఱకు మన దేశమునుండి బహు సుందరములైన వస్తువులు—భూగర్భమునుండి వెలికి తీసినవాటిని పాశ్చాత్యదేశీయులు గొనిపోవుటచేతనే, ఆయా దేశములవారు భరతఖండపు ప్రాచీనతకును, నాగరికతకును, సంస్కృతికిని, కళాకౌశలములకును ఆశ్చర్యపడి, ఒక్కసారి యీదేశమును చూచిపోవలె నను కౌతుకముతో వచ్చిపోవుచున్నారు; భారతీయ ఇతిహాసమును శ్రద్ధతో పఠించుచు, మన దేశ సంస్థలకును, విశ్వవిద్యాలయములకును ప్రోత్సాహములను కలిగించుచున్నారు. చివరకు, ఇట్టి కౌతుకము గల పాశ్చాత్యదేశీయులవలననే మనదేశపు ప్రాచీన గౌరవ స్థితిని కొంతవరకైన భారతీయులు తెలుసుకొనగలుగుచున్నారు. అని వూల్లీగారి వాదము.

ఈసందర్భమున మనదేశీయులు హెచ్చరికతో గమనింపవలసిన ముఖ్యవిషయ మొకటి కలదు. సాధారణముగా, కొన్ని పల్లెటూళ్లయందు పాటిపెరళ్లు త్రవ్వుచున్నప్పుడు రాగికాసుల కుండలు, బంగారునాణెములు, ఇతరలోహముల నాణెములు, లోహపాత్రలు, శిలావిగ్రహములు, ప్రతిమలు, రంగులువేసిన మట్టికుండలు, మట్టిబొమ్మలు, కూజాలు మున్నగునవి ఎన్నో చిత్రవిచిత్రములయినవస్తువులు, ఆభరణములు, ప్రాచీన ఇతిహాసమును తెలుపువస్తువులు తఱచుగా లభించుచుండును. వాటిని

కొన్నింటిని మనవారు అజ్ఞానముచే నాశనముచేయుచున్నారు. కాని అట్లు నాశనము చేయగా మిగిలిన వాటిని భద్రపఱచి పరిశోధన గావించుచున్న దేశీయ సంస్థలకు గాని, ఆర్కియొలాజికలు శాఖవారికిగాని జూపుటయో, ఇచ్చివేయుటయో మంచిది. లేదా విక్రయించదలచుకొన్నచో బహిరంగముగా విక్రయించుట మంచిది. కాని దురాశవలనయి తెలివిలేక మనవారు వాటిని విదేశస్థులకు విక్రయించుచున్నారు. స్వలాభపరులై తమలాభము కొద్దో గొప్పో చూచుకొనుచున్నారుగాని, వారు, దేశమునకు తీరని నష్టము కలుగుచున్న సంగతి గుర్తించుటలేదు. ఒకప్పుడు వెల్లడిగా అట్టివస్తువులను విక్రయించినపుడు తాముకొన్న ధరకంటె ఎక్కువ రాగలదు. ఆవస్తువుల విలువ యెట్టిదో కొనువారికి తెలియునుగాని విక్రయించువారికి తెలియదు. కొంతకాలమునుండి మన ప్రాంతములవారు రహస్యముగ మిక్కిలి ప్రాచీనములయిన నాణెములను, అందు ముఖ్యముగ బంగారు నాణెములను చెన్నపురికి గొనివచ్చి అమ్ముచున్నారు. అట్టినాణెములు మన దేశమును విడిచిపోవుట సంభవించుచున్నది. అవి మనదేశపు చరిత్రకారులు చూచుటకుగూడ నవకాశము లేకున్నది. అంతకంటె దుర్భరమయి సంతాపకరమైన విషయము గలదు. జనులు మూర్ఖులై వాటిని కరగించి బంగారము చేసుకొనుచున్నారు. ప్రాచీననాణెము నాణెముగా నున్నప్పుడు ఒకప్పుడు ఎత్తునకు మూడురెట్లు ధరవచ్చు ననుసంగతి వా రెరుగరు. ఇట్టి దుస్థితిని తొలగించుటకు ప్రభుత్వమువారు పూనుకొనవలెను. ఇపుడు అమలులో నున్న ప్రభుత్వమువారి చట్టములు రహస్యవ్యాపారమునే ప్రోత్సహించుచున్నవి. కావున చట్టమును మార్చవలయును. ప్రాచీనవస్తువులు ప్రజలకు లభించినపుడు వాటి లాభమును కొన్నిసందర్భములందు ప్రజలే పూర్తిగ పొందుటకు ట్రెజరుట్రోవుచట్టమును సవరణచేయవలసియుండును. అట్టి వస్తువులను విక్రయించుటకు లైసెన్సుపొందిన క్రయవిక్రయదారు డుండవలెను. అట్టి పద్ధతి సిరియాదేశమం దున్నది. అట్టి క్రయవిక్రయములను ఏర్పాటుచేయగల మనుష్యు డొకడున్న యెడల, ఆతడు క్రయమునకు తాను తీసుకొన్న వాటికిని, ఇతరులకు విక్రయించినవాటికిని ఒక జాబితా వివరములలో వ్రాసిపెట్టవలసిన బాధ్యత కలిగినవాడుగా నుండవలెను. ఆతడు వ్రాసియుంచిన జాబితాగ్రంథము చరిత్రకారునకు, ప్రభుత్వమునకు ఎంతో యుపయోగకారిగా నుండును. ఆతడు నాగరీకతతో మెలగుచుండుటకు ప్రభుత్వమువారికడ నొక లైసెన్సు పొందినవాడు కావలయును. లైసెన్సుగల క్రయవిక్రయదారుని పట్టికయందు ప్రతివస్తువుయొక్క వర్ణనము- దొరకిన తావు ఇత్యాది విశేషములు వ్రాయబడవలెను. ఆతనివద్దకు వచ్చిన ప్రతివస్తువును ఆతడు ముందుగా ప్రభుత్వమువారికి అమ్మజూపవలెను. ప్రభుత్వమువారికి అవసరము లేదని తెలిసినపుడు అన్యులకును, అన్యదేశీయులకును ఆతడు విక్రయించవచ్చును. విదేశములకు అట్టి వస్తువులు ఎగుమతి అగుచున్నప్పుడు వాటి విలువమీద నూటికి ఇంత అని ప్రభుత్వమువారు సుంకము విధించవచ్చును. ప్రభుత్వమువారీవిషయమై దేశములో నున్న పలుకుబడిగల ప్రముఖులతో నాలోచించి, న్యాయమైన చట్టములను అమలులో పెట్టవలయును.

ఆర్కియొలాజికలు శాఖవారి కృషి ఒకవిధముగా అసంతృప్తికరమే కాక నిరుపయోగముగా నున్నదని కూడ సర్ లియొనార్డ్ ఊల్లీ మొగమోటము విడిచి చెప్పినాడు. ఈ సందర్భమున ఆర్కియొలాజికలు శాఖవారి కృషి నాలుగువిధములుగా నున్నదని విభజించినాడు. మొదటిది కన్సర్వేషన్ (భద్రపఱచుట); రెండవది ఎక్స్కవేషన్ (పాడులు త్రవ్వుట); మూడవది మ్యూజియములు (ప్రదర్శనశాలలు); నాల్గవది ఈ మూడింటియందును చేరని యితర విషయములు. ఆయాశాఖల పనిని విమర్శించుచు ఆతడు చూపిన ఆక్షేపణలను విమర్శింతము.

కన్సర్వేషను విషయము–ప్రభుత్వమువా రిచ్చు గ్రాంటుమొత్తములో నూటికి ఎనభయిరూపాయలు కన్సర్వేషనుశాఖక్రింద ఖర్చు అగుచున్నవి. కన్సర్వేషన్ క్రింద ప్రాచీనకాలమునాటి శిథిలములయిన దేవాలయములు, నగళ్లు, మసీదులు, కోటలు మొదలయినవాటిని జాగ్రత్తపెట్టుట, తరచుగా మరమ్మత్తులో నుంచుట, వాటి రక్షణకు కావలివాండ్లను,

ఉద్యోగులను ఉంచుట ఇత్యాదులు. కొన్ని శిథిలమందిరములపట్ల ఆర్కియాలాజికలుశాఖవారి కృషి ప్రశంసార్హమే గాని, కొన్నిటిపట్ల శోచనీయముగ నున్నదని ఆతడభిప్రాయ మిచ్చినాడు. శిథిలకట్టడములు రెండు తెరగులుగా నుండును. అందు ఒకతెరగతి చిత్రకళలకు, శిల్పమునకు సంబంధించినవి. రెండవ తెరగతి ప్రత్యేకముగా ఆర్కియాలజీశాస్త్రమునకు సంబంధించినవి. ఈసూత్రమును గ్రహించి శిథిలములను 'రక్షణ' లో నుంచకపోవుట ఆర్కియాలాజికల్ శాఖవారి ప్రధానలోపము. అందములయిన కట్టడములను తెఱచుగా అందరును చూచుటకు వచ్చుచుందురు. ఇతిహాసపరిశోధకులకు ఇట్టి కట్టడములు అంత ఆకర్షణీయములు గావు. వాస్తుశాస్త్రజ్ఞులకు, శిల్పాదిచిత్రకళావేత్తలకు, ప్రాచీనలిపిపరిశోధకులకు, ఐతిహాసికులకు ఎక్కువ ప్రమాణములయినవి శాసనస్తంభములు, శాసనము లున్న తావులు, కొండగుహలు, శాసనపు రాగిరేకులు, నాణెములు, శిలాశిల్పములు మొదలయిన వివిధ శిథిల వస్తుసంచయము. వాటికి తగినంత రక్షణ లేదు. ఈ దేశము యొక్క రాజకీయ, సాంఘిక, ఆర్థిక, ధార్మిక, సారస్వతేత్యాది విషయముల ఇతిహాసమున కుపయుక్తము లయిన శిథిలవస్తుసముదాయమును తెరచుగా, వినోదము కొరకు వచ్చువారు చూచిపోవరు. వారి కిట్టివాటితో పనిలేదు. కావున పైన వివరించిన పురాణవస్తుసంచయమునందు భావికాలమువారికి గూడ ముఖ్యముగ కావలసినవి ఎన్నో కలవు. ఈ విషయముల నన్నింటిని మనసునం దుంచుకొని ఆర్కియాలాజికలు శాఖవారు 'కన్సర్వేషను' కొరకు ధనము ఔచిత్యమును చూచి వెచ్చింపవలయును.

కన్సర్వేషను విషయమున ఆతడు కొన్ని మాటలను చెప్పినాడు. త్రవ్వి వెలికిదీసిన శిథిలములను 'రక్షణ' లో నుంచువిషయమై ఇదమిత్థమని ఎవడును సూత్రములను రచింపజాలడు. ప్రతి శిథిలము గూడ, దాని గుణసంపదను బట్టి, దానికి అవసరమైన 'రక్షణ'లో నుంచబడవలయును. 'శిథిలరక్షణ'కు, అనగా కన్సర్వేషను విధానమునందు ఆలోచింపదగిన విషయములు కొన్ని గలవు. ఈ శిథిలములను 'రక్షణ'లో నుంచుట సాధ్యమా, అవసరమా అను ప్రశ్నలు ముందు సమాధానమును బడయవలయును. ఒకవేళ 'రక్షణ'లో నుంచవలసినచో ఇది 'శాస్త్ర'జ్ఞునికి అవసరమా, లేక జనసామాన్యమునకు వినోదముకొరకు అవలోకించుటకు మాత్రము అవసరమా అను ప్రశ్నలు సమాధానము బడయవలయును. ఈ రెండు ప్రశ్నలకును వచ్చు సమాధానములను ఎంతవఱకు సమన్వయము చేయగలము? ఒకప్పుడు సమన్వయము కలుగనప్పుడును, సమన్వయము చేయజాలనప్పుడును వాటిలో అది శాస్త్రజ్ఞునికి అవసరమా, లేక ప్రజాళికి అవసరమా అను విషయము ముందు విమర్శించి నిర్ణయించవలసియున్నది. ఒక శిథిల వస్తువును 'రక్షణ'చేయుటకును, ముందుముందు దానిని మంచిస్థితియం దుంచి, మరమ్మత్తులు చేయుచుండుటకును దానికై కొంత ధనము వెచ్చించుటయును నిర్ణయింపవలసినపుడు ఈ విధానమువలన శాస్త్రకారునికి కలుగు లాభము, పామరజనమునకు గలుగు లాభమును బేరీజువేసి పడిన శ్రమకు వెచ్చపెట్టినసొమ్మునకు పూర్తిగా ప్రతిఫలము కలిగెనా అన్న ప్రశ్న వేసుకొనవలయును. ఈవిధములయిన సమస్యావిచారణతో ఇంతవఱకు ఆర్కియాలాజికలు శాఖవారు కృషిచేసినట్లు కనిపించదని వూల్లీపండితుడు ఖండించి చెప్పినాడు. అందుల కాయన కొన్ని యుదాహరణములను గూడ నొసగినాడు.

ఎక్స్కవేషను పని తెలివితేటల నుపయోగించి సమగ్రముగా జరిగించినపిమ్మట లభించిన ఫలితములను ప్రమాణబుద్ధితో, శాస్త్రదృష్టితో ఆర్కియాలజీశాస్త్రజ్ఞున కుపయోగపడుటకు నివేదికరూపమున ప్రకటింపబడవలయును. అట్టినివేదికను చేతబూని వెలికి తీయబడిన శిథిలవస్తుచయమును పరికించునపుడు, శాస్త్రజ్ఞునకు పురాణమయినది ఏదో, ఇపుడు 'రక్షణ'కు లోబడి భద్రపరుపబడిన దేదో విశదముగ, చూచినంతమాత్రాన తెలియవలయును. అనగా కొన్నిపట్ల శిథిలసంపద ప్రాచీనతరమైనకొలది 'రక్షణ' విధానము—కన్సర్వేషను ఎంతస్వల్పముగా నుండిన అంత శ్రేయస్కరము. ఇప్పటిపరిస్థితులందు పామరజనుడు ప్రాచీనతర శిథిలవస్తువును చూచినపుడు అతడు తరుచుగా భూగర్భమునుండి బయటపడిన వస్తువును వెలికివచ్చిన స్థితిలో చూచుట లేదు; పునర్నిర్మాణమైన స్థితిని గాంచుచున్నాడు.

అనగా పురాణమైన ఆవస్తువు తిరిగి అసలు మొదటి స్థితి పోయి ఆర్కియాలాజికలుశాఖవారిచే ఇపుడు పునర్నిర్మాణమును పొందుచున్నది. పామరుడును, పండితుడును గూడ ఈ నూతన 'రక్షణ'విధానమున పునర్నిర్మితమైన 'ప్రాచీన కట్టడము'ను చూచి మోసపోవుచున్నాడు. ఇది అశాస్త్రీయమయిన రక్షణవిధానము—అని లియోనార్డ్ ఊల్లీ గారి వాదము.

ఈవిధానమునందు ధనము నిష్కారణముగా దుర్వ్యయ మగుచున్నది. కావున 'కన్సర్వేషనువిధానము'కొన్ని మూలసూత్రముల ననుసరించి జరుగవలయును. ఆ మూలసూత్రములను మన ఆర్కియాలజీశాఖవారు ఎరుగరు. త్రవ్విన ప్రతిపాదును, వెలికి దీసిన ప్రతి కట్టడమును 'కన్సర్వేషను'లో నుంచుటకుముందు కొన్ని సందర్భములను ఆలోచించుట ఆవశ్యకము. ఆర్కియాలాజికలు శాఖవారు చాలవఱకు త్రవ్వించి వెలికి తీసిన వాటి నన్నింటిని కన్సర్వేషనులో ఎందులకు ఉంచుచున్నారని ఊల్లీపండితుడు ప్రశ్నింపగా వారికి వచ్చిన జవాబు చాల చిత్రమయినది. వారొసగిన జవాబుసారాంశ మిట్టిది. వారి కన్సర్వేషను ఆర్కియాలజిస్టు ఉపయోగముకొరకును గాదట, ప్రాచీన వస్తుసామగ్రిని వినోదార్థము చూడదలచినచ్చు పామర జనుని యుపయోగార్థమును గాదట! భావికాలమున జనించువారల యుపయోగార్థమట! కొన్నిశతాబ్దముల కాలము భూగర్భమున భద్రముగా నున్నదానిని బయటకుదీసి ఎండవానలకు ఆరబెట్టినచో, ప్రాతకాలపువాటి ఆ మట్టిగోడలు, ఇటుకగోడలు ఎన్నియేండ్లు నిలిచి మనగలవు? మహానిలిచిన ఒక యేబదియేండ్లు నిలిచియుండగలవు. అటు పిమ్మట మట్టిలో గలసి జీర్ణము కావలసినదే. ఏటేట అట్టివాటికి మరమ్మత్తులు చేయుచున్నను, వాటిని త్వరలో శిథిలింప జేయుటయే చివరకు కలుగు ఫలము. ఒకసారి భూగర్భమునుండి వెలికి దీసినవాటినిగురించి సమగ్రముగా పండితులచేత నొక విపులమైన నివేదిక వ్రాయించి, మచ్చునకు ఒకటి రెండు దిబ్బలను మాత్రము త్రవ్వినది త్రవ్వినట్లుగా నుంచి, మిగిలినవాటిని మరల పూడ్చియుంచుట మంచిది. అవి భూగర్భమున చెక్కు చెదరక యుండును. భావికాలమున త్రవ్వించువారికి, చూడదలచువారికిని అవి యుపయోగపడును—అని ఊల్లీపండితుడు సూచన చేసినాడు.

ఒక పహాడ్‌పూర్‌పాటిదిబ్బలందు తప్ప మిగిలిన తావులందు ఆర్కియాలాజికలుశాఖవారు అవలంబించిన 'రక్షణ'—కన్సర్వేషన విధానము పైన వివరించిన మూలసూత్రములను పాటింపక చేయబడినదని ఊల్లీ గారి అభిప్రాయము. రావల్పిండిసమీపమున నున్న బౌద్ధవిహారములను చాలవఱకు తిరిగి కట్టించినారు. గోడలమీద పాలగచ్చుచేసి దానిమీద పూర్వము బౌద్ధులు చిత్రములను వ్రాయించిరి. అట్టి గోడలను 'రక్షించు'టకు కొన్ని విహారములను పునర్నిర్మాణముగావించుట ఆవశ్యకమే యగునుగాని కొన్ని గోడలను అచ్చముగా పూర్వులు కట్టినట్లుండుటకై, పూర్వస్థితిని తలపింపచేయుటకు పూర్వకాలపు ఇటుకల మాదిరి యిటుకలను తయారుచేయించి వాటితో కట్టి చేసిరి. చరిత్రకారునకును, ఆర్కియాలజీ శాస్త్రజ్ఞునకును ఇట్టి కృత్రిమపు పనివలన మోసముచేసినట్లగును. కొన్నాళ్లు పోయినతరువాత ఆర్కియాలాజికలుశాఖవారికే పూర్వపుకట్టడములు ఎంతవఱకో, తరువాత వారు కట్టించిన దెంతవఱకో, మోసముచేయ ప్రయత్నించిన దెంతవఱకో తెలియకుండపోవును. దేశములో అన్నిచోట్ల నిట్టి 'రక్షణ విధానము' నవలంబించి అనవసరముగా వేలకొలదిరూపాయలను ఆర్కియాలాజికలు శాఖవారు దుర్వినియోగము చేయుచున్నారని చెప్పకతప్పదు. అందులకుఒక్క ముఖ్యఉదాహరణమును మాత్రము తెలుపవచ్చును. మహంజొదడోలో ఇప్పటికి ౫౬౦౦ సంవత్సరములనాటి ఒక సంపన్న గృహస్థుని గృహము అని చూపుచు ఒక ప్రాచీన కట్టడమును త్రవ్వి బయటకు తీసిరి. ఆ గృహము పూర్వము ఎట్లుండెనో నిరూపించుటకు తిరిగి అచ్చు ఆకాలమునాటి యిటుకలవంటి యిటుకలతో ఇంటి నంతయు, పైకప్పు మినహా గా, ఆర్కియాలాజికలు శాఖవారు కొన్ని వేల రూపాయలు ఖర్చుపెట్టి నిర్మించిరి. మొదట ఆ కట్టడమును జూచినపుడు సర్ లియొనార్డ్ ఊల్లీ అచ్చెరువందెను. ఇంత ప్రాచీన కట్టడము చెక్కు చెదరక ఇంతకాలము అత్యద్భుతమైన స్థితియం దుండెనా యని అడిగెను. చివరకు ఆర్కియాలాజికలు శాఖ

వారు చేసిన దౌర్జన్యమును గ్రహించగలైను. ఆర్కియాలజీయం దభిరుచిగలవాడు, ఐతిహాసికుడు ౧౯౩౫ సంవత్సరములో తయారు చేయబడిన ఇటుకలతో కట్టబడిన భవనమును జూచుటకు ఇంతదూరము మహంజోదడ్డో రావలసివచ్చెనా యని సంతాపము వెల్లడించెను. నిజముగా సింధునదీతీరవాసుల నాగరికతను, సంస్కృతిని తెలుపగలిగిన భాగములు అడుగుపొరలలో ఇంకను భూగర్భమునందే దాగియున్నవి. వాటిని వెలికితీయుటకును, వాటినిగురించి గ్రంథములను ప్రకటించుటకును బదులు ఆర్కియొలాజికలు శాఖవారు ధనమును వృథాగా పాడుచేయుచున్నట్లు కన్పడుచున్నది. పైపై భాగములందు కన్పట్టిన కట్టడములను భద్రపఱచుట, పునర్నిర్మాణము చేయుట మొదలయిన 'కన్సర్వేషను' పనులతో అడుగుభాగమును, అసలయిన ప్రాశస్త్యము గల అడుగుభాగమును త్రవ్వుటకు వీలు లేకుండ చేసినారు ఈ ఆర్కియొలాజికలు శాఖవారు అని ఊల్లీగారు విచారపడిరి. వారు మరియొక ఉదాహరణమునుగూడ నిచ్చిరి. నాలందావిద్యాపీఠమునందుకూడ విచక్షణలేని రక్షణవిధానము అవలంబింపబడెను. త్రవ్విన స్తూపముల నన్నింటిని, విహారముల నన్నింటిని ఎండకు ఎండి వానలకు తడియునట్లు చేసి త్వరలో సమసిపోవునట్లు చేయుటకంటె వాటిలో కొన్నింటినయినను మరల భూగర్భములో భద్రపరచిన బాగుండునని ఊల్లీపండితుడు సలహానిచ్చెను.

ప్రాచీన శిథిలవస్తు సంపదను త్రవ్వి బహిర్గతము చేయుటయందుకూడ ఆర్కియొలాజికలుశాఖోద్యోగులు తగినంత శాస్త్రపరిజ్ఞానమునుగాని, కౌశలమునుగాని, దూరదృష్టినిగాని ప్రకటించియుండలేదని డాక్టరు ఊల్లీ నిర్భయముగా వచించెను. మొదటినుండియు ఈ ఆర్కియొలాజికలు శాఖలో సరియైన తరిఫీదు పొందిన శాస్త్రజ్ఞులు లేరని ఆయనవాదము. ఇప్పుడున్న ఉద్యోగులలో చాలమంది ఆర్కియొలాజికలు శాఖయొక్క పనిని నిర్వహించుటకు అనర్హులని ఆతని విశ్వాసము. హరప్ప, మహంజోదడ్డో వంటి స్థలములలో ప్రాచీన శిథిలములను బహిర్గతము చేసినపుడు అచ్చట పనిచేసిన ఉద్యోగులకు కొందరికి అసలు అనుభవజ్ఞానములు ఏమియు లేనట్లు స్పష్టమగుచున్నదని ఆతడు వ్రాసెను. ఉత్తర హిందూస్థానముమాట అటుంచుము, ఆంధ్రదేశము మాట చూడుము. ఇటీవల పదిపండ్రెండు సంవత్సరములనుండి నాగార్జునకొండదగ్గర త్రవ్వ నారంభించినారు. మొదటినుండి ఈ నాగార్జునకొండవ్యవహారము అనుభవజ్ఞానము, ఆర్కియాలజీశాస్త్రజ్ఞానము, అన్నిటికంటె సానుభూతి లేని యుద్యోగిగుల పనియన్నట్లుగా ఇచ్చట జరిగిన పనివలన గోచరమగుచున్నది. ఈ ఎక్స్కవేషను, కన్సర్వేషనులందు ఒకపద్ధతి, ఒకతీరు, ఒక త్రోవ, ఒక ఉపాయము మనసులో నుంచుకొని మొదటినుండియు నాగార్జునకొండపాడుదిబ్బలను ఆర్కియొలాజికలుఉద్యోగస్థులు త్రవ్వించియుండలేదు. ఇక్కడ ఒక దిబ్బ త్రవ్వి ఎత్తిపోయుట ప్రారంభించి, ఆదిబ్బయందు పని ముగించకమునుపే, కొంతదూరములో ఇంకొక పాడుదిబ్బను, మరికొంత దూరమున మరియొక దిబ్బను త్రవ్వుట ప్రారంభించి, యీవిధముగా "తిరుపతిమంగలివాని క్షౌరపద్ధతిని" పని జరిపించినారు. ఇట్టి అసంపూర్తివిధానమువలన గలిగెడి ఫలము మిక్కిలి సంతాపమును కలిగించుచున్నది. కూలివాండ్రు పార తీసుకొని వీలుచాలు లేకుండ మట్టి త్రవ్వి పారబోయుచున్నట్లు పని జరుగుచున్నది గాని, ఆ త్రవ్వుటయందు ఒక త్రోవ, తెన్ను, ఉపాయము, శాస్త్రపద్ధతి ఏమియు లేదు. వెనుక ఇక్కడ దొరికిన శిథిలముల నన్నింటిని భద్రపరచుటకు ఇక్కడనే ఒక మ్యూజియముకట్టుటకు పునాదులుత్రవ్వినపుడు, ఆర్కియొలాజికలు ఉద్యోగిసమక్షమందే, కడునున్నితములు, రమ్యములు, చరిత్రోపయోగకరములు నగు చెక్కడపురాళ్లు ఎన్నో దగ్ధమైపోయినవట. ఈ విషయమును పైకి తెలియనివ్వలేదు. అనుభవజ్ఞానము లేక, చేయుచున్న పనియందు అభిమానము లేక "నాజీతము నాకు ముట్టుచున్నదిగదా, ఇదిపోయినమాత్రమున ఏమినష్టము" అని పెదవి విరిచి పనిచేయు ఉద్యోగస్థులుండుటవలన గలుగు దుష్ఫలితమిది. నాగార్జునకొండకు ఇదివరకు మొదటిలో చాల అన్యాయము జరిగినది.

ఇక మ్యూజియమువిషయములను పరికింతము. ౧౯౦౮ - వ సంవత్సరములో ఆర్కియొలాజికలు శాఖవారు సారనాథ్ (కాశీకి పదునాలుగు మైళ్ల దూరమున నున్నది) బౌద్ధులవాటి పాడుదిబ్బలను

త్రవ్వించిరి. అక్కడి బహిర్గతములైన చరవస్తు సంచయమును ప్రదర్శించుటకు ఒక పెద్ద మ్యూజియమును కట్టించిరి. అది మొదలుగా, ప్రసిద్ధము లయిన స్థలములను త్రవ్వించి పురాణ వస్తు సామగ్రిని భూగర్భము నుండి వెలికితీసిన చోటులందు, స్థానిక ప్రదర్శన మందిరములను కట్టించుట శ్రేయస్కర మని ఒక యభిప్రాయమును పురస్కరించుకొని ప్రదర్శన మందిరములను కట్టింపసాగిరి. ఇపుడు ఆర్కియాలాజికలు శాఖవారిక్రింద అట్టి ప్రదర్శనమందిరములు సారనాథ్, నాలంద, తక్షశిల, మహంజొదడో, హరప్ప, నాగార్జునకొండ అను తావులందు గలవు. ఇవి గాక పూర్వ మొకప్పుడు ఇండియా ప్రభుత్వము వారికి కేంద్రముగా నుండిన కలకత్తాయందు ఇండియను మ్యూజియములో ఆర్కియాలజీకి సంబంధించిన ఒక అంతర్భాగమున ప్రదర్శనశాల గలదు. అట్టివే న్యూఢిల్లీలో సెంట్రలు ఏషియన్ ఆంటిక్విటీసు మ్యూజియమును, లాహోరు, ఢిల్లీనగరములందున్న పురాణఖిల్లాలలోని ఆర్కియాలాజికలు మ్యూజియములును. ఇంక బొంబయిలోని ప్రిన్సు ఆఫ్ వేల్సుమ్యూజియము గలదు. ఇవి గాక స్థానిక ప్రభుత్వములక్రింద మదరాసు, పాట్నా, లక్నో మొదలయిన చోట్ల ఆర్కియాలాజికలు మ్యూజియములు కొన్ని గలవు.

స్థానిక ప్రదర్శనమందిరములను స్థాపించు పద్ధతి ఇండియా ప్రభుత్వమువారు గ్రీసుదేశమును చూచి అవలంబించిరి. గ్రీసువంటి చిన్న దేశమునకు స్థానికప్రదర్శనశాల లుండుట సమంజసముగాని, హిందూస్థానమువంటి ఒక మహాఖండమునకు ఆ పద్ధతి సరిపడదని సర్ లియొనార్డ్ ఊల్లీ గారి యభిప్రాయము. కాని ఆ అభిప్రాయము సరియైనది కాదని నామతము. ౧౯౩౮ లో న్యూఢిల్లీనగరమున జరిగిన అఖిల భారత (ఆల్ ఇండియా) మ్యూజియముల కాన్ఫరెన్సునందు స్థానిక ఆర్కియాలాజికలుప్రదర్శనశాల లుండుట ముఖ్యావసర మని యొక తీర్మానము ఏకగ్రీవముగా నామోదింపబడెను.* ఆతీర్మానము యొక్క సారాంశ మిది: మొదటినుంచి, ఆచరణలో నున్న పద్ధతిప్రకారము ఎక్కడెక్కడ ప్రసిద్ధ 'ఆర్కియాలాజికలు' స్థలములందు, మ్యూజియములు కట్టబడియున్నవో అక్కడక్కడ వాటి నన్నింటిని పూర్వపుమర్యాదను అమలులో నుంచుట అవసరమని, న్యాయమని యీసభవారు ప్రభుత్వమువారికి విన్నవించుకొనుచున్నారు. ప్రసిద్ధ పురాణవస్తుచయము విశేషముగ నెక్కడెక్కడ లభించుచుండునో, ప్రసిద్ధ పురాణ శిథిలములు, కట్టడములు, విహారస్తూపములు ఎక్కడెక్కడ విశేషముగ నుండునో అచ్చటచ్చట స్థానికప్రదర్శన శాల లుండుట మిక్కిలి అవసరము. ఎందుచేతననగా, వాటిని పరిశీలించుటకు, వాటివలన ఐతిహాసిక వృత్తాంతమును పూర్తిగ తెలిసికొనుటకును స్థానికప్రదర్శనశాలలు ఒకవిధమైన విశేషార్హతను గల్గియుండును. చరరూపకమైన వస్తుచయమునకు ఒకటి రెండు మూడు ప్రతులు దొరికినపుడు ప్రధానవస్తువును- సుందరతరము, లేక సుందరతమమైన దానిని స్థానికమందిరమం దుంచి, మిగిలినవాటిని ఇతరప్రాంతములం దున్న మందిరములలో ముఖ్యమయినవాటికి, వాటిని కావలయునన్న వాటికిని పంచి యీయవచ్చును. అప్పుడుకూడ నా ప్రతులు అచ్చట ఎక్కువగా ఉపయోగపడునని తోచినపుడును, వాటిని ఆ ప్రదర్శనమందిరాధికారులు శ్రద్ధాభక్తులతో కాపాడుదురను విశ్వాసము ఆర్కియాలాజికలు శాఖవారికి తోచినపుడును మాత్రమే ఒసగవలయును.

* *"This conference recommends that small museums should, as in the past, be maintained at the different archaeological sites where important excavations have been carried out or where important monuments exist so that the materials kept in such museums may be studied in proper surrounding and perspective, duplicate antiquites being housed in the principal museum of the province or distributed to such other museums as require them, provided those are considered by the Archaeological Survey to be sufficiently well established to use and look after them properly...."* —*Resolution.*

ప్రాచీన వస్తుప్రదర్శనశాలల కర్తవ్యములను తత్రక్షణాధికారులు గాని, ఆర్కియాలాజికలు సర్వేశాఖాధికారులు గాని పూర్తిగా తెలియక పోవుటవలన ఇంతవరకు స్థానిక ప్రదర్శనశాలలు ఎక్కువగా ఉపయోగపడకపోయియుండవచ్చును గాని, అంతమాత్రమున స్థానికప్రదర్శనశాలలు నిషిద్ధములని ఎత్తివేయ ప్రయత్నించుట, అందువిషయమై సిఫారసు చేయుట సంబుద్ధి కాదు. ఈవిషయమునందు సర్ లియొనార్డ్ ఊల్లీ మార్క్ హోమ్, హార్గ్రీవ్సుగార్ల నివేదికలోని మూలసూత్రమునే ఉద్ఘాటించుచున్నాడు. అసలు పురాణ వస్తుప్రదర్శనశాలల కర్తవ్యములు ఎట్టివి అను ప్రశ్నకు సమాధానము కావలయును. ఆసమాధానమునుబట్టి స్థానికప్రదర్శన మందిరముల నుంచు ఆవశ్యకత బోధపడును. ప్రదర్శనశాలల కర్మములు మూడని చెప్పవచ్చును. ప్రాచీన వస్తుసముదాయమును చేర్చి, ఒక భవనమునందు చక్కగా, పదిలముగా నుంచుట మొదటి విధి. సంపాదింపబడిన వస్తువులను చక్కగా విడదీసి, తరగతివారీగా పేర్చి, వాటివలన దెలియనగు 'విశేష' శాస్త్రవిషయములను తెలిసికొనుట, పరిశోధన జరుపుట రెండవ విధి. ఈ పనిని మ్యూజియముఅధికారులు చక్కగా, తెలివితేటలతో నిర్వర్తింపవలెను. వాటిని ఊరక దేవతావిగ్రహములనువలె పేర్చి, బూజులు దులుపుచు పూజచేయుటకంటె, వాటిని పరీక్షించుట, వాటి శిల్పమును, కళను, ప్రాచీనతను, వాటివలన తెలియవచ్చు ప్రాచీనసంస్కృతిని శాస్త్రదృష్టితో పరిశీలించుచు, విమర్శ చేయుచు గ్రంథములు వ్రాయుచుండుట ముఖ్యావశ్యకము. ఈ పనియందు ఇతిహాసపరిశోధకులకుకూడ మ్యూజియముఅధికారులు తగినంత సదుపాయములు కల్గించుచు తోడ్పడుచుండుటకూడ మిక్కిలి ఆవశ్యకము. ఇక మూడవది ప్రాచీనవస్తుప్రదర్శనశాలలను విద్యాసంస్థలట్లు వినియోగించుట. ఈ మూడుపద్ధతులయందును ప్రాచీనవస్తుప్రదర్శనశాలలు కృతార్థత నొందవలయునన్న మొదట మ్యూజియములకొరకు విశాలములును, రమణీయములు నగు మందిరములు నిర్మింపబడవలయును. తరువాత మంచి ఐతిహాసికులు, అనుభవజ్ఞులు, విద్వాంసులు, శాస్త్రజ్ఞులు అగువారు మ్యూజియంఅధికారులుగా నుండవలెను. అట్టివారు మేధావంతులుగా నుండి, ప్రాతతెన్నులను గానుగయెద్దులవలె పోవువారుగాక, నూతనవిషయములను స్వతంత్రముగ పరిశోధనచేసి తెలుసుకొనగల్గువారుగా నుండవలెను. ఇక మూడవ విషయము : మ్యూజియమునవస్తువు లన్నియు సరిగా గుర్తించినపిదప, వాటినిగూర్చి అన్ని విషయములను చక్కగా, సంగ్రహముగా ఒక చిన్న కాగితపు అట్టల మీద, పామరులకుకూడ సులభముగ బోధపడునట్లుగా వ్రాసి అంటించవలయును. ప్రదర్శనశాలకు వచ్చిన వాడు, ఒకరిని అడుగనక్కరలేకయే తాను చూచుచున్న ప్రతివస్తువును గురించియు విపులముగా తెలుసుకొనుటకు సదుపాయములు కల్పింపబడవలెను. చూచిన మాత్రాన ప్రదర్శనశాలయు, అందలి వస్తుసముదాయమును ఆకర్షించుచున్నట్లుండవలెను. మరల మరల నొకసారి వచ్చి చూచిపోవుచుండవలె నన్న కోరుకను కలిగించుచుండవలెను.

పైని తెలిపిన మూలసూత్రములను పురస్కరించుకొని విమర్శింప బూనినపుడు సారనాథ్, తక్షశిలా మ్యూజియములు మాత్రము చక్కగా పనిచేయుచున్నటుల కనబడును. మిగిలిన నాలందా, హరప్పా, మహంజోదడో మొదలయినవి అసంతృప్తికరములుగా నున్నవని వేరుగా చెప్పనక్కరలేదు.

ప్రాచీన వస్తుసంతతిని పరీక్షింపవలసినపుడు రసాయనశాస్త్రజ్ఞుడు, భూగర్భ శాస్త్రవేత్త, జంతుశాస్త్రజ్ఞుడు, వృక్షశాస్త్రవేత్త మొదలయినవారి సహాయము, సహకారము ఎంతో కావలసియుండును. వీరందరి సహకారమునను దూరస్థములును, ఒక విధముగా అగమ్యస్థములు నగు హరప్పా, మహంజోదడో వంటి స్థలములలో ప్రదర్శనశాలలు కట్టించిన అచ్చటి వస్తు సామగ్రిని ఐతిహాసికుడు, ఆర్కియాలజిస్టును సమగ్రముగా పరిశీలించుటకు అవకాశ ముండదు కావున, అట్టి స్థానిక ప్రదర్శన మందిరములను ఎత్తివేసి, అన్నింటిని తీసుకొని వచ్చి,ఏన్యూఢిల్లీవంటి కేంద్ర రాజధానీనగరమునందో పెద్దఊరంత మ్యూజియంభవనమును గట్టి ప్రదర్శించుట మేలని ఊల్లీపండితు నిమతము

పదునెనిమిదినందల మైళ్ల నిడివియు, పదునెనిమిది వందల మైళ్ల వెడల్పును గల్గి, ప్రయాణమునకు, ఇతర సౌకర్యములకు, భోజనవసతులకు మిక్కిలి కష్టములు గల, రష్యా మినహా యూరపుఖండమంత యీ విశాల భారతదేశమున కంతకును ఒక కేంద్ర స్థానమందు పెద్ద భవనము కట్టి ఒక్క పెద్ద మ్యూజియము స్థాపించుట నిరర్థకము. అంతకంటె ఆర్కియాలాజికలు మ్యూజియమును, ఆర్కియాలాజికలు సర్వే ఆఫ్ ఇండియా శాఖయు అసలు ఎత్తివేయుట మంచిది. స్థానిక ప్రదర్శనశాలలు అత్యావశ్యకములు. సాధారణముగా ఒకచోట దొరికిన వస్తువులను, రకమునకు ఒకటిచొప్పున దొరికినచోట నుంచి మిగిలినవాటిని ఆయాప్రాంతము లందున్న స్థానిక ప్రదర్శనశాలలకు పంచియిచ్చినచో, అన్ని రాష్ట్రములవారికిని సమానమైన ఉపయోగము కలుగును. లేకున్న అసలు ఉపయోగమే యుండదు. ప్రతి స్థానిక ప్రదర్శనశాలయందును ఇద్దరు ముగ్గురు ప్రకృతి రసాయన జంతు శాస్త్రజ్ఞులనుకూడ నుంచుట ఆవశ్యకము. హిందూదేశములో ఒక్కొక్క రాష్ట్రము గ్రీసునంతటి వైశాల్యము కలదిగా నున్నది. అట్టి రాష్ట్రములు ఇరవై వరకు గలవు. అట్టివాటికి ఒక్కొక్క మ్యూజియముకూడ లేకుండచేయుట క్రౌర్యము.

ఆంధ్రదేశము మాట ఉదాహరణముగా తీసుకొందము. ఆంధ్రదేశమున నాగార్జునకొండ యున్నది. నాగార్జునకొండ మ్యూజియమును మూసివేసి, అందలి వస్తువుల నెల్లను ఏ కలకత్తాకో, న్యూఢిల్లీకో ఎత్తుకొని పోవుదురను వదంతి కలదు. అట్లు జరగకపోవచ్చును. అట్లే జరిగినచో ఆంధ్రదేశము కొల్లగొట్టుకొనిపోవుట యగును. నాగార్జునకొండమ్యూజియమును సంస్కృతి గల ప్రతిజనుడును జీవితములో కనీసము ఒకసారి అయినను, మదరాసుమ్యూజియమును జూచి వచ్చినట్టయినను ఒకసారి చూచిరాగలడు. అచ్చట దొరికినవాటి నన్నింటిని ఒక్కచోట చూచి ఆంధ్రుడు ప్రాచీనకాలపు తన జాతివైభవమును ఒకసారి సింహావలోకనము చేసి భావప్రపంచమున నిలిపి ఆనందించి పులకితగాత్రుడు కాగలడు. వాటి నన్నింటిని చెల్లాచెదరుగ అన్ని ప్రాంతములవారికి పంచిపెట్టినచో ఆంధ్రునికి తీరని అపకారము, అన్యాయమును కలుగును. అట్టి అన్యాయము జరుగకుండ ప్రతి ఆంధ్రుడును ప్రతిఘటింపవలెను. అట్టి అపకారమే జరిగిన నాడు నాగార్జునకొండప్రాంతము యొక్క ప్రాచీన వైభవమును జన్మజన్మములకైనను మరల ఆంధ్రుడు చూడజాలడు. ఇరువైయేడువేల రూపాయలు ఖర్చు పెట్టి కట్టించిన మ్యూజియమును, పండ్రెండువేలో, పదునెనిమిదివేలరూపాయలో ఖర్చుపెట్టి వేసిన రోడ్డును మూసివేసి, నాగార్జునకొండమ్యూజియమును ఎత్తి వేయరాదు. ఇట్లే యితరరాష్ట్ర ప్రాంతములందున్న స్థానికప్రదర్శనశాలల మాటకూడ. స్థానిక ప్రదర్శనశాల లన్నియు నొకమూలసూత్రము మీదనే నిలువబెట్టి యుంచవలెను. ఎవ్వరికిని తెలియకుండ ఆర్కియాలాజికలుశాఖోద్యోగులు ఇటీవల నాగార్జున కొండదగ్గరనుండి అమూల్యములయిన వస్తువులను త్రవ్వుకొని పోవుచున్నారు. వాటిని చూచుటకు సయితము అవకాశములేకుండ చేయుచున్నారు. మ్యూజియము ఉన్ననాడే యిట్లున్నదికదా, మ్యూజియము ఎత్తివేసిన ఇంకెట్లుండునోకదా! ఒక ఉదాహరణమును చూడుడు. ఇటీవల మంచిపాలరాతితో చేయబడిన, పెద్ద గుమ్మడికాయయంత పూర్ణకుంభము దొరికెను. అది రెండు డిప్పలుగా నున్నది. అందు బుద్ధుని శకలములు మొదలయినవి ఉండెను. అది ఎంత రమ్యముగా నున్నదో వర్ణించి వ్రాయ నలవి కాదు — దానిని చూచినవారికే తెలియును. దానిని ఆర్కియాలాజికలుశాఖవారు అచ్చటనుంచి కొని పోయిరి. అధికారులు తెలుగువారికి దానిని చూచుటకు గూడ అర్హత లేకుండజేసినారు. ఇట్టి అన్యాయములు ఇకను ఉన్న మ్యూజియమునే ఎత్తివేసినచో ఎక్కువగా జరుగుట ఆశ్చర్యకరము కాదు. ఆంధ్రుల చరిత్ర ఆంధ్రులు తెలుసుకొను భాగ్యము, పూర్వపురౌన్నత్యము తలపోయు భాగ్యము అన్నియు నశించి పోవును. సర్ లియొనార్డు ఊల్లీగారే చెప్పినారు— స్థానిక ప్రదర్శన మందిరముల నుంచుటా, ఎత్తి వేయుటా యన్న విషయమును అక్కడి దేశకాల పరిస్థితులను మనసులో నుంచుకొని ఆలోచించి తీర్మానము చేయవలెనని. నాగార్జునకొండ దుర్గమమైన అరణ్యమందు ఉండిన ఉండవచ్చును. మరి పది ఏండ్లలో

అక్కడ ఒక గ్రామము లేచి, అది పట్టణముగా మారవచ్చును. ఇప్పటికంటె ఎక్కువగా జూపరుల నాకర్షించవచ్చును. మూడుకోట్లమంది ఆంధ్రుల కది అత్యవసరము. జనసామాన్యముతో పాటు ఇతిహాస పరిశోధకులకు కూడ ఈ ప్రదర్శనశాల ఉపయోగపడునంతకాలమును, దానిని ప్రభుత్వము ఎత్తివేయరాదు. ఇప్పటి భవనమునకు ఎక్కువ మరమ్మతు కావలసియున్నది. పైకప్పు బాగుచేయవలసియున్నది. భవనమును విశాలము చేయవలసియున్నది.

సర్ లియొనార్డ్ ఉల్లీ గారు న్యూఢిల్లీలో ఒక సెంట్రలుమ్యూజియము ఉండవలయునని సిఫారసు చేసినారు. న్యూఢిల్లీ బ్రిటిషుభారతసామ్రాజ్యమునకు కేంద్రము గావున అలంకారముకొరకు అక్కడ మ్యూజియము ఉండదగునని వారి అభిప్రాయము. కాని అతి అలంకరణమే యగును; ప్రజోపయోగకరము కానేరదు. అలంకారముకొరకు కేంద్ర మ్యూజియమును కట్టి ఉపయోగకరములు కానున్నవాటిని ఎత్తివేయుట నీతికాదు.

ఇంకొక ముఖ్యవిషయ మున్నది. ఏటేట ఆర్కియొలాజికలుసర్వేశాఖవారొక నివేదికను ప్రకటించుచున్నారు. ఈ నివేదికవలన ప్రజలకు, ఇతిహాస పరిశోధకులకు, ఆర్కియాలజిస్టులకు రవంతయు ఉపకారము జరుగుటలేదు. దేశచరిత్రయందు అభిమానము ఇప్పుడిప్పుడు కలుగుచున్న ఈ భారత దేశమునందు ఆర్కియొలాజికలుశాఖవారు ప్రజోపయోగకరములయిన నివేదికలను, గ్రంథములను వ్రాయించి ప్రకటించుచుండవలెను. గ్రాంటులో పంద్రెండు వీసములు కన్సర్వేషనునిమిత్తము నిరర్థకముగ ఖర్చుపెట్టినచో ఈ ఆర్కియొలాజికలు సర్వేశాఖ ప్రజోపయోగకరములయిన గ్రంథములను వ్రాయించజాలదు. మరి ప్రకటింపనులేదు. ఇప్పుడు నివేదికలు మంచి విలువైన దళసరికాగితములపై, చాలవరకు ఉపయోగముండని విషయములతో, కావలసిన నూతన విషయములను దాచిపెట్టి, నిష్ప్రయోజనమైన గ్రంథముగా వెలువడుచున్నవి. ఈ నివేదికపద్ధతి అంతయు పూర్తిగా సంస్కరింపబడవలెను. ఏటేట లభించు క్రొత్త విషయములను ఇంగ్లీషుభాషలో ప్రకటించుట మాత్రమే గాకుండ ప్రధాన దేశభాషలయందు, అందు ముఖ్యముగ స్థానికమ్యూజియములున్న ప్రాంతీయ భాషలయందు ప్రకటించుట ముఖ్యావసరము. అదిగాక ఆర్కియొలాజికలు శాఖవారి కృషిఫలితములు అప్పుడప్పుడు ప్రత్యేకగ్రంథములుగ ప్రకటింపబడవలయును. ఇప్పుడు జరుగుచున్న పనిని, నివేదికలను, మెమ్వారులను (Memoirs) చూచిన మిక్కిలి సంతాపము కలుగును. పూర్వము ఆర్కియొలాజికలు సర్కిల్సువారు తమతమ సర్కిళ్లయందు జరిగిన పనిని గురించి ఏటేట ప్రత్యేకనివేదికలను ప్రకటించుచుండిరి. గ్రాంటుధన మంతయు ఇతర బాపతులక్రింద వృథావ్యయ మయిపోవుచుండుటవలన, ఉపయోగకరమయిన యీ ప్రత్యేక నివేదికగ్రంథప్రకటనకు డబ్బు కొఱతవచ్చెను. దానితో ఆనివేదికల ప్రచురణము నిలిచిపోయెను. ఇప్పుడు ప్రకటితములగుచున్న డైరెక్టరు జనరలు ఆఫ్ ఆర్కియాలజీవారి వార్షికనివేదికలను పరికింపుడు. అందు ఇతిహాసపరిశోధకులకు ఉపయోగపడునట్టి నూతనముగా లభించినవస్తువులనుగురించి యేమియు అగపడదు. అంతయు డిపార్టుమెంటువారి నిత్యనైమిత్తికకథ. ఒక ఎపిగ్రఫీవిషయము మాత్రము క్రొత్తసంగతులతో నిండియుండును. మిగిలినభాగములో ఆగోడలు బాగుచేయించితిమి, ఇక్కడ పూలతోటలను మరల పాతించితిమి - అన్న నిరర్థకములయిన నిత్యవ్యవహార విషయములు మాత్రమే కనపట్టును. ఆర్కియొలాజికలుశాఖవారు నూత్నముగా దొరికిన విషయములను వెంటనే ప్రకటింపరు. ఎవరైన రహస్యముగ తెలుసుకొని ముందుగా ప్రకటింపవలసినదే. మహంజొదరోలో, హరప్పావంటిస్థలములందు దొరకిన వింతవస్తువులను గురించి లోకమునకు లండనులో ప్రకటింపబడుచుండిన 'ది ఇల్లస్ట్రేటెడు లండన్ న్యూసు' పత్రికముఖమున మొదట తెలిసెను. అట్లు ప్రకటించుటయు ఆర్కియొలాజికలుశాఖవారు సహింపలేకపోయిరి. వారు చేయరు, ఇతరులు సాహసించి చేసిన సహింపరు. నాగార్జునకొండనుగురించి ఆంధ్రదేశవాసులకు తెలియునట్లు ఆంధ్రభాషయందు ప్రభుత్వమువారిచే నింతవరకు ఒకనివేదిక యయినను ప్రకటింపబడలేదు. వారు ప్రకటించు మెమ్వారుగ

త్వరలో రావు, వచ్చినవి తృప్తికరముగా నుండవు. ఈ సందర్భమున ఇండియా ప్రభుత్వమువారును, ఆర్కియాలాజికలుశాఖవారును చేయవలసినపని యిది. సింధునదీతీరవాసుల నాగరికత, సంస్కృతి, నాలందా, సర్కప్, పహాడ్‌పూర్, సారనాథ్, నాగార్జునకొండ ఇత్యాదిస్థలములనుగురించి క్రొత్తవిషయముల నన్నింటినిచేర్చి సులభశైలిని ఇంగ్లీషులోను, ప్రాంతీయ ప్రధాన దేశభాషలలోను చిన్నగ్రంథములు వ్రాయించి ప్రజోపయోగముకొరకు తెలుపుచుండవలెను. మాట వరుసకు చూతుము. నాగార్జునకొండదగ్గర దొరకిన వాటినిగురించి ఇంగ్లీషులో ఒకపుస్తకము ప్రకటింపబడెను. ఆపుస్తకమును ప్రకటించుటవలన ఏమియుపయోగము కల్గెనో చెప్పనక్కరలేదు. వరుసగా ఐదారేండ్లనివేదికల సారాంశము ఆగ్రంథమునం దెక్కించబడినది. ఒకవిధానము ననుసరించి అక్కడ దొరకిన ప్రాచీనవస్తుసంచయము పరిశీలింపబడలేదు. ఒకవివరణ లేదు. ఒకత్రోవ లేదు. అట్టిపుస్తకములయొక్క ఉపయోగము తక్కువ. ఆర్కియాలాజికలుశాఖయందు అట్టిగ్రంథములు వ్రాయువారు లేకున్న బయటనున్న వారిని నియమించవచ్చును. అట్టివారిచేత ఉపయోగకరములయిన గ్రంథములు వ్రాయించవచ్చును. మరియొకవిషయము. ఆంధ్రదేశము ప్రాచీనకాలమున బౌద్ధమునకు ఆటపట్టు. ఆంధ్రదేశమం దంతటను బుద్ధయుగమువాటి శిథిలావశిష్టములు కానవచ్చుచున్నవి. 'ఆంధ్రదేశములోని బౌద్ధనిర్మాణావశేషములు' అను శీర్షికతో ఆంధ్రదేశస్తూపములు, బౌద్ధవిహారములు, ఆంధ్రదేశపు బౌద్ధధర్మము, ఆంధ్రదేశమునందు బౌద్ధధర్మాచార్యులు ఇత్యాది విషయములను ఆంగ్లమునందు, ఆంధ్రభాషయందునుకూడ ఉత్కృష్టగ్రంథములు వ్రాయించవచ్చును. ఇట్లే నాగార్జునకొండను గురించి, అమరావతినిగురించి, ఇంకను ఇతరములయినవాటినిగురించి వ్రాయించవచ్చును. ఈరీతిగనే ఇతరప్రాంతములందున్న నాలందా, సారనాథ్, తక్షశిలా, మహంజోదడో, హరప్పా మొదలయినవాటిని గురించికూడ వ్రాయించవలెను. అపుడుగాని ఆర్కియాలాజికలుసర్వేవారి కృషి సార్థకతను, ఫలసిద్ధిని పొందజాలదు.

సర్ లియొనార్డ్ ఊల్లీ ఆర్కియాలాజికలు సర్వేశాఖను వృద్ధిచేయవలయునని తెలుపు అనేకసూచనలు చేసియున్నాడు. వాటి నన్నింటిని మనము ప్రస్తుతము విమర్శింప నవసరములేదు. ఆంధ్రదేశమును పురస్కరించి వారు చేసిన సూచనలను కొన్నింటిని మాత్రము విమర్శించెదము. చెన్నరాజధాని అంతయు సదరన్ సర్కిలులో చేరుచున్నది. ఈసదరన్ సర్కిలులో హైదరాబాదురాజ్యముకాని, మైసూరు, తిరువాన్కూరు, కొచ్చి, పుదుక్కోటసంస్థానములు గాని చేరవు. ఆ సంస్థానములకు ప్రత్యేకపాలనశాఖలు గలవు. చెన్నరాజధానిలో సగముకంటె ఎక్కువపాలు ఆంధ్రదేశము. మిగిలినది అరవదేశము. ఆర్కియాలజీనిబట్టి చూచినయెడల తమిళనాడుకంటె ఆంధ్రదేశమునకు ప్రాశస్త్యము, ప్రాముఖ్యత ఎక్కువ గలదు. ఆర్కియాలాజికలు శాఖలో ఆర్కియాలజీ ప్రధానశాఖ. ఎపిగ్రఫీశాఖకుకూడ ఆంధ్రదేశమునందు ఇపుడున్న సూపరింటెండెంటుకంటె అధికారులకు ఇద్దరికిని పూర్తిగా పనియున్నది. తమిళదేశములో కూడ ఎపిగ్రఫీ, ఆర్కియాలజీలకుపనియెక్కువగనున్నది. అట్టియెడ చెన్నపురిరాజధాని కంతకును ఒక్క ఆర్కియాలాజికలు సూపరింటెండెంటును, ఒక ఎపిగ్రాఫికలు సూపరింటెండెంటుమాత్రె ముండుట శోచనీయము. ఈసందర్భమునకైనను సర్ లియొనార్డు ఊల్లీగారి సిఫారసును అంగీకరించి ఆంధ్రదేశమునకు ఒక ప్రత్యేక అసిస్టెంటుసూపరింటెండెంటు ఆర్కియాలజీశాఖకును, ఒక అసిస్టెంటుసూపరింటెండెంటు ఎపిగ్రఫీశాఖకును నియమించుట ఆవశ్యకము. ఈ యుద్యోగములకు ఆంధ్రులనే యుపయోగించుట పాడి. ఆంధ్రదేశమునకన్ని విషయములందును- ఉద్యోగములందుసయితము- అన్యాయమే జరుగుచున్నది. ఆంధ్రదేశమున కళింగపట్నము, పిఠాపురము, వేంగిపురము, ధరణికోట మున్నగు ప్రాచీనస్థలము లెన్నో ఆర్కియాలజీశాఖవారిచేత త్రవ్వింపబడవలసియున్నవి. నాగార్జునకొండపని సగమయినను పూర్తికాలేదు. తమ కాలము నంతయు ఆంధ్రదేశమునకై పూర్తిగా వినియోగింపగల అధికారులను ఆంధ్రదేశమునకు విడదీసి నియమింపవలెను. అట్టి యుద్యోగములు ఆర్కియాలాజికలుశాఖలో ముందె

ప్పుడును ఆంధ్రులకు ఒసగబడలేదు. ఇప్పుడైనను ఆంధ్రుల కొసగబడవలయును. ఈవిషయమున ఆంధ్ర నాయకులు, ప్రజలుగూడ పూనికతో కృషిచేసి ఆందోళనము నడపించవలెను. ఇకనైనను ఇండియా ప్రభుత్వము వారు ఆంధ్ర దేశముపై శవతితల్లి ప్రేమను జూపుట మాని నిండు మనసుతో ఆదరింపవలయును.

ఇప్పుడు గాకపోయినను మరి రెండు మూడేండ్లకయినను ఆంధ్ర దేశ విషయము ఆర్కియొలాజికలు శాఖవారు బాగుగా నాలోచింపవలయును. ఆంధ్ర దేశమున కట్టి కొఱతయు గలుగకుండ ఇప్పటినుండియు మనవారు జాగరూకులయి ఆందోళనము చేయుట కర్తవ్యము.

# కురుక్షేత్ర సంగ్రామము



శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

తాళ్ల మెరకభూములు సుక్షేత్రాలు. అవి బంగారం పండేవి. వాటిల్లో పెంటా ఎరువూ ఏనాడూ పడకపోయినా, అవి ముక్కారునా విరగపండడమే గాని రెండోమాట ఎరగవు. ఆ వూరికి తూర్పున రెండుమైళ్ల దూరాన్ని ఉత్తర దక్షిణాలుగా ఓ పంటకాలువ ఉంది. దాని పడమటగట్టుని జేరి రెండు ఖండాలు, ఒక్కొక్కటి యాభై యేసి యకరాలవి, కాలవనించి కొంత మేర వదిలిపెట్టగా, ఓదాని కోటి కాడిగట్టుగా ఉండేవి. అందులో దక్షిణపువేపుది మిరియాలవారిది; ఉత్తరపుదిక్కుది శొంఠివారిది. భూఖామందులు గ్రామాంతర ఉద్యోగాలు ఆర్జించి వెళ్లిపోయి అవి రైతులకి అమర్చారు. పన్నులు పెట్టుగుని అమరకం ఎకరపుపుట్లు భూఖామందుల ఇంటిదగ్గిర అప్పచెప్పేవారు. మిరియాలవారి భూమి వనమయ్యా, శొంఠివారిది అతని జ్ఞాతి పనసయ్యా పుచ్చుగున్నారు. గొడ్లకోసం అని మొదట సాలలు కట్టి, ఎప్పుడేనా రాత్రి బసకోసం అని పాకలు వేసి, చివరికి వాళ్లిద్దరూ ఆవరణా ప్రహారీగోడలతోసహా రెండు భవనాలు ఖామందుల్నడిగి కాలవసరాసరిని పొలాల్లోనే కట్టుగున్నారు. ఆ ఇళ్లకి మధ్య నలభై యాభైగజాల నిడివిగల భూమి ఉంది. అది ఎవరిదో కొన్నాళ్లవరకూ తెలియకుండా బంజరుగా ఉండి, దుబ్బువేసింది. ఆ దుబ్బులో ఏ చుట్టనిప్పరవ్వో పడి కాల్తోచ్చేది. తరవాత చాలాకాలంకూడా అది నాది అన్న మొగాడు లేడు, ఫలానావారిది అని తేల్చిన ఉద్యోగి లేడు, నేను బాగుచేస్తాను అన్న నాథుడు లేడు. అంత మంచి భూములమధ్య ఆ క్షేత్రం ఎల్లా తయారైందో ఎవరికీ తెలియదు. ఆ భూమి అంతా పోగుచేసి ఎకరం లోపు! వనమయ్య పనసయ్యలు తమ రింత పిసుక్కుతిని, ఇంకోరి కింత పడెయ్యగల

స్థితిలోనే ఉంటొచ్చారు. వనమయ్యకి ముసిలి తల్లీ పడుచుపెళ్లాం మధ్య త్రాసు నిదానంగా పట్టుగునే సరికి నవనాళ్లూ కుంగిపోయేవి. పనసయ్యకి వెధవఅక్క సుస్తీ పెళ్లాం జరిపే పోరుహోరుజోరు జలుబు మొదలగొట్టేస్తూండేది. ఇళ్లమధ్య ఖాళీ స్థలం ఎవరిదైతేం గనక చెరిసగంగా వాడు కోడంలో ఏ విధమైన పేచీలూ రాకుండా, మాధ్యస్తంలో ఏకరేఖగా అయిదారు రాళ్లు పీళ్లే పాతుగున్నారు. దాంతో దక్షిణపు వేపు ఇంటికి ఉత్తరాన ఇరవై గజాల పొడుగునా, పనసయ్యఇంటికి దక్షిణాన ఇరవై గజాల చొప్పునా ఖాళీస్థళం వారివారి వాడకాలకి కేటాయింపు అయి ఉంది. అది వాళ్లు పుల్లా పుడ్రా వేసుగునీ, పురీ గడ్రా కట్టుగునీ, యథాశక్తిగా భుక్తపరుచుకుంటున్నారు. అదికూడా ఊడుపుభూమిగా మారిస్తే బాగా ఉంటుందనే ఊహాలు వాళ్లకి వంట్లోనూ ఉన్నాయి, ఇంట్లోనూ ఉన్నాయి. ఉన్నా, వాళ్లు హాసీ, హింసా తెలియనివాళ్లు గనక, ఆ ఊహాలు చాలాకాలం పొక్క లేదు.

వనమయ్య పనసయ్యలు జ్ఞాతులే అవడంచేత శుభాశుభాల్లో తప్పవిడిచి, సహాసన సహాభోజనాలు లేకుండానే వ్యవహారించే వాళ్లు. కాని అవసరంవల్ల ఒకనాడు సాయంత్రం కాలువగట్టుమీద గృహామధ్య రేఖకి సూటిగా వాళ్లిద్దరూ కొంత ఎడంగానే కూర్చుని ఉండగా ఈ సంభాషణ జరిగింది :

పనసయ్య— ఈమధ్య ఉన్న చెక్క అసలుమినహా అని మనం అనుకుంటున్నాం!

వనమయ్య—నేను అనుకోటంలేదు.

పన—ఇది వెన్నావారిది.

వన—నాకూ తెలుసు.

పన—వారిదగ్గిర అయి దేళ్లకి నేను కౌలు రాయించుగున్నాను.

వన—అంతకు పూర్వమే రాయించుగుని దుబ్బులు వేయించింది నేనే.

పన—వారి మైనరుకొడుకుచేతకూడా నిశానీ పెట్టించాను.

వన—ఆస్తి ఆయనపెళ్లాంపేర ఉందిట, నేను ఆవిడదగ్గిరే పుచ్చుగున్నాను.

పన—నేను సాగు చేస్తాను; రేపటెల్లుండి అరక దున్నుతాను;మీ వేపున మొదలెడతాను!

వన— అల్లా అయితే మాకు కోపం రావలిసివుంటుంది!

పన—మేం దున్నడం మానం!

వన—మేం అటకాయిస్తాం!

పన—మేం అడ్డొచ్చినవాళ్లని గిరవటేస్తాం.

వన—మేం కొమ్ములు ఊడగొట్టిస్తాం.

పన—మేం పేళ్లు నాశనంచెయిస్తాం!

వన—మేం అంతా నాశనంచేసి చూపిస్తాం.

పన—మేం పట్టిన కుందేటికి మూడే కాళ్లు!

వన—మా కుందేటికి కాళ్లే ఉండవు.

పన—అల్లాంటి కుందేల్ని దొల్లిస్తాం!

వన—ఇల్లాంటి ద్రోహాలు చేసేవాళ్లని మేం తిట్టిపోస్తాం.

పన—ఎప్పణ్ణించి తిట్టిపోస్తారూ?

వస—రేపు చద్దివణ్ణం తిని గట్టుమీద కూర్చుని నిర్భయంగా తిడతాం. వినడానికి జనాన్నికూడా పిలుస్తాం, భయమా ?

పస—జనాన్ని పిలవడానికి ఎప్పుడు వెడతారూ? రాత్రేనా ?

వస —అవును.

పస—రాత్రిచీకటిగనక, ఉభయులమూ కలిసేవెళ్లి పిలుద్దాం! చూస్కోండి మజాకా !!

మర్నాడు ఉదయం ఏడుగంటలకి కాలవగట్టుమీద ఓ పాతికజనం పోగయ్యారు. బాగా నాలుగైదుగజాల ఎడంలో వనమయ్య పనసయ్యలు వాళ్ల వాటాలకి సూటిగానే కూచున్నారు. కొద్దిగా ఎదురెండగా ఉంది. పనసయ్య గొడుగు వేసుకున్నాడు. మరోటి తెప్పించి వనమయ్యకి ఇచ్చాడు. వనమయ్య ఉపక్రమించగా పనసయ్య అందుకున్నాడు. వాళ్లిద్దరూకూడా ఒకర్ని ఒకరు చూసుకోకుండా, వచ్చినమాట రానీకుండా, గొంతిగలు పోకుండా, చెమట పట్టకుండా, చెక్కుచెదరనియ్యకుండా, అశ్లీలాలు దొర్లకుండా తిట్టుగోడం నడిపించగా ఆట్టే హుషారీ లేకపోడంవల్ల జనం ఒకమోస్తరుగా ఉందన్నారుగాని బాగా మెచ్చలేదు. భోజనం వేళకి సమరం చాలించి అభ్యర్థులు వెళ్లిపొయ్యారు. మెతుగులు నోట్లో వేసుకుని వీలైనంత వేగిరం రావచ్చుగదా అని జనం పరిగెట్టారు.

ఆ రోజు సాయంత్రం తిట్లనిమిత్తం ఛాన్సు స్త్రీల కిచ్చేశారు. వనమయ్య పెళ్లామూ పనసయ్య వెధవఅక్కా ఒక ఉజ్జీగానూ, వనమయ్య ముసలితల్లీ పనసయ్య సుస్తీపెళ్లామూ ఒక జోడాగానూ ఏర్పడి వాగ్యుద్ధం కానిచ్చారు. అది ప్రారంభంలో వాచికప్రధానంగా ఉన్నా, కాలక్రమాన్ని అభినయ వీక్షణ ప్రధానంగా మారింది. అప్పుడుకూడా అస్పృశ్యతకి భంగం ఏమీ రాలేదు. పోగైన శ్రోతల్లో పెద్దలు ఈ స్త్రీలు తిట్టుగోడంకూడా ఎంతమాత్రం రక్తిగా లేదనిన్నీ, ఆ కళ అంతగా తెలియని వాళ్లు నేర్పర్లని నియమించుగుంటే బాగుంటుందనిన్నీ తీర్చారు. రాత్రి రెండో ఝాం వేళదాకా పనసయ్యని తిట్టగలందు:కు నలుగురు జనానికి మనిషికి పావలాచొప్పున ఇవ్వడానికి వనమయ్య ఒప్పుగున్నాడు. తనికి గూడా ఓనలుగురు తిట్లరాయుళ్లని మాట్టాడి పెట్టమనిన్నీ, మొత్తం ఆ జట్టు ఎనమండుగురు అవుతారు గనక రేటు మూడణాలకి ఒప్పించమనిన్నీ పనసయ్య కోరాడు. ఆ ప్రకారం వాళ్లు రాగా, గృహమధ్యరేఖ వెంట నాలుగు ఇలాయిలు పాతి, నలుగుర్ని ఒక యింటివేపూ, వాళ్ల వీపులకి జేర్లపడేట్టున్నూ రెండో యింటివేపుఉండేటట్టున్నూ తక్కిన నలుగురినిన్నీ కూచోపెట్టారు. వాళ్లు తమ చాతుర్యం చూపిస్తూ అర్ధరాత్రివరకూ అరుస్తూనే ఉన్నారు. వాళ్లు తమకి సొమ్ము ఎవరిస్తున్నారో వాళ్లనే తిట్టేసెయ్యకుండా కాయడానికి పాలేళ్లని నియమించారు. వనమయ్య వచ్చి తనవాళ్లని మరోటి కోరాడు. వాళ్లు పనసయ్య పోయినట్టు ఉదయందాకా రాగాలు పెట్టాలంటే ఏంపుచ్చుగుంటారని అడిగాడు. అది ఆరుబయటవ్యాపారం గనక మనిషి ఒకటికి రూపాయికి తగ్గితే వాళ్లు కిట్టదన్నారు. ఆ కాటికే వాళ్లని అతను పురమాయించగా, తక్కిన నలుగుర్నీ వెంటనే వనమయ్య పోయినట్టు ఏడవడానికి పనసయ్య ఆ రేటుకే బెత్తాయించాడు. వాళ్లు ఉదయం

వరకూ శోకన్నాలయుద్ధం దిగ్విజయంగా కానిచ్చారు. తాళ్లమెరక వగైరాలనించి వచ్చిన శ్రోతలకి పడుకోడానికి చాపలు సప్లయిచేసి రయితు లిద్దరూ సన్మానం చేశారు. ఉదయం లగాయతు కదనం తీవ్రం కావచ్చునని అంతా ఆశించారు. కాలవ దక్షిణపు వాలుగా వెడుతుంది గనక వనమయ్యకి సీటియిబ్బంది (ఖర్చులేకుండా) కలిగించవచ్చునని, పనసయ్యకి, అతని వెధవ అక్క చెవులో ఊదింది. పనసయ్య ఉదయం లోపల పాలేళ్లని నియమించి ప్రశస్తమైన కశ్మలం తెప్పించి, రాయి కట్టించి, కాలవలో మధ్యగా, తన రేవుకి కొంచెం దక్షిణంగా వదిలిపెట్టించాడు. ఆ హడావిడిలో కొందరికి మెలుకువ వచ్చి లేచి "ఏమిటి ఏమిటి" అని ఆ విసిరేవాళ్లని అడిగారు. "వనమయ్య పుట్టి మునిగిపోయింది" అని వాళ్లనేశారు. దాంతోటి వనమయ్యకుటుంబానికి కొంచెం కష్టం అనిపించింది. తల్లి సలహా మీద వనమయ్య ఓ కుక్కకళేబరాన్ని తెప్పించి తన యింటికి ఉత్తరాన్ని తగలేయించాడు. గాలి దక్షిణాన్నించి ఉత్తరానికి వీస్తూండడంవల్ల వాయుప్రమాదం తెచ్చిపెట్టి వనమయ్య పనసయ్యని విసిరికొట్టదల్చుగున్నాడనేమాట పుట్టింది. ఆ హోమధూమాలు అయిపోయేవరకూ పనసయ్య కుటుంబం తలుపువేసుగుని ఇంటో పడివుండి తరవాతే బయటికొచ్చారు. ఈ లోపులో వనమయ్య పాలేళ్లని పంపి రెండు తట్టల రాయి తెప్పించి తన ఉత్తరపు గోడదగ్గిర పెట్టించాడు. ఉదయం అయింది.

వనమయ్య చల్ది ఆరగించి, బట్టలు వేసుగుని, గొడుగు వేసుగుని, తన గోడదగ్గిర నుంచుని, సకిలించి, పనసయ్యతో శిలాయుద్ధం చెయ్యడానికి తట్టలు తనకి దగ్గిరిగా పెట్టమని పాలేళ్లని కసిరి రాళ్లకేసి చూశాడు. ఒక తట్టలోవి అంగుళంనర సైజువి, ఇంకో తట్టలోవి అంగుళం సైజువి. అలా వ్యత్యాసంగా ఉండడం శత్రువుకి లాభకరంగా ఉంటుందేమో అని భయపడి, అతడు చిన్నతట్ట ఒక పాలేరునెత్తి కెత్తి అవిచ్చేసి పెద్దసైజువే తెచ్చిపెట్టమన్నాడు. వాడూ పదిబారలు సాగేసరికి పనసయ్యకి ఈసంగతి తెలిసి అతడు చిన్నసైజురాళ్లు తనకి కావాలని వాడితో చెప్పి ఖరీదూ,కూలీ చేతులో వేసేసరికి వాడు ఆ తట్ట పనసయ్యవేపు గుమ్మరించాడు. అంత కలిసొచ్చేటప్పుడు, ఒక తట్ట తనకి చాలనీ, రెండోది అనవసరమనీ చెప్పి వనమయ్య మనిషివాణ్ణి ఉండిపొమ్మన్నాడు. తనకి కేటాయింపుసైజు దొరకడానికి పనసయ్య సంతోషించి తనూ సిద్ధం అయాడు. తన పక్కని తను నుంచున్నాడు. పాలేరువాడు తనకి గొడు గట్టాడు. తను ఓరాయి తీసి "కాసుకోండి" అని నిరసనగా దక్షిణానికి విసిరాడు. అది మధ్యగీత దాటకుండా పడింది. వనమయ్య "చెయ్యండి, ఎం జెయ్యగలరో చూస్తాను!" అంటూ ఉత్తరంగా రాయి గిరవటేసేసరికి అదీ మధ్యగీత దాటకుండానే పడింది. అప్పుడప్పుడు తమ చెమట పాలేళ్లు తుడవగా, వాళ్లు కొంతసేపటికి రాళ్లన్నీ విసిరేశారు. అవన్నీ మధ్యగీతకి ఎడాపెడా ఎవళ్లవి వాళ్ల సహాం మేరలోనే గుట్టలులాగ పడ్డాయి. వాళ్లిద్దరూ ఇంటోకి దాహం తాగడానికి వెళ్లి వచ్చేలోపల పెద్ద సైజురాళ్లన్నీ వనమయ్య పాలేరూ, చిన్నసైజువి పనసయ్యపాలేరూ తట్టల్లోకి ఎత్తేసి మళ్లీ తమ తమ యజ

మాన్లదగ్గిర హాజరుపెట్టేశారు. రెండో
వేటులో వాళ్ళిద్దరూ కుడా వడి హెచ్చు
చేశారుగాని నేర్పు ఎక్కువ కనబరిచి హద్దు
మాత్రం మీరలేదు. ఇంకా జోరుగా విసుకు
గోడానికి మూడోమాటు తయారవు
తూండగా, జనంలో కలకలం బయల్దేరింది.
తాళ్లమెరక గ్రామపు మునసబుకరణాలు
ఇద్దరూ వచ్చిపడ్డారు. వనమయ్య పనసయ్య
లకి యుద్ధం జరుగుతోందని తెలిసి, లోక
కల్యాణంనిమిత్తం వాళ్లిద్దర్నీ నిరాయుధుల్ని
చేసి, పోలీసులకి తెలియకుండా కట్టుదిట్టం జేసి
వెళ్లడానికి వాళ్లొచ్చారు. ఒకర్ని ఒకరు
నరుక్కుంటా రనే భయంచొప్పున కత్తి
కటార్లూ, ఒకర్ని ఒకరు తగలబెట్టుగుంటా
రనే భీతిచొప్పున చమురు తైలాలూ ఇచ్చె
య్యమన్నారు. వాళ్లు తమర్ని ఒకవేళ ఇంకా
దగా చేస్తారేమో అని పెద్ద సూదంటురాయి
తాడుకి కట్టి రెండు కొంపల్లోనూ గిర గిరా
తిప్పారు. దాంతో సూదులూ, చాకులూ,
కొడవళ్లూ లాంటివి టపీమని వచ్చి దానికి
అంటుగుపోయాయి. గడ్డపారలు కూడా
నాట్యం ప్రారంభించాయి. ఆ రీతిగా అన్నీ
లాగేసి, "స్పంజి"లు గిరవటేసి నూనెలన్నీ
పీల్చేశారు. ఎవరూకూడా అగ్గిపెట్టెలూ
మతాబాలూవంటి బాణసంచా స్వాధీనంలో
ఉంచుకోకూడదనిన్నీ, ఒకడంటూ వెళ్లి
వాటిని పేల్చకపోయినా స్వయంగానే పేల
గల సత్తా వాటి కుందిగనక వాటిని వీలై
నంత త్వరలో తగలెయ్యడం మంచిది గనక
ఎవడి వాటాలోమాత్రం వాడు మతాబా
కాల్చినా నేరంకిందికి రాదనిన్నీ అనేసి,
మామూలు మర్యాదలు పొంది, కొంచెం
నిమ్మళించారు.

దుర్ముహూర్తం వెళ్లినట్టేనా అని పన
సయ్య వాకబుచేశాడు. తను అన్నంతపనీ
చెయ్యడానికి టైం అయిందన్నాడు. ముందు
వనమయ్యవేపు సగంభూమీ ఖాళీచెయ్యా
లని కబురంపించాడు. "నువ్వేం జెయ్య
గలవో చూద్దాం, అదే పోయిరి అనిగాని
భయపడి కాదు" అని సమాధానం పంపించి
వెంటనే వనమయ్య తనపక్క ఖాళీచేశాడు
ఒక అరక కట్టి తోలుకు రమ్మని పనసయ్య
ఒక పాలేర్ని అంపి ఈలోపులో ఓ చాకింటి
ఇస్త్రీమడత పంచె విరిచికట్టుగుని, ఆఫారం
తొడిగి చేతులు ఎగసందోసి, మీసాలుపోగు
చేసి వడేసి, గిరజా దువ్వి, పైన ముచ్చట
మడి రానిచ్చి, చెప్పులు తొడుక్కొని, చుట్ట
కాలుస్తూ కయ్యానికి సర్వసిద్ధం అయాడు.
వనమయ్య లంగోటీ బిగించి, పులిపిరిపంచె
కట్టి, గ్లాస్గోషర్టు వేసి, తాంబూలం నముల్తూ
కళ్లజోడు తుడుస్తూ, తనవేపున తిరుగుతూ
ఉన్నాడు. పనసయ్యపాలేరు ఓ గొడ్డుగేదెనీ,
ఓ దున్ననీ పూన్చి అరక తోలుకొచ్చాడు.
అది కొంచెం పైన సమతలంగా ఉన్నచోట
నిలపవలిసిందని అంటూ, పనసయ్య వాణ్ణి
హెచ్చరించి, ఆ చోటు చూపించాడు.
చేతులో గొడుగు ఇటూ అటూ ఊగడం
వల్ల దున్నా గేదీకూడా హడిలి, బెదిరి,
ఎగిరి, మేఘాలమీద లేచిపోయాయి. నాగలి
అక్కడే ఉండనిచ్చి పొగరుమోతులు కాని
ఎడ్లనే తోలుకురమ్మని పనసయ్య పాలేరుతో
అన్నాడు. వాడూ వెళ్లి రెండు ఎడ్లని —
బక్కచచ్చి ఊసూరు మంటూ కళ్లల్లో
ప్రాణాలు పెట్టుగున్న వాటిని — తోసు
గొచ్చాడు. వాట్లకీ నాగలికీ పసుపురాయించి
వాటిని కట్టి, కర్రు నేలకి ఆనించి, నాగలిపిడి
పనసయ్యకి అందించి, ముల్లుకర్రకూడా అతడి

చేతి కిచ్చి పాలేరు తప్పుగుని పనసయ్యకి గొడుగుపట్టాడు. ఎడంచేత్తో నాగలి అదిమి "ధర్మానికే జయం, అనగా నాకే!" అని కేకేసి, పనసయ్య ఎడ్లని కర్రచ్చుగుని పక్కమ్మట తగిలించాడు. అవి కించిత్తూ చలించలేదు. తక్షణం అతడు రెండింటినీ ముల్లుపుచ్చుగుని రక్తం వచ్చేలాగ — రక్తం ఉందిగవక వచ్చింది — గుచ్చాడు. అవి రొండూకూడా పడుకున్నాయి. ఇంకా కొట్టినా గుచ్చినా అవి నిద్దరకూడా పోతాయేమో అని పనసయ్య నిదానించాడు. పనసయ్య (తన పాలేరుతో) "మరి అటకాయించ మనవోయ్, పౌరుషం ఉంటేనూ!" అని గిరజాలూ, మీసాలూ రెండు చేతులా దువ్వి భూపించాడు. వనమయ్య ఆపాలేరు కేసే చూస్తూ, "అసలు దున్న మనవోయ్, పశుత్వం నిలబడితేనూ" అని కనుబామలూ, శ్రాపింగూ రెండు చేతులా దువ్వి చూపించాడు. పనసయ్యపాలేళ్లలో ఒక తెలివిగలవాడు చరచరా పరిగెట్టి చిట్టుబుట్టా, తెలకపిండీ పట్టుగు చక్కావచ్చి ఎడ్లకి చూపించాడు. ఎడ్లు లేచి విద్దెంచేసి నడకకూడా ప్రకటించాయి. పనసయ్య నాగలి చాలా తేల్చి పట్టుగున్నా కొంచెం గడ్డ విరిగింది. పనసయ్యపార్టీవాళ్లంతా కరతాళధ్వనులు చేసి ఈలలువేశారు. వనమయ్యకి ఆగ్రహం, ఆవేశం ఇనుమడించాయి. అతడు హుంకరించి, మజ్జిగతాగి, తల్లికి మొక్కి, పెళ్లాం యిచ్చిన హారతీ, స్నేహితులు వేసిన కర్పూరదండా ఆఘ్రాణించి, తీవిగా నడిచి జేకుతూన్న ఎడ్ల ఎదటికి వెళ్లి, ఈ లోపుగానే మిక్కిలి చకచకగా తన పాలేళ్లు అక్కడ పరిచిన పరుపు సమీపించి, "ధర్మానికే జయం, అనగా నాకే!" అని ముక్తసరుగా ఉపన్యసించి, ఒంటరిగా దైవప్పటికీ అమితమైన ధైర్యమూ, అమానుషమైన సాహసమూ వెలిబుచ్చుతూ దానిమీద పరుండి అరక సాగకుండా అడ్డుతగిలాడు. పనసయ్యపక్షం వాళ్లు ఎగిరి, గంతులేసి, పక్కవాళ్లని బాది, రుమాళ్లూ తలపాగాలూ పైకి ఎగరేసి ఎవళ్లవి వాళ్లు సంపాదించుగునేసరికి నానా బాధా పడ్డారు. ఎడ్లేనా తొక్కెయ్యచ్చు, నాగలేనా చీరెయ్యచ్చు, పనసయ్యేనా గుచ్చెయ్యచ్చు అనే నిరాశలో పడిపోయి, వనమయ్య చూస్తూనే ప్రాణం ఉగ్గబట్టి, పైకి మాత్రం నవ్వుమొఖం పెట్టి, కర్రబారిపోయాడు. ఇంతలో దగ్గిర దగ్గిరజనం "ఎముకలులా ఉన్నావేం? దున్నగానే బయట పడుతున్నట్టున్నాయి" అంటూ వెనక్కితగ్గి ఇంటికి దారెట్టడం సాగించారు. వనమయ్య ఆ కాస్తచూపూ లేకుండా ధైర్యంగా కళ్లు మూసేసుగున్నాడు. పనసయ్యకి వణుకు పుట్టింది. కాని ఏర్పాటుప్రకారం పనసయ్య మనుష్యులు పలుగురు ఓబల్లచెక్క తెచ్చి పక్కని ఉంచి దానిమీదకి అతిమృదువుగా వనమయ్యని పరూపుషంగా ఎక్కించి, నడకలో తడబడినా, పడెయ్యకుండా సాయంపట్టి కాలవగట్టుమీద అతని యింటి ఎదట పెట్టారు. ఓ పాలేరు వనమయ్య మొహం మీద నీళ్లు కొట్టాడు. వెంటనే అతడు లేచి పరుపు తడిసిపోతోందని వాణ్ణి తన్నబోయాడు గాని తూలిపోయాడు. కొడుకుపాట్లకి తల్లి కళ్లు ఒత్తుగుంది. కాని అతని పెళ్లాం ఓ రోకలి పుచ్చుగుని నాగలివేపుకి రాబోయింది. పనసయ్యకి పైప్రాణం పైనే ఎగిరిపోయింది. అతడు చాలా అర్జెంటుగా బయటికి వెళ్లి వస్తానని చెప్పి నాగలి ఓపాలేరుకి అప్పగించాడు. ఇంతలో ఎడ్లు పడకేశాయి. పన

నయ్య తనయింటి గోడదగ్గిరికి జేరుకుని 'అమ్మయ్య' అనుకుని, ఎడ్లకి తెలకపిండి పెట్టి లేవగొట్టమని ఇద్దర్ని పంపించాడు. ఎన్నివీశెల తెలకపిండి పెట్టినా, అవేం యెడ్లో గాని, తలకాయకూడా నేలమీదే సాచి తిన్నాయిగాని లేవడానికి సంకల్పమేనా ఉన్నట్టు కనిపించలేదు. పనసయ్యకి మరో మార్గం తోచక, ఆ బల్లచెక్క పట్రమ్మని దానిమీదికే ఒక్కొక్కఎద్దుని ఎక్కించి వనమయ్యని జేరవేసినట్టే వాటినిగుడా జేరవెయ్యమని మరోనలుగుర్ని పంపించాడు. విజయసూచకంగా ఉండేనిమిత్తం నాగలి పట్టుకున్నవాణ్ణి అల్లానే పట్టుకుఉండమని చెప్పడానికి మరోణ్ణి పంపి తను ఇంట్లోకి వెళ్లాడు. వెంటనే అతని వెధవఅక్క అతనికి దిష్టి తీసేసింది. అంతా వెళ్లిపోయారు.

అదిలగాయితు ఆ భూమి తప్పకుండా శ్మశానమే అయిఉండిఉండా లనే భావంతో వనమయ్య పనసయ్యలు దాల్లో పదరపు అంగుళమూకూడా దున్నలేదు, వాడలేదు, తొక్కలేదు. కాని మునసబు కరణాలు ఆ భూమి ఆ యేడు సాగుఅయినట్టు పైవారికి తెలియచెయ్యడంవల్ల వెన్నావారికి ఆరురెట్లు అపరాధంపన్నుకట్టారు. ఆ దెబ్బతో వెన్నా వారికి అక్కడ పొలం ఉన్నట్టు బోధపడింది. వాళ్లూ తంటాలుపడి పైవాళ్లని చూసి, అవసరప్రకారం సంతోషపూర్వకంగా లంచాలు పోసి, బ్రహ్మాండంమీద అది రుద్రభూమే గాని తమది కానేకాదని లెఖ్ఖల్లో నమోదుచేయించేవరకూ నిద్రాహారాలు లేకుండా శ్రమపడ్డారు. ఆ భూమి అరణ్యం లాగ మళ్లీ దుబ్బువేసింది. నాటికి నేటికి ఆ క్షేత్రంలో సంగ్రామముమాత్రం మరోటి ఏదీ జరగలేదు, ఏ గ్రామంవాళ్లూ చూడ రానూ లేదు. వనమయ్య పనసయ్యలు మాత్రం కొద్దికాలంలో కూడబలుక్కుని అక్కణ్ణించి కాపరాలు ఎత్తేశారు.



# విరహ  గోపిక

శ్రీ బి. వి. శ్రీనివాసాచార్య

ఇది సరియే ప్రభూ! మరి వచించిరి మొన్న నికెన్నడేని ఈ
పదమును వీడనంచు; అటు పల్కిన ఆమరునాడె—అయ్యయో!
హృదయము కాదిదే శిలయొ ఏమొ! సహించియు నిల్చియున్నదా
మదన ధనుర్విముక్త సుమ మార్గణ దారుణ వహ్నికీలలన్.

మిమ్మని ఏమిలాభము! శమింపని ఈవ్యథ నెల్ల నేనె హ
స్తమ్ముల పెంచుకొంటి; తలిదండ్రుల, బంధుల, ప్రాణనాథు పా
దమ్ముల వీడు తెంపరి కిదంవిధమౌ ఫలితమ్ము గాక వే
రెమ్మగు కల్గు? వీనులును ఈక్షణలున్ నను మోసగించెలే!

అదిగో! ఏమొ వచింపబోయెదు మహాత్మా! మ్రొక్కెద మీకు, ఈ
విధి నింకేటికి కల్లిబొల్లి పదముల్-వేంచేయు డింతన్ వ్యథా
స్పదముల్ ప్రేమకఠోర వాగురల నన్ బంధింప నింకేల చూ
పెదు! చాలింపుడు మందహాసములు, కించిద్దృగ్విలాసమ్ములున్.

దానికి నేమిలెండు-తమ దారిని తాము చనుండు; నైన ఈ
దీన గతాత్మవృత్తము పదేపదె సంస్మృతికిన్ తెమల్చి, బా
ధానల కీలలన్ కసలి, ఆర్చి నశించి ననున్ నశింప నిం
డాసలినాత్మి రుక్మిణి శుభాంగన యున్నదిగాద యాదవా!

ఈ బులిపింపుమాటలకు నేమి! ఇకన్ మిము విశ్వసించి, స్వా
మీ! బలివెట్టలే నెడద నింత-అహో! ఇది ఏమి!! స్వామి వే
నా! బళి! దాసిపాదముల నంటుటయా!!-ఇక చాలు, లెండు-పో
సీ-బుధవంద్య! అట్లయిన ఇంతట వీడమి నొట్టుపెట్టుడీ!



# భట్టవామనుని హంససందేశము

= శ్రీ సాగి వెంకటనరసింహము =

భారతదేశచరిత్రమున నాంధ్రకవిపండితుల యపారసేవను నిర్ణయింపవలె నన్నచో సంస్కృతకావ్యశాస్త్రాదిశాఖలయందు మన కవిపండితులు వ్రాసిన గ్రంథములను బరిశోధింపవలసియున్నది. అట్టి కృషి కాంధ్రు లింకను బ్రారంభింపలే దని తోఁచుచున్నది. ఈ విషయమై కాశ్మీరము మొదలు తిరువనంతపురమువఱకుఁ గల ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములను గాలించినచో అముద్రితములైన గ్రంథరత్నములు వేనవేలు దొరకఁగలవు. ఇవిగాక విదేశము లందును పెక్కు గ్రంథములు గలవని తెలియుచున్నది. ఈ విషయమై కొంత ప్రయత్నము చేయఁదలఁచి చూడఁగా మొట్టమొదట వామనభట్టబాణుఁడు స్ఫురించినాఁడు. ఇతని చరిత్రమును వేఱొకచో (రెడ్డిసంచిక) వ్రాసియున్నాను. అందు వ్రాయని హంససందేశవిషయమునుమాత్రమే ఈవ్యాసమున వ్రాయుచున్నాను.

బాణభట్టబిరుదముగల వామనభట్టు, లేక భట్టవామనుఁడు ౧౫-వ శతాబ్దారంభమునఁ బ్రసిద్ధివహించిన కవిపండితుఁడు. ఇతఁడు కొండవీటి పెదకోమటి వేమారెడ్డి (౧౪౦౪-౧౪౨౦) యాస్థానమున పండితుఁడుగా నుండెను. శ్రీనాథున కితఁడు సమకాలికుఁడు. ఇతని కృతులు పార్వతీపరిణయము, వేమభూపాలచరితము ముద్రితములు. బాణకవి తన హర్షచరితము నందువలె వామనభట్టు వేమభూపాలచరితమునఁ దన ప్రభుచరిత్రమును జిత్రించెను.

వామనభట్టు, భట్టవామనుఁడు, వామనభట్టబాణుఁడు అనుపేరు లొక్కరివే యని నా యభిప్రాయము. కాళిదాసకృత మేఘసందేశమునకుఁ బ్రతిగా సంస్కృతమున పెక్కు సందేశగ్రంథములు లోకమున వెలసిన వనుట యెల్లరకుఁ దెలిసిన విషయము. అట్టి ప్రతిబింబములలో వెంకటనాథకృత హంససందేశము తఱచు శ్రుతిపథమునకు వచ్చును గాని భట్టవామనకృత హంససందేశము రాదు. ఇది భట్టవామనకృత మనుటకు మూలమున నాధారము లేదు. లేఖకుల గద్యయే యిందు శరణ్యము. "ఇతి శ్రీ భట్టవామనకృతి హంససందేశః" అని గలదు. ఈ గ్రంథము మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున D ౧౧౯౧౨, D ౧౧౯౧౩ సంఖ్యలు గలిగిన రెండు ప్రతులలో నున్నది. ఇందు మొదటిది రెండవదానికిఁ బ్రతిబింబము. ఈగ్రంథము అముద్రితము.

ఈపుస్తకమున పూర్వసందేశమున ౬౧ శ్లోకములును, ఉత్తరసందేశమున ౬౦ శ్లోకములును గలవు. కథయు, శైలియు కేవలము కాళిదాసుకృతికిఁ బ్రతిగానే యున్నవి. శ్లోకములు మందాక్రాంతావృత్తములే. కాళిదాసుపదములు, సమాసములు తఱచు వచ్చుచుండును. ఇందు కుదాహరణములు :

"ఆ కైలాసా దవిదితచరాః"

"ఆకామాత్రగ్రథితమబలాజీవితం"

"ఇత్యౌత్సుక్యా చ్ఛబరయువతేః
ప్రీతివిస్తార్యమాణైః
స్రగ్భూషాంగై రకృతలలితై
రక్షిభి ర్వ్యాం పిబేయుః"

జాత్యాదులు పెక్కులు గలవు.

ఇం దక్కడక్కడ నూతనభావములు లేకపోలేదు. నైషధమునుండి శృంగారవర్ణనములలోఁ బోలికలుఁ గలవు. ఈక్రిందిశ్లోకము కాదంబరియందలి జాబాల్యాశ్రమవర్ణనమును దలపించును.

“ యత్ర స్త్రీణాం వపుషి తనుతా,
వక్రతా భ్రూలతాయాం,
లౌల్యం దృష్ట్యోః, కుచకలశయో
రేవ కాఠిన్యవార్తా,
మాంద్యం లీలాగతిషు,
సవనత్వంశయో మధ్యభాగే
సంగః కేశే, వ్యధరరుచకే
రాగయోగప్రసంగః ”

(ఉత్తరసందేశము, శ్లో. ౧.)

కుపితుఁడైన యక్షరాజుచే శప్తుఁడైన దక్షుఁడను యక్షుఁ డొక వత్సరము మలయపర్వతమున వసింపవలసినవాఁడై స్వవిరహార్తుఁడై కుబేరపురమున నున్న తనకాంతకు-కందర్పరేఖకు హంసద్వారా సందేశ మంపును. హంస వెళ్లవలసిన మార్గమును వర్ణించుటఁ బట్టి కవి దాక్షిణాత్యుఁడై యుండు నని స్పష్ట మగుచున్నది. వేమభూపాలచరితమున, పెదకోమటి వేమారెడ్డి దిగ్విజయయాత్రను వర్ణించుటలో నెట్లు భూగోళశాస్త్రము ధ్వస్తమైనదో అట్లే ఇందును దేశక్రమము ధ్వస్తమైనది. అక్కడ ప్రభుప్రీత్యై కొంతకథ తారుమారు చేసియుండవచ్చును. కొంత తెలియమిచే దోసగు వచ్చును. ఇందును తెలియమియే లోపములకుఁ గారణము. ఈవిషయమున కాళిదాసువిజ్ఞత యనుపమానము. అతని హిమాలయాదివర్ణనలు అత్యంత సత్యములు.

హంససందేశమునందలి హంస ముందు మలయసమీపమున నున్న దక్షిణసముద్ర వాయువులఁ జవిగొని తామ్రపర్ణి దాఁటి పాండ్యనగరముఁ జేరును. పిమ్మట కావేరిని జూచి యానందించి, శ్రీరంగము, కాంచి, పుండరీకము మొదలగు క్షేత్రములను సేవించి యాంధ్రదేశముఁ బ్రవేశించును. ఆంధ్రదేశమున కృష్ణ, తుంగభద్ర, గోదావరి, పంచవటి వర్ణింపఁబడినవేగాని పట్టణము లేదియు వర్ణింపఁబడలేదు. అటుతరువాత వింధ్యపర్వతము, నర్మదానది వర్ణితములు. ఇంతవఱకును కవి యొంటిగిరియే యుండును. ఆమీఁద యమునను, గంగను వర్ణించి చుట్టుతిరిగి కాశికి మరలను గొనిపోయి కవి అయోధ్యమీఁదుగా హిమాలయమునకుఁ జేర్చినాఁడు. హిమాలయవర్ణనము, కైలాసవర్ణనము కాళిదాసు మార్గము ననుసరించి కూర్చెను గాని ఆమాధుర్య మిందు రాలేదు. కాని ఏదో సామెత చెప్పినట్లు కాళిదాసు కృతిచూచి దీనిని చూచినచో నంతగా నచ్చకపోవచ్చునుగాని స్వతః మార్దవమాధుర్యముల కిందు కొఱఁతలేదు. ఆంధ్రప్రశంస గల శ్లోకము నుదాహరించి, ఆంధ్రపండిత కవియగు వామన భట్టబాణుని ఈకృతిని గూర్చి యింతతో ముగించెదను.

“ఆంధ్రోద్దేశా నధిజిగమిషో రగ్రత స్తే భవిత్రీ
వేణీ భూమే రివ కువలయామోదినీ కృష్ణవేణీ,
ఆశ్లిష్యన్తీ తరలలహరీ(బాహయా యాం)......సఖీవ
స్రోతోమధ్యవ్యవహితజలా శోభతే తుంగభద్రా.”

— I. ౩౮.



వ్యాస మీమాంస

# 'రెంటికిం జెడిన రేవఁడు'

శ్రీ గర్భాం అప్పారావు

గత చైత్రమాస భారతి సంచికలో 'రెంటికిం జెడిన రేవఁడు' అను శీర్షికతో నొకవ్యాసము ప్రకటితము కాగా దానిపై వైశాఖమాస సంచికలో 'రెంటికిం జెడిన రేవణ' అను శీర్షికతో నొక వ్యాసము 'రేవణ' అను వింతపాఠముతో ప్రకటితమైనది. అందు వ్యాసకర్త "సంస్కృత వాఙ్మయములో దీనికి సాధు శబ్దము 'రేవణ' అని. కాని ఏ కారణంచేతనో తెలుగులో 'రేవడ' గా మారింది" అని వ్రాసిరి.

కారణ మేమి ? రేవణశబ్దము రేవడగా మారిన గదా కారణము? 'అణకువ' కు 'అడకువ', 'వణకు' నకు 'వడకు' రూపాంతరములు కలవు. వీనిలో 'ణ' కు మారు 'డ' ఉపయోగింపబడుచున్నది. అట్లే 'రేవణ' 'రేవడ'గా నయ్యె ననుకొనిన 'రావణ' 'రావడ' కాకతీరదు. ఇందు వ్యాసకర్తగారు రేవణుని తీసికొనివచ్చినారు. రేవణునికి మారు రావణునే తీసికొనివచ్చిన సరసముగా నుండును. అప్పుడు 'యతి' భంగ మగును. అయిన రావణునకు యతికూడ భయపడుట కలదు.

సూత్రభాష్యములకు సంబంధించిన రేవణునకు "...శ్లోకవార్తికమూ తెలియదు. పాపం, ఎన్నేళ్లు శుశ్రూష చేసినా, ఎంతకాలం చదివినా, ఈ రేవణునకు ఇవేవీ తల కెక్కలేదు. అందుచే ఉభయభ్రష్టు అయినాడు." అని వ్యాసకర్తగారు వ్రాసిరి. అట్లయినచో "మావాఁడు ఇంగ్లీషులోనూ పూర్ణమే, లెక్కలలోనూ పూర్ణమే" అని చెప్పునపుడు ఆవిద్యార్థి రెంటికిని చెడినవాఁడను భావము లేదు. ఇంక "చరిత్రలోను తెలుగులోను సైన్సులోను కూడ పూర్ణమే." అనునపుడు అతడు అయిదింటికి చెడినవాఁడగును. రెంటికి జెడుట, మూటికి జెడుట పై నుదాహరింపబడిన వారికి వర్తింపవు. యజుర్వేద మభ్యసించుచున్న వానిని ఇంగ్లీషుచదువులో ప్రవేశపెట్టిన తరువాత ౫-౬ సంవత్సరములు చదివి ఇంగ్లీషుచదువు రానిచో నాతడు ఇంగ్లీషునకు, యజుర్వేదమునకు చెడినవాఁడగును. అట్లే కర్షకుని పుత్త్రుని కులవృత్తినుండి విరమింపజేసి ఇంగ్లీషుచదువులో ప్రవేశపెట్టి కృతార్థత లేనపుడు అతడు రెంటికి జెడినవాఁడగును. ఒకని స్వాధీనమందున్న దానిని వీడి యింకొకదానికి ప్రాకులాడి తత్ఫలముకూడ పొందనివాడు రెంటికి జెడినవాఁడగును. కాని

"ఉంవేకః కారికాం వేత్తి
తంత్రం వేత్తి ప్రభాకరః,
మండన స్తూభయం వేత్తి
నోభయం వేత్తి రేవణః"

అనుదానివలన రేవణుడు ఉభయభ్రష్టు కాలేదని స్పష్ట మగును. తక్కిన విద్యార్థులతో పాటు విద్యాభ్యాసము చేసినాడు. ఒకనికి ఒకటి పట్టుపడినది; ఇంకొకనికి యింకొకటి పట్టుపడినది; మూడవవానికి రెండు నలవడినవి. రేవణున కేదియును పట్టుపడలేదు. రేవణుడు స్వాధీనమందున్న ఒకటి విడిచి రెండవదానికి ప్రాకులాడలేదు. ఇంక రావణుఁడో, తన స్వాధీనమందున్న అనేక సౌందర్యవతు లుండగా సీతకొఱకు ప్రాకులాడి రెంటికి జెడెను. శబ్ద సారూప్యముచేత రావణుని సూచింపవలసివచ్చినది కాని రావణ శబ్దమునకు స్థానమే లేదు. మఱియు 'రేవణ' శబ్దమును సంస్కృతరూప మట్టె యుంచి పెద్దన్న ప్రయోగించెనా, లేక తత్సమరూపము వాడెనా? "పుంలింగ మహద్వాచకమునకు డుజ్ఞను" అను వ్యాకరణసూత్రముచే

'రేవణకు' తత్సమరూపము 'రేవణుడు' కావలెను. అప్పుడు పద్యమున "రేవణ నాడునె" అనుదానికి మాఱు "రేవణుడ నాడునె" అని యుండవలెను. అట్లు కానిచో "భీముడ నాడునె" అనుటకు మారు "భీమ నాడునె", "రాముడ నాడునె" అనుటకు మాఱు "రామ నాడునె" అని ప్రయోగింపవలెను. కావున 'రేవణ' శబ్దమున కెందు తావు లేదు. జనసామాన్యముచే వాడబడి దేశీయమగు 'రేవఁడు' శబ్దము వదలి యే పూర్వమీమాంసకో సంబంధించిన మాఱుమూలపదము-'రేవణ'ను ఇచ్చట అనుసంధించుట అమెరికాలోని 'కెనడా' మన 'కన్నడ' దేశీయుల వలసరాజ్య మనుకొనుటయే.

అయితే 'రేవఁడు' శబ్దమునకు అర్థమేమి? 'చాకలవాఁడు'. చాకిరేవునకు మాఱుగా కేవలము 'రేవు' అను పద ముపయోగింతురు. ఉదా: "నీవు రేవు ఎప్పుడు పెట్టెదవు, బట్టలు రేవులో నున్నవి." రేవు + అడు లేక వాడు = రేవడు - రేవు కలవాఁడు. ఇట్లే వన్నెలు + ఆడు = వన్నెలాడు - వన్నెలు కలవాడు. బోయ + అడు లేక వాడు = బోయఁడు. ఎట్టివాఁడు అను దానికి ఎట్టఁడు అని ప్రయోగము. "ఎట్టిడు వాని జేసుఁడు." (రామా. సుందర.) ఇట్టిపదము లనేకము లున్నవి.

మనుచరిత్ర పూర్వవ్యాఖ్యానములలో దీనిని వివరించుచు చాకలవాని గాథయే తెలుపబడినది. అదియే సమంజసముగా నున్నది. ప్రవాహములందు బట్టలుతుకువాడు క్రిందిరేవున ఉడికించిన బట్టలుదికి అక్కడి నీటికంటె మీది రేవున నీరు పరిశుభ్రముగా నుండును కావున మొదట ఉదికిన బట్టలు రెండవమాఱు ఉదుకుటకు మీదిరేవున బెట్టును. ప్రవాహము వచ్చినప్పు డొక చాకలవాడు క్రిందిరేవున నున్న బట్టలు విడిచి మీదిరేవున బట్టలకొఱకు పోగా ప్రవాహము వచ్చి ఆ బట్టలు కొట్టుకొనిపోయినది. మరల క్రిందిరేవునకు రాగా వానిని కొట్టుకొనిపోయినది. అప్పు డతడు రెంటికి చెడిన రేవ డయ్యెను. కావున రేవడు శబ్దమే సరియైనది. దానికి రజకుని గాథయే సమంజసముగా నున్నది. దీనిని స్పష్టపఱచుటకు చైత్రమాస సంచికలోని వ్యాసకర్త గారు మఱికొన్ని ప్రయోగములు చూపిరి. క్రొత్తగా వచ్చిన 'రేవణ' శబ్దమును పాఠకులు గ్రహింపకుండుటకే యీ వ్యాస ముద్దేశింపబడినది.

---

# రేవఁడు రేవణుఁడా?

శ్రీ కొడవంటి శంకరనరసింహబ్రహ్మం

చైత్ర సంచికలో నేను వ్రాసిన "రెంటికిం జెడిన రేవఁడు" అనే వ్యాసంపైని వైశాఖమాససంచికలో "రెంటికిం జెడిన రేవణ" అనే పేరుతో శ్రీ పోరుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దొక వ్యాసం వెలువడింది. ఆ వ్యాసాన్ని బట్టి చూస్తే "రెంటికీ చెడిన రేవఁ" డనే లోకోక్తియందలి 'రేవఁడు' పదము పురుషార్థబోధకమే కాని జడవాచకము కాదనియే శ్రీ శాస్త్రిగారి యభిప్రాయమైనట్టు తెలుస్తుంది. అయినా వారికి 'రేవఁడు' ప్రప్రథమంలో 'రేవణుఁడు' గా ఉండేవాడనీ, తరువాత దేవభాషలోనుంచి తెలుగులోకి దిగే సందర్భంలో కించిత్తు మార్పుచెంది 'రేవఁడు'గా పరిణమించాడనీ వ్రాశారు. భళితు. అతడు ప్రకృతిసిద్ధమైన రూపాన్ని త్యజించి వికృతి నందియుండెంగాక! ఈ రేవణుడు, తంత్రకారికలు రెండూ రాకపోవడంచేత, ఈ లోకోక్తికి భాజనమయ్యాడని ఊహించారు శాస్త్రిగారు. కాని వారి యూహ ప్రామాదికమని తలంస్తాను. మనుచరిత్రాంతర్గతపద్యం 'రేవణ' అనే అపపాఠంతో కొన్నిచోట్ల కనబడుతోం దని వ్రాయడంవల్ల రేవణ పదసామ్యాన్ని చూచి వారిట్టి భ్రమకు లోనయ్యా రనుకొంటాను.

నా క్రిందటివ్యాసంలో 'రేవఁడు' పదం రేగటి భూమి అనే అర్థంలో ప్రయోగింపబడలే దనడానికి నే నిచ్చిన కారణాలే ఏతత్పదం 'రేవణుఁ'డనే కుమారిల భట్టపాదుల శిష్యుణ్ణి తెలియజేయదని నిర్ధారించి చెప్ప డానిక్కూడా సరిపోతాయి.

ఆ లోకోక్తి వాడిన పద్యాలు మూడు క్రిందటి వ్యాసంలో ఇచ్చాను. కనుక మళ్లీ ఆ పద్యాల నిక్కడ పూర్తిగా ఎత్తివ్రాయడ మెందుకని తత్పద్యపాదాలను మాత్ర ముదాహరిస్తున్నాను:

"రెంటికిం జెడిన రేవఁడ నాదునె" (మనుచరిత్ర)

"రెంటికిం జెడ్డ రేవని రీతి యయ్యె" (జైమిని భారతము)

"రెండు పోనాడిన రేవనిరీతి" (హరిశ్చంద్ర— గౌరన)

మొదటి రెండు లక్ష్యాలలోను "చెడిన—చెడ్డ" అనే క్రియాపదా లున్నాయి. వాటి కర్థ మేమిటంటే: రేవఁడు స్వతస్సిద్ధంగా తొలుతనుండీ రెంటికీ కొఱ గానివాడు కాడనీ, తరువాత ఏ కారణంచేతనో అల్లా కావలసి వచ్చిందనీ. చెడిన — ఈ పద మంతకు పూర్వ ముండిన చెడని అవస్థను సూచిస్తోంది. ఇక మూడవ లక్ష్యంలో ఉన్న పోనాడిన అనే పదం అట్లు రెంటికీ చెడవలసి వచ్చుటకు హేతువు తనే, అంటే స్వయంగా రేవఁడే అని వ్యక్తపరుస్తోంది. ఈ చర్చవల్ల తేలే దేమిటంటే: రేవఁడు మొదట్లో రెంటికీ కొఱ గానివాడు కాడనీ (రెంటికిన్ = రెంటికీ అనడంలో ఒకదానికి కొఱగాకపోవడం పరిస్ఫుటమే కదా!), తరువాత తనయొక్క తెలివితక్కువవల్ల (బహుశః కొఱగానిదానికోసం ప్రయత్నం చెయ్యడంలో) రెంటికీ చెడవలసినవా డైనాడనీ. ఈ అర్థం చాకివాని కథకే బాగా సందర్భిస్తుంది. జైమిని భారతాశ్వమేధ పర్వంలోనూ, మనుచరిత్రలోనూ ఈ భావమే సరిగ్గా అతుకుతుంది, సందర్భానికి సరిపడుతుంది.

"ఉంవేకః కారికాం వేత్తి
తంత్రం వేత్తి ప్రభాకరః,
మండన స్తూభియం వేత్తి
నోభయం వేత్తి రేవణః"

అనే కారికలో దర్శనమిస్తూ ఉన్న రేవణుఁడు ఎంత రూపాంతరం పొందగలిగే కామరూపి అయినా ఈ లోకోక్తిలోకి రాలేడు. అథవా చొరవచేసి వచ్చినా ఆ క్రియాపద మాతణ్ణి అక్కడ నిలవనియ్యదు. రేవణు నికి రెండూ రాని మాట వాస్తవమే కావచ్చు. "నోభయం వేత్తి రేవణః". కాని అతని కందులో ఏ ఒకటైనా మఱోవిధంగా అయితే పట్టుపడే దన డానిగ్గాని, అతని కిల్లా రెండూ రాకపోవడాని క్కారణం అత డందులో రానిదానికోసమై యత్నించడమే అనడానిగ్గాని ఆధార మేదీ? "పాపం, ఎన్నేళ్లు శుశ్రూష చేసినా, ఎంతకాలం చదివినా ఈ రేవణున కేమీ తలకెక్కలేదు" అని శ్రీ శాస్త్రిగారే వ్రాస్తున్నారే! ఇంక అట్టి మట్టిబుఱ్ఱవాడైన రేవ ణుఁడు చెడినా డనడంలో అర్థం లేదు. ఇంతకూ, పోనీ, అతని కందులో ఒకటి వచ్చేదే అనుకొందాం, అప్పుడైనా రేవణుఁడు రెంటికీ చెడవలసి ఎందుకు వస్తుంది? తనకు రానిదాన్ని మొదట ఆరంభించా డను కొన్నా, అది ఇంక మఱి రాదని తెలిశాకైనా రెండోది చదువుకోవచ్చే! ఇంతకూ ఇల్లా జరగలేదు! కనుక రేవఁడు రూపాంతరగతుఁడైన రేవణుఁ డెంతమాత్రం కాఁడని సహృదయులైన విజ్ఞులే తెలుసుకోగలరు.

మఱొకటి చూడండి. సామెతలూ, జాతీయాలూ, లోకోక్తులూ జనసామాన్యాని కంతటికీ అర్థ మయ్యేటట్టుంటాయి. సంస్కృత లోకోక్తులూ మొదలైనవి సంస్కృతభాష బాగా చదువుకొన్న వారి కందరకూ తెలుస్తాయి. అదేమాదిరిగా తెలుగు సామెతలూ, లోకోక్తులూ సంస్కృతభాష తెలియని తెలుగువారికూడా సులభంగా తెలుస్తాయి. తెలుస్తా యేమిటి, తెలియాలి తప్పకుండా-అవి తెనుగులోకోక్తు లనిపించుకోవాలంటే. ఇది క్రొత్త విషయం కాదు కదా! అయితే, ఒక్క సంస్కృతంమాటైనా లేక, నిండు తెనుగుతనం వెల్లివిరుస్తూ ఉన్న ఈ "రెంటికీ చెడిన రేవఁ" డనే తెలుగులోకోక్తి ఒకానొక సంస్కృత కారికను పురస్కరించుకొని పుట్టిం దనడం అంత యుక్తియుక్తంగా కనబడదు. కనుక ఈ రేవఁడు రేవువా డనడమే రసగ్రహణ పారీణు లందరూ సమ్మతిస్తా రనుకొంటాను.

# జైలులో చెట్లు

శ్రీ కొడాలి ఆంజనేయులు



కఠిన పాషాణమయము ప్రాకారవలయ
ముదధి వేలాయితం బైన ఉర్వి·మాకు
దయకు పొలిమేర లెఱుగని ధన్యజీవు
లీ తరులకంటె మాకు స్నేహితులు లేరు.

వేసగి పవళ్ల కెదురయి వేసరిల్లి
మండు వడగాడ్పు తరగల మగ్గిమగ్గి
చివికిపోయిన బ్రతుకుల చివురుటాకు
వీవనల వీచి తేర్చు నీ వృక్షచయము.

నింగి నంటెడు నీ చెట్ల నీడలందె
పరువు తెలియని బందికాపరులు చక్ర
వర్తులో సార్వభౌములో వారి మగలో
అనగ నటియింతు రజ్ఞత కవధి గలదె?

పరుల కష్టాలపై ప్రభుత్వములు నెఱపు
పాడుజీవుల కాచిన పగటి పాప
మునకు రాత్రియంతయు శానముద్ర పూను
నీ మహోన్నతతరువుల కెంత యెఱుక?

ప్రకృతి నిద్రాప్రశాంత భావము వహింప
మూగనోములు నోచు నీభూరుహముల
మదుగులం దుండి మాకయి యొదిగి యొదిగి
చల్లని కటాక్షముల చూచు చందమామ.

స్వార్థ మెఱుగని ఈ చెట్ల అభ్యుదయము
చూచి అనుదినం బాశ్రయించుటయె కాని
ఆకు లూడ్చినప్పటి మోడు మ్రాకు లరసి
కంట తడిపెట్ట లేని నీ కటికిజనము.

భోగములు విస్మరించిన త్యాగధనుల
పూర్వగాథలు తెలిసిన పుణ్యతరులు
తూర్పు తొలిసంజ రేకలు తోచినంత
కోకిలాగానములు మేలుకొలుపు మమ్ము.

మోడుమ్రాకులు మాకళ్ల ముందు చివురు
పెట్టి మొగ్గదొడిగి పూచి పిందెవేసె
పాప మెఱుగని నిస్స్వార్థపరుల కిట్లె
మంగళపరంపర తనంత మఱలివచ్చు.

పుట్టి యెన్నాళ్లో కాని ఈ బొండుమల్లె
మొక్కలు వసంతసంధ్యలు పులకరింప
పూత పెట్టెను! ఖైదీల చేతిచలువో!
మొక్కల కృతజ్ఞతా పూర్వ పుణ్యకృతియొ!

జాతి గల లేతఆకుపసందు చెట్లు
సంజ అపరంజిరేకల సరసమాడు
కళను గ్రహియింపలేని సంస్కారహీన
జనములను పట్టి గడ్డిపోచలుగ [illegible]చి.






# వి మా న యు ద్ధ ము

౨

**విమానదాడులనుండి రక్షణ—విమాన విధ్వంసకపద్ధతి—పారచూటు సైన్యములు—భూనౌకా రణరంగములలో విమానముల తోడ్పాటు—వైమానికుల శిక్షణ**

= శ్రీ పింగళి వెంకటరామయ్య =

### విమానదాడులనుండి రక్షణ

విమానదాడులే నేటియుద్ధమునందు జయమును చేకూర్చుట కత్యావశ్యకములుగా పరిగణింపబడుచున్నవి. జనసామాన్యము యొక్క ధైర్యసాహసములను బాంబుల చేతను, విషవాయువులచేతను ఈ దాడులలో భంగపరచవచ్చును. ఇట్టి విమానదాడులనుండి అపాయములను జనసామాన్యమును రక్షించు భారము ప్రభుత్వముపై యున్నది. ఇందుకొరకు ప్రభుత్వమువారు విమానదాడి రక్షణ సంఘములను ఏర్పాటుచేసి వారికి ప్రత్యేకతర్ఫీదు నొసగుదురు. దేశమునంతను వివిధములగు విమానదాడి రక్షణజిల్లాలుగా విభజింతురు. ముఖ్యములగు స్థానములందు రక్షణాసైనికుల నేర్పాటు చేయుదురు. వీరు దూరదర్శని యంత్రముల సహాయముచేతను, దూరశ్రవణయంత్రముల సహాయముచేతను నిత్యము శత్రువులను కనిపెట్టుచు శత్రువిమానములు వచ్చుచున్నట్లు గోచరించిన తక్షణమే ప్రత్యేకములగు బూరాల నూదుదురు. ఇవి చాలదూరమువరకు వినిపించును. వెంటనే ప్రజలందరును దాడులనుండి రక్షించుటకు నిర్మింపబడిన సొరంగములలో దాగుకొని విషవాయువులు సోకకుండ శ్వాసయంత్రములను తగుల్చుకొనవలెను. దాడి పూర్తియయి స్థలమంతయు సురక్షితమైన తరువాత మరల బూరా నూదుదురు. అప్పు డందరును బయటకు వత్తురు. లండనులో విమానదాడుల రక్షణకేంద్ర కార్యస్థానము కలదు. ఇందు మంటలనార్పు సంఘము ఒక భాగము. ఇందు గోడలమీద లండనునందు మంటలనార్పు జట్టులు ఎచ్చటెచ్చట గలవో సూచింపబడియుండును. ఈ కార్యస్థానమునందు పనిచేయువారు ఆడవారు. లండనునం దెచ్చట బాంబుపడినను ఇచ్చటకు వెంటనే టెలిఫోనులో తెలియపరచెదరు. వెంటనే గోడమీదనున్న పటమునుండి బాంబుపడిన చోటునకు దగ్గరగా నున్న మంటలనార్పు జట్టును కనుగొని వారికి కార్యస్థానమునం దున్నవారు తెలియపరచెదరు. వెంటనే ఆజట్టులుపోయి మంటల నార్పుదురు. ఈకార్యస్థానమున్న ప్రదేశముమాత్రము పరమ రహస్యమైనది.

### విమాన విధ్వంసకపద్ధతి

శత్రువిమానములను పేల్చి కూల్చుటకు ప్రత్యేకములగు విమాన విధ్వంసక ఫిరంగులు ప్రతిదేశమునందును వాడుకలోనికి వచ్చినవి.

విమానవిధ్వంసకఫిరంగులను ప్రేల్చు సైనికులు ప్రత్యేకమగు తర్ఫీదును పొందెదరు. ఈ ఫిరంగులు మిక్కిలి పెద్దవగుటచేతను, వీనితో సహాయకరము లుగా నుపయోగింపబడు సాధనసామగ్రికూడ ఎక్కు వగా నుండుటచేతను ఈ విమానవిధ్వంసకసామగ్రి యంతయు రెండు పెద్దమోటారుకారులమీద అమర్చి యుందురు. ఈవిధ్వంసకఫిరంగులను ఎక్కడ అమర్చ వలెనో అక్కడకు ఈ రెండు మోటారుకారులును గంటకు ౪౦ మైళ్లవేగమున పోవును. ముందున్న మోటారుబండిమీద విమానవిధ్వంసక తుపాకిని ఒక పీఠముమీద అమర్చియుంచెదరు. ఇవి మూడంగుళముల వ్యాసముగల తుపాకులు ఇవి ౧౫ పౌనుల బరువుగల మందుగుండుసామగ్రి దట్టించబడిన గుండ్లను నిమిష మునకు ౧౫ వరకును వేయగలవు. రెండవ మోటారు బండిమీద మంటలనార్పు సామగ్రి, విద్యుజ్జనకయంత్ర ములు, మందుగుండుసామగ్రి, దూరదర్శనయంత్ర ములు, దూరశ్రవణయంత్రములు, వీని నుపయోగించు సైనికులు నుందురు. అవసరమగు స్థలమందు ఈతుపా కిని దింపి అమర్చి విద్యుచ్ఛక్తిమూలముగా దూరశ్రవణ, దూరదర్శనయంత్రముల నమర్చెదరు. మందుగుండు సామగ్రికూడ గొట్టములోనికి విద్యుచ్ఛక్తివలననే దట్టింప బడునట్లు ఏర్పాటులుచేయుదురు. ఏయే కార్యములకు నియోగింపబడినవా రాయాస్థలములం దుందురు. శత్రు విమానములను దూరశ్రవణయంత్రము గుర్తుపట్టిన తక్ష ణమే వెంటనే వాని స్థలమును లెక్కలుకట్టి స్థిరపర చె దరు. సెర్చిలైటులు విమానములమీద వేయుదురు. ఫిరంగులను గురిపెట్టి కాల్చెదరు. యుద్ధమునం దిది యంతయు మిక్కిలి తొందరగా జరిగిపోవును. సెకం డునకు రెండు గుండ్లు ప్రేలిపోవును. విమానవిధ్వంసక ఫిరంగుల కిరుప్రక్కలను రెండు ఛాయాగ్రహణయంత్ర ములు ప్రేల్చబడిన గుండ్లను ఛాయాచిత్రములు తీయు చుండును. వాని సహాయముచేత తప్పిపోయినగురిని సరిచేసికొనవచ్చును. సెర్చిలైటుల వ్యాసము ౬౦ అంగుళములుండును. వానివెలుతురు ౪౦౦,౦౦౦,౦౦౦ క్యాండిలుపవరుండును. వాని కాంతి ౫౦ మైళ్ల ఎత్తు నకు పోవును.



## పారచూటుసైన్యములు
## (గుమ్మటములు)

నేటి ఐరోపాయుద్ధమునందు పారచూటుసైని కుల ప్రాముఖ్యమును జర్మనులు ఎక్కువగా కనిపెట్టి యున్నారు. పారచూటులను విదేశములందు దింపుటకు విమానము లవసరము. పారచూటుసైన్యదళమునందు ఒక్కొక్కదానిలో ౨౫-౩౬ సైనికు లుందురు. ఈ దళములు పెద్దపెద్దవిమానములలో అవసరమగు స్థలము లకు పోయి అచ్చట దూకుదురు. ఈ సైనికులు శత్రుసైన్యములకు వెనుక దిగి విమానాశ్రయములను పట్టుకొనుట, చిన్నచిన్న శత్రుసైన్యములను ఎదుర్కొ నుట, స్వసైన్యములకు దారిచేయుట మొదలగు పనులు చేయుదురు. పారచూటుసైనికులు శత్రుదేశమునందు వంతెనలు పాడుచేయుట, టెలిగ్రాఫు, టెలిఫోను తీగెలను ధ్వంసముచేయుట, ప్రజలలో బీభత్సముకలుగ చేయుట మొదలగు కార్యములను నెరవేర్తురు. పార చూటుసైనికులుగా పనిచేయుటకు శారీరకముగను, మానసికముగను పటుత్వము గలవారు మాత్రమే కావ లెను. పారచూటుసైనికులకు ప్రత్యేకముగ శిక్షణ నొసగు దురు. మొట్టమొదట వివిధములగు పల్లటీలు మొగ్గలు వేయుట, క్రమముగా బల్లపైనుండియు, గోడపై నుండియు, గోపురముపైనుండియు దూకుట అభ్యసిం తురు. తరువాత తక్కువ వేగముతో పోవుచున్న విమా నము మీదనుండి ౪౦౦౦ అడుగులయెత్తునుండి దూకుట అభ్యసింతురు. తరువాత తక్కువఎత్తులలో ఎక్కువ వేగ ముగా పోవుచున్న విమానములనుండి దూకుట అభ్య సింతురు. శిక్షపూర్తియగుసరికి ఎంతఎత్తునుండి ఎంత వేగముగా పోవువిమానమునుండియైనను దూకుటకు సిద్ధ ముగానుందురు. ప్రతిసైనికునకును తుపాకి, టార్చి, దొంగతనమునకు పనికివచ్చుఆయుధములు, సైకిలు కూడ ఉండును. పారచూటు ఉత్తమమగు జపాను సిల్కుతో చేయబడును. ఒక్కొక్కదాని ఖరీదు ౩౭౫౦ రూపాయ లగును. జర్మనులు రెండురక ముల పారచూటుల నుపయోగింతురు. మొదటిరకము నందు పారచూటు విమానమునకు తగిల్చియుండును. సైనికుడు దూకి విమానమునకు ౧౫౦ అడుగులు క్రిందకు

పోవువరకు పారచూటు ఊడిపోవును. రెండవరకము నందు పారచూటు సైనికుని వెంటనున్న పటకాకు తగల్చబడును. సైనికుడు దూకిన తరువాత తన ఇచ్ఛ వచ్చినప్పుడు పారచూటును విప్పుకొనవచ్చును. జర్మను సైనికులు భూమిమీద ౨౫౦–౩౫౦ అడుగుల ఎత్తువరకు దిగినతరువాత తమ పారచూటులను తెరచెదరు. పారచూటును తెరచుటకు మూడు సెకండ్లు మాత్రమే పట్టును. పారచూటు తెరచియున్నప్పుడు సైనికుని వేగము సెకండుకు ౧౬, లేక ౧౭ అడుగు లుండును. విమాన యుద్ధమునందు బెల్జియము, హాలెండులలో పారచూటు సైనికుల పద్ధతినే ఎక్కువగా జర్మను లుపయోగించిరి.

## భూ, నౌకారణరంగములలో విమానముల తోడ్పాటు

ప్రత్యేకముగా విమానయుద్ధమునందు మాత్రమే కాక భూరణరంగమందు కాల్బలములకును, నౌకారణరంగమందు నావికులకును విమానము లెక్కువగా సహాయపడుచున్నవి. శత్రువుల స్థానములను, కోటలను ఛాయాచిత్రములను తీయుట, శత్రుస్థానములపై భారు తుపాకులను గురిపెట్టుటయందు సహాయము చేయుట, ఎదుర్కొను శత్రుసైన్యములపై బాంబులువేయుట, శత్రువుల టాంకులమీదను, తుపాకుల మీదను బాంబులు వేసి వానిని ధ్వంసముచేయుట, స్వసైన్యములలో వార్తల నొకచోటినుండి మరియొకచోటికి కొనిపోవుట, స్వసైన్యములకు ఆహారపదార్థముల నందజేయుట మొదలగు కార్యములందు కాల్బలములకు విమానములు తోడ్పడుచుండును. ఇందుకు లైసాండరు విమానములను విరివిగా నుపయోగించెదరు. ఆటోగైరోలు కూడ ఎక్కువ ఉపయోగకరములుగా నుండును. శత్రుస్థానముల ఛాయాచిత్రములను తీయుటకు విద్యుత్తువల్ల తనంతట తానే పనిచేయు యంత్ర ముండును. విమానము తిన్నగా ప్రయాణము చేయుచున్నపుడు ఈయంత్రము తిరుగుచు వరుసగా ఛాయాచిత్రములను తీసివైచును. విమానాశ్రయమునకు వచ్చిన తరువాత వానిని వరుసగా చేర్చి చిత్రపటములను తయారుచేసి వాని సహాయముచే భారుతుపాకులను గురిపెట్టగలుగుదురు. వైమానికదళము శత్రుస్థానములపై నెగురుచు రేడియో సంజ్ఞలవల్ల స్వసైనికుల తుపాకులకు సలహాల నొసగుచుండును. ఆధునికయుద్ధమునందు విమానసహాయము లేనిచో కాల్బలములు యుద్ధమే చేయజాలవని చెప్పవచ్చును.

ఆధునిక నౌకాయుద్ధమునందును విమానబలము యొక్క సహాయము లేనిచో జయము చేకూరదు. ముఖ్యముగా విమానములు తీరములందు గస్తీతిరుగుచు తీరరక్షణ సైనికులకు శత్రువుల విమానముల రాకగాని, నౌకల రాకగాని తెలియపరచును. స్వదేశపు యుద్ధ నౌకలకును, వర్తకపు ఓడలకును శత్రువుల నౌకలవల్ల గాని, విమానములవల్లగాని అపాయము కలుగకుండ కాపలాకాయుచుండును. శత్రునౌకలు కాన్పించినచో వానిపై బాంబులనేకాక, టార్పెడోలనుకూడ ప్రయోగించి వానిని ముంచివేయును. అంతియేకాక నౌకా యుద్ధములలో శత్రువులఓడల మీద స్వంతఓడలు తుపాకులను గురిపెట్టుట కెక్కువగా విమానములు సహాయపడును.

విమానములను కొనిపోవు పెద్ద నౌకలు (Air-craft-carriers) నిర్మింపబడుచున్నవి. ఈ ఓడల యొక్క టాపుభాగమంతయు టేకుచెక్కతో చేయుదురు. ఒక్కొక్క ఓడమీద ౬౦ మొదలు ౯౦ విమానములవరకు తీసికొనిపోవచ్చును. ఎండకును, వానకును కూడ విమానములు ఆరుబయటనే యుండును. విమానములన్నియు రెండుమూడు వరుసలలో ఒకదానివెనుక మరియొకటి నిలువబడియుండును. పైకెగురవలసి వచ్చినప్పుడు విమానము బ్రేకులను తీసివైచి ఇంజనులను సిద్ధముచేసి ఆజ్ఞలువచ్చినతక్షణమే ఒకదాని వెంబడి మరియొకటి ఎగిరిపోవును. ఓడమీదకు కూడ ఒకదానివెంబడి మరియొకటి దిగిపోవును. ఓడమీద విమాన విషయములందు నిపుణుడగు చోదకుడు నిలువబడి పచ్చని జెండాలతో సంజ్ఞ లొనర్చుచు దిగు విమానములకు దారిచూపుచుండును. ఈ ఓడలమీదనుండి ఈ విమానములు ఎగురుచు నౌకాయుద్ధమునం దెక్కువ సహాకారకములుగా నుండును.

## వైమానికుల శిక్ష

వైమానికుల శిక్ష మిక్కిలి కష్టమైనది. ఈశిక్షయందు శాస్త్రజ్ఞానముకూడ ఎక్కువగా నభ్యసించవలెను. ఈ శిక్షయందు వివిధభాగములు కలవు. చోదకుల తర్ఫీదు, యంత్రజ్ఞుల తర్ఫీదు, బాంబరుల తర్ఫీదు, పోట్లాటసైనికులుగా తర్ఫీదు-ఇట్లే వివిధవిషయములను నేర్చుకొనుటకు ప్రత్యేకముగా శిక్షణొసగబడును. విమానపు విద్యయందు పై సెన్నుపొందుటకు నేలమీది విషయములనుగూర్చి యొక తరగతియు, వాయు, వాతావరణస్థితులనుగూర్చి యొక తరగతియు నుండును. నేలమీది విషయములనుగూర్చిన తరగతియందు మొత్తము ౪౨ గంటలు శిక్ష నభ్యసించవలెను. ఇందు విమానముల చరిత్ర, శాస్త్రవిషయములు, సివిల్ ఏరో నాటికల్ అథారిటీవారి నిబంధనలు, యంత్రముల విషయములు, రేడియో, పారమాటువిషయములను బోధించెదరు. రెండవ తరగతియందు మూడుభాగముల శిక్ష యుండును. మొదటిభాగమందు నేలమీదనే విమానములందలి మరలను గూర్చియు, నడుపుటను గూర్చియు బోధించెదరు. రెండవభాగములో విమానమును గాలిలో నడుపుచు బోధకుడు విద్యార్థికి వివిధ విషయములను చూపును. తరువాత విద్యార్థి తానే బోధకుని సహాయముచే నడుపును. తరువాత స్వతంత్రముగా నడుపగలుగును. తరువాత గాలిలోనికి ఎగురుట, నేలమీదకు దిగుట, వలయములలో తిరుగుట, వాయు ప్రవాహముల నెదుర్కొనుట, పోట్లాడుట మొదలగు యుద్ధవిషయములందు ప్రత్యేకమగు తర్ఫీదు నొందును.

విమానయుద్ధములందు మిక్కిలి కష్టములైన విషయములను నెరవేర్చవలసిన విమానదళములను నిర్వహించుట మిక్కిలి కష్టమైన పని. విమానదళముల నిర్వహణమునకు ప్రత్యేకమంత్రులు ప్రతిప్రభుత్వమునకును ఉందురు. వారిక్రింద వివిధకార్యవర్గములుండును. ఇవన్నియు సహకారముగా పనిచేయుచు విమానయుద్ధములందు విజయమును చేకూర్చుటకు ప్రయత్నించుచుండును. ఆధునికయుగమున విమానయుద్ధమే పూర్తియగు జయమును చేకూర్చుట కాధారము. విమానబలము తక్కువగా నున్న దేశము అపజయమును పొందితీరును.



# ప్రథమ శిక్షణ

[ కథానిక ]

= శ్రీ రుక్మిణీనాథశాస్త్రి =

"రామం!"

"ఓ"

క్షణంలో రామం మంచంమీదించి గంతేసి లేచాడు. అప్పటికి గంటనుంచీ మేలుకొని, మంచానికి మారుమపలుతూ అమ్మ ఎప్పుడు పిలుస్తుందా అని ఎదురు చూస్తున్నాడు. రాత్రిఅంతా అప్పుడప్పుడు మెలుకువ వొస్తూనేవుంది. ఇందాకా అమ్మ లేవడం, వంటఇంట్లోకి వెళ్లడం, వాళ్లనాన్న ఇంకొంచెం సేపటికి ఊతంగా నడుస్తూ అటుకేసి వెళ్లడం, పడమటింట్లో ఏవో అస్పష్టంగా మాటలు, మధ్య గుసగుసలు, తన్నుగురించే అయి వుండాలి—మాట్లాడుకుంటూ ఉండటం, అంట్లూ అవీ బయటవేసిన చప్పుడు, అమ్మ ఇల్లూడ్చి, అలికి, ముగ్గేసి, పొయ్యి రాజేసి, నీళ్లకాగు పొయిమీద పెట్టడం, నాన్న నూతిదగ్గర గబగబా స్నానం చెయ్యడం, అమ్మ స్నానం చెయ్యడం—అన్నీ రామం ఆలకిస్తూనే ఉన్నాడు; గమనిస్తూనే ఉన్నాడు.

"రామం!"

"ఓ!"

వాళ్ల అమ్మ పిలవడంతోనే అతను మహోపదునుగా 'ఓ' అన్నాడు, చాలా ఉత్సాహంతో. వాళ్ల అమ్మ రామాన్ని పిలిచి గుమ్మం దాటకముందే లేచి, చెదిరిపోయిన బట్ట సరిగ్గా కట్టుకుని, వాళ్ల అమ్మ పడమటింటి దగ్గరకు వెళ్లేప్పటికి తనూ అక్కడకు వెళ్లాడు.

"చాలా పెందరాళే లేచావే" అంది అమ్మ. ఇన్నాళ్లూ అయిదారు సార్లన్నా పిలిస్తేనేగాని, కసురుకుంటేనేగాని రామం మంచంమీద కదిలేవాడన్నా కాదు; విసుక్కున్నాకగాని లేచేవాడు కాదు; కోప్పడితేనేగాని చద్దన్నం తినేవాడు కాదు. బళ్లోకి వెళ్లడానికి ప్రతిరోజూ అల్లరీ, ఆగమూ!

రామం ఇవాళనుంచీ బళ్లోకి పోడు. ఆ పాడు చదువు గుంటపూలు పూసింది. రోజూ పొద్దున్నే, హాయిగా నిద్రపట్టేవేళ లేవాలి; రైలుకల్లినట్టు బళ్లోకి వెళ్లాలి. బళ్లోకి వెళుతూ వెళుతూ రామం సున్నంగొట్టినా, పాతకథలను చెప్పే గోడలను రాచుకుంటూ, ఆ కథలను చదువుతూ, కొత్తకథలు కల్పించి రాస్తూ, సీమసున్నంగుద్దలు, పెనపట్లు, చాకులు పారేస్తూ, కొత్తవి తెస్తూ, రోజు కో పెన్సిలుచొప్పున అరిగిస్తూ, లాగూలూ చొక్కాలూ ఎప్పుడూ మాపిచింపుతూ, తండ్రీ తల్లీ బలవంతంగా జడవేసి, బొట్టు పెట్టడం, స్కూల్లోకుర్రాళ్లు ఎక్కిరించడం, అక్కడా ఇక్కడా ఏమీ అనలేక ఉడుకుమోతుతనం రావడం, లాగూ పీటముడి వేసుకుని, వేళకు అది రాక, బొందు కోసేసి, మొలతాడుతో దాన్ని కట్టి, పాఠాలు సరీగ్గా రాక, గోడిబిళ్ల బలిచెడుగుడు ఆటల్లో చేర్పు క్లాసులో చూపక, మాస్టర్ల మొట్టికాయలదగ్గరనుంచీ చివాట్లదాకా కంట్రాక్టుపుచ్చుకున్న కుర్రాడా రామం ఇవాళ? కాదు. ఇన్నాళ్లూ అతను పుస్తకాలను మోసుకుంటూ బళ్లోకి పోయే కుర్రాడు. ఇవాళ అతను ఓ పెద్దమనిషి. జీవితంలో ప్రవేశిస్తున్నాడు. రామం శ్రద్ధగా లేవడం అదీ చూచి, వాళ్లఅమ్మ 'కొత్త బులబాటం' అని, తనలో తాను చిన్ననవ్వు నవ్వుకుంది. రామం ఏమీ బదులు చెప్పలేదు. మొహం కడుక్కున్నాడు. స్నానం చేశాడు. పిలక ముడెయ్యకుండా జుట్టుచివర దూముడివేసి వదిలాడు. పడమటింట్లో ఆరేసిన బట్ట అటూ ఇటూ కుచ్చెళ్లుపెట్టి కట్టుకున్నాడు. విభూతి పెట్టుకున్నాడు. ఆరేసిన అంగోస్త్రం కట్టుకున్నాడు. పైన ఉత్తరీయంవేసుకున్నాడు. వాళ్ల అమ్మ, "ఏంరా కొంచెం మంచిమాట* చేసుకు

---

* పిల్లలు ఎక్కడికన్నా పొద్దున్నే వెళుతూన్నప్పుడు "భోంచేసి పోతావా" అనడానికి "మంచిమాట చేసుకుపోతావా" అనేది పర్యాయపదం. ఇందులో వోవిధమైన చాటూ వుంది.

పోతావురా!" అంది. రామం అయిష్టంగా 'ఊఁ హూఁ' అన్నాడు. వాళ్లనాన్న ఇన్ని మజ్జిగ తాగి, వాకిట్లోకి వొచ్చాడు. రామం గూడా ఇన్నిమజ్జిగ తాగి వాకిట్లోకివొచ్చాడు; వాళ్లనాన్నను కలుసుకు న్నాడు.

" ఇహ వెళదామా ?" అన్నాడు నాన్న.

" ఊఁ " అన్నాడు నెమ్మదిగా రామం.

రామంతండ్రి నల్లగా, భారీగా ఉంటాడు. గడ్డం మీసం బాగా పెరిగి, పెద్దతలా అరనూ— కొట్టొస్తూ ఉంటాడు. అంగోస్త్రం నడుముకుచుట్టి, పీభూతీ, కనుబొమ్మల్లో కుంకుమా పెట్టి, చెవులకున్న రుద్రాక్షపోగులు కదులుతూండగా, "ఊఁ, తెములూ" అన్నాడు. రామం ఏమీ అనకుండా నుంచున్నాడు.

" ఇంట్లోకి వెళ్లిరా " అన్నాడు వాళ్లనాన్న. తను నోరు ఎత్తితే నాన్న ఏమంటాడోనని, రామం, కిక్కురుమనకుండా వంటింట్లోకి వెళ్లాడు. అమ్మ కూచుని చాటలో బియ్యం బాగుచేస్తోంది. రామం కనిపించి "అమ్మా!" అన్నాడు. తల్లి "ఏం నాయనా, ఇంకొసిని మజ్జిగ తాగుతావా " అంది. వాళ్లనాన్న సావిట్లోకి వొచ్చాడు. రామం పస్తు గిన్నెలో మజ్జిగ గుటగుటా తాగి మూతితుడుచుకుని నుంచున్నాడు.

" మంచిగా బుద్ధిమంతుడుగా ఉండమ్మా. నాన్న ఎలా చెప్తే అలా చెయ్యి " అంది వాళ్ల అమ్మ.

" అలాగే " నని రామం సావిట్లోకి వొచ్చాడు. తండ్రీ కొడుకు లిద్దరూ బయటికి వొచ్చేశారు.

ఇంకా తన్ను ఫదేళ్లకుర్రాడికింద కట్టేసి "బుద్ధిమంతుడుగా ఉండూ" అంటుందేం అమ్మ ? పాడిన పాటేగా ఇది? బళ్లో పుస్తకాలు పారేసుకుని, తను తిట్టగా, కుర్రాళ్లు తన్ను మాటలతో ఏడిపించగా, అది తాను తల్లికి ఏడుస్తూ చెప్పినప్పుడు " బుద్ధిగా ఉండు నాయనా, అల్లరిమూకతో నీకెందుకు" అన్నట్లు యిప్పుడూ అంటుందేం ? దాని గోలే దానిది. తాను పెరిగి పెద్దవాడైనాడు. బడీ, కుర్రాళ్లూ, మాస్టర్లూ అందర్నీ కాచి వడపోశాడు. మంచిగా ఉండాలని తనకు మాత్రం తెలీదా, తానుమాత్రం మంచిగా ఉండడా ?

రామమూ, వాళ్లనాన్నా సందులోకి వొచ్చారు. వాళ్లనాన్నతోపాటు నడుస్తున్నా డన్నమాటేగాని చాలా ఉత్సాహంతో గబగబా అడుగువేస్తూనే ఉన్నాడు. తండ్రీకొడుకు లిద్దరూ మాట్లాడకుండానే నడుస్తున్నారు. కాని, ఇతనితో చదివిన స్కూలు కుర్రాడు కనిపిస్తే రామం పెద్దవాళ్లు పరిచయ మందహాసం చేసినట్లు తానూ. నవ్వాడు రామం తాను చాలా ముఖ్యంగా భావిస్తున్నాడు ఈ రోజును. ఇవాళ తాను ఓతరహా పెద్దమనిషై తానూ సంపాదించుకో బోతున్నాడు. ఇవాళ తన జీవితంలో ఓ కొత్త అధ్యాయం, ఘట్టం. దీనికోసమే అతను ఎదురు చూస్తున్నాడు. రామంకూడా తండ్రిలాగే వైదీకంలోకి పోతున్నాడు, తండ్రి అజమాయిషీకింద. రామం సభాపతినరసన్నగారి కుమారుడు. తన్ను చూడగానే అక్కడివాళ్లందరూ సభాపతిగారి అబ్బాయిగనుక, కాబోయే సభాపతిని చూసి, వినయంతో, ప్రత్యేకంగా 'ఏమండీ' అంటారనీ, తానుమాత్రం సౌమ్యంగా, టెక్కు చెయ్యకుండా, వారితో సమానంగా 'ఏమండీ' అనాలనీ, కలిసిమెలసి సంచరిస్తాననీ అనుకున్నాడు.

రామంతండ్రి నడుస్తూనడుస్తూ ఆగి రొండినున్న పొడుంకాయ తీసి, దాన్ని చుట్టూ నిమిరి, ఎడం అరిచేతిలో ఇంతపోసుకుని, బిరడా దానికి పెట్టి, పొడుం పట్టుపట్టి మిగతాది దులిపి, కుడిచేతిపట్టును ముక్కుల్లోకి ఎక్కించాడు. విదిలించిన పొడుం రామం కళ్లల్లో పడ్డది. రామం ఉక్కిరిబిక్కిరి అయి, తల వెనక్కు ఆడించి కళ్లు నులుపుకుని, ఉత్తరీయంతో నీళ్లుకారే కళ్లు తుడుచుకున్నాడు. తండ్రి త్వరున చీది, ఇదేమీ గమనించకుండానే నడుస్తున్నాడు.

చుట్టుప్రక్కలనున్న ఇళ్లవాకిళ్లల్లోని జనం, తనకు ఎదురుబదురుగా తారసిల్లుతూన్న ప్రజ, ఈ నాడు సభాపతిగారి కొడుకుగారు వైదికవృత్తిలోకి తండ్రితోకూడా పోతున్నారని అనుకుంటూన్నట్లు రామం భావించాడు.

కొంతదూరం నడిచి నడిచి ఓ పెద్దభవంతిలోకి ఇద్దరూ వెళ్లారు. అంతకు ముందు అక్కడ సావిట్లో పోగైన జనం రామంతండ్రిని చూడగానే ఏం నరసన్నా అంటే ఏం నరసన్నా అన్నారు. సభాపతిగారని గౌరవం చెయ్యకుండా ఇలాపిలుస్తారేమని రామం చిక్కుపడ్డాడు. సభాపతిగారినిగూడా, సామాన్యుడుగా "ఏం నరసన్నా" అని పిలవడం ఏం మర్యాదగా అతనికి తోచలేదు. ఇద్దరు ముగ్గురుగా తనతండ్రిని తీసుకుని బైటకు పోతూవుండటం, వొస్తూవుండటం, పొడుం పీలుస్తూ కబుర్లు చెప్పుకుంటూ వుండటం చూసి, రామం, తను వాళ్లతో పూసుకుని తిరగాలో, వోమూల వొదిగి కూచోవాలో తెలీక మీనమేషాలు లెక్కపెడుతూ కూచున్నాడు. ఎవడో వచ్చి, "ఒరే అబ్బాయి, నీ ఉత్తరీయం అక్కడ పెట్టుకోవో" అన్నాడు. తనను—సభాపతిగారి అబ్బాయిని, ఎవడో వచ్చి"ఏంరోయ్ అబ్బాయి" అనడం నామోషీగా కనబడింది. చిన్న చిరునవ్వు నవ్వుతూ ఉత్తరీయం తీసి అక్కడ పెట్టాడు. "పౌరోహిత్యం చేయిస్తావుట్రా అబ్బాయీ" అన్నాడు అవతలివాడు. రామం నవ్వుతూ 'ఔను' అన్నాడు.

రామం అంతటా కలియచూశాడు. వాళ్ల నాన్న ఓచోట నిలబడి, హంగామాగా పెద్దగొంతుకతో, "మీరు మీరు అభిషేకాలకు శివుడిగుడికి వెళ్లండి" అంటున్నాడు. "మీరుమీరు సూర్యనమస్కారాలు. మీరు మీరు మీరు తర్పణ" అంటున్నాడు. "మీరు మీరు మీరు హోమానికి" అంటున్నాడు. ఎవరిదారిన వారు తమ తమ ఉత్తరీయాలూ, అంగోస్త్రాలూ పైన వేసుకోడం చూచి, తాను తండ్రికేసి చూచాడు. తండ్రి, రామాన్ని "ఇలా రా" అన్నాడు. రామం వెళ్లాడు.

రామంతండ్రి రామాన్ని వెంటేసుకుని శివుడి గుళ్లోకి తీసుకెళ్లాడు. అక్కడ రామంతండ్రి ఎవరితోటో బాతాఖానీ కొడుతున్నాడు. వాటిమీదా, వీటిమీదా ఆడిపోసుకోటం ఆకబుర్లు.

మధ్య రామాన్ని చూసి, "స్నానం చెయ్" అన్నాడు తండ్రి.

రామం నూతిదగ్గరకు వెళ్లాడు. అక్కడ ఎవరూ లేరు. స్నానానికి ఒకరిద్దరు లేవబోతున్నారు. వాళ్ల దగ్గరకు వెళ్లాడు రామం. మాసిన మురికిబట్టలూ, కుళ్లు అంగోస్త్రాలూ వాళ్లూ కూచుని, వాడింట్లో ఇట్లా వీడింట్లో ఇట్లా అని అంటున్నారు.

ఒకాయన పొన్నకాయలాగా కూచుని తెల్లని బియ్యప్పిండితోనూ, కుంకుమతోనూ ఆడదానికంటె చక్క చక్కగా ముగ్గులు పెట్టి, మధ్యన రాగిచెంబు పెట్టి, ముందు దర్భాసనం పరిచి, ఆరేసిన ఉత్తరీయం చక్కగా దిండులా మడిచి, దానిమీద పెట్టి 'తేజసా-భా-ని' అంటూ సూర్యనమస్కారాలు తీస్తున్నాడు. ఇంకో ఆయన గడ్డం అతనూ తావళం తిప్పుతూ కునికిపాట్లు పడుతున్నాడు. ఒకాయన శివుడి లింగానికి పూలు పూజచేసి, పూలు పోతాయనైనా చూడకుండా పెత్తివ నీళ్లు ధారగా పోస్తున్నాడు.

రామం స్నానానికి తొందరపడుతున్నాడు. తండ్రి ఏం కోప్పడతాడో అని. తన తండ్రి అల్లాగే కబుర్లతో మునిగితేలుతున్నాడు. ఇందాకణ్ణించీ బద్ధకించిన కుర్రాళ్లు లేచారు. రామమూ లేచి దబదబా స్నానంచేసి, ధోవతీ, ఉత్తరీయం ఆరేసి, అంగోస్త్రంలో లోపలికి వొచ్చి, విభూతి రాచుకుని, తండ్రికి కనిపించాడు. తండ్రి రామాన్ని "హోమం దగ్గరకు పో" అన్నాడు. గుళ్లో ఓమూల హోమాలు చేస్తున్నారు కొందరు. రామం వెళ్లి కనిపించగానే ఒకడు లేచి, నెయ్యిదగ్గర కూచోపెట్టి, 'స్వాహా' అన్నాడు. నెయ్యి ఇంత పోస్తావుండమన్నాడు

రామం ఒప్పుకుని, ఖాళీఅయిన పీటమీద కూచుని స్రుక్ స్రువాలు తీసుకుని స్వాహా అన్నప్పుడల్లా పట్టుదలగా నెయ్యి పోస్తున్నాడు. ఇంకోడు మంత్రాలు చెప్తున్నాడు. మిగతావాళ్లు స్వాహా అనిమాత్రం అంటూ, నెయ్యితో తడిసిన ధాన్యం వొకడూ, సమిధలు వొకడూ హోమ గుండంలో పోస్తున్నారు. రామంగూడా నాలుగైదు సార్లయినాక, మంత్రంచెప్పేఆయనను గమనించి, తానుగూడా స్వాహా అంటూ నెయ్యి పోస్తున్నాడు. అగ్నిహోత్రుడు పాములా లేచి ఆడు

తున్నాడు. రామం మంత్రం చెప్పే ఆయన ముఖం చూట్టం మాత్రం చూస్తూ నెయ్యి పోస్తుండడంవల్ల అగ్నిహోత్రుడి అర్చి తాకి రామం చెయ్యి వేలు కమిలింది.

ఇంకొంచెంసేపయ్యేసరికి వాళ్లు ఉన్న సమిధలూ, ఉన్న నెయ్యీ, ఉన్న ధాన్యం అంతా పోసి, ఒక్కసారి లేచారు. రామమూ లేచాడు. రామం తండ్రి వరసన్న వొచ్చి, వాళ్లను కూకలేసి, 'పూర్ణాహుతి' అని అరిచి, రామాన్ని తర్పణలోకి పొమ్మన్నాడు. కుంకం, పాలూ, పసుపూ, నీళ్లూ అవీ కలిపి, ఓ బిందెలోంచి చెంబుల్లోకి పట్టుకుని, ఓ పెద్దపళ్లెంలో పదిమంది, "లక్ష్మీనారాయణం తర్పయామి తర్పయామి" అంటూ ఉద్ధరిణతో పోస్తున్నారు. రామమూ. "తర్పయామి, తర్పయామి" అంటూ పోశాడు. బిందె అయిపోయాక వాళ్లూ లేచారు. రామానికి ఓమూలనించి ఆకలవుతోంది. నాన్న చెబితే, ఏమంటాడోననీ, అందరిలాగే తనూ అనీ ఆకలిని తొక్కిపట్టి తిరుగుతున్నాడు.

రామం యాదాలాపంగా సుళ్లో వంటపాక దగ్గరకు పోయాడు. తండ్రి స్నానంచేసి ఎవరితోనో మళ్లీ మాటల్లోకి దిగాడు. రామంమాటే ఎత్తలేదు. రామం వంటపాకదగ్గరికి వెళ్లేప్పటికి అది సెగలూ పొగలూ కక్కుతోంది. పెద్ద గాడిపొయ్యి. కణ కణ కణలాడుతూ ఎర్రగా ఉంది. పెద్ద గుండిగల్తో అన్నం వార్చేశారు. కూరవండేశారు. పులుసుపొయ్యిమీదఉంది. పచ్చళ్లూ, అవీ ఓమూల తట్టల్లో ఉన్నై. గోకర్ణాలు, పచ్చడి బండలు, ఓమూల పెద్ద తట్టల్లో లడ్లు, ఇత్తడి చాటలు, నేతిఝారీలు, విస్తళ్ల కట్టలు, ఇత్తడి గ్లాసులు, కొట్టిన ఉప్పూ, కారం, తిరగమోతసామానూ, అదీ అంతా చాలా గమ్మత్తుగా ఉంది. ఇంద్రధనుస్సులా అన్నిరంగులూ పరిమళిస్తున్నై.

ఇంతలో ఒక్కసారి అందరూ, "దానాలు, దానాలు ఇస్తున్నారు" అని అరిచారు. రామానికి దానాలేమిటో బోధపడ్లేదు. ఏమిటని అడగటానికి తన తండ్రి అక్కడ లేనేలేడు. వడ్ని అడగటం మరి...? ఎవడ్ని అడిగినా, సభాపతిగారి అబ్బాయికి యీమాత్రం తెలీదా అంటారేమో...అందరూ కాకుల్లాగా చప్పచప్పన ఎవరిదారిన వారు లేచిపోయారు, సూర్యనమస్కారాల శాస్త్రిగారూ వంటింట్లో వంటాయనా తప్ప. వంటాయన రామాన్ని పిలిచి, "నాయనా, దానాలిస్తున్నారట, నేపోయి వొస్తాను. ఇక్కడ కాస్త వుంటావా?" అన్నాడు.

రామం "అలాగే" అన్నాడు హుందాగా.

"అంతా అయిపోయింది. పులుసుమాత్రం కాగుతోంది, పొంగురాకుండా కాస్త చూస్తూ ఉండు. నిమిషాల్లో వొస్తాను." అని ఆయన అంగోస్త్రం విడిచి, ఆరేసిన బట్ట కట్టుకుని, ఉప్పూకారం రాయగా అవి అంటుకున్న అంగోస్త్రాన్ని నూతిదగ్గిర ఝాడించి పైనవేసుకుని వెళిపోయాడు.

రామానికి ఓమూలనించి ఆకలి మండిపడిపోతోంది. లడ్లు రెండు తీసుకు తింటే ఎవరు కాదన్నారు? రామానికీ తినాలని ఉంది. కాని, ఇంట్లో అయినా అమ్మకు చెప్పందే రామం ఏదీ తీసుకుని తిని ఎరగడు. పైగా ఎవరూ లేనప్పుడు, తనకు పెత్తనం ఇచ్చినప్పుడు తాను తింటాడా? దొంగతనం కాదా అది? గంగాళంలో మంచినీళ్లు ఇన్ని తీసుకుని తాగాడు. మళ్లీ తాగాడు. కళపెళా కాగి అవిర్లు వొస్తూ, సువాసనతో, కరేపాకూ కొత్తిమీరా, పచ్చిమిరపకాయలతో ఉడికిన పులుసు ఎన్నోరంగుల్లోకి మారి తేనెలాగా తయారై నేనంటే నేనని ముందుకొస్తోంది. దానాలవాళ్లు ఒక్కొక్కరే వొస్తున్నారు. పులుసు కట్టలు తెంచుకుని వొచ్చే వరదలాగా పొంగుతోంది. ఏం చేస్తే ఈ పొంగు రాదో తెలీదు. అమ్మ, పొయికింద మంట తగ్గిస్తుంది. ఈ గాడిపొయ్యి మంట తగ్గించే దెట్లా? కలియ పెడుతుంది అమ్మ. కలియపెట్టడానికి, ఆ దయ్యపుగరిటెలు రామం ఎత్తగలిగితేనా? అమ్మ, కొన్ని పొంగురాకుండా ఉండటానికి ఉప్పువేస్తుంది. రామం దోసిళ్లతో ఉప్పు తీసి పులుసుకళాయిలో వేశాడు. వేశాక, వెయ్యగూడదేమో, తప్పేమో, ఆయన ఉప్పు వెయ్యమనలేదే అనుకుంటూ పులుసుకేసి చూస్తున్నాడు. వెనకనించి ఎవరో మొట్టికాయలు మొట్టారు. గతుక్కుమని వెనక్కు తిరిగిచూడగా నవ్వుకుంటూ అటు పోతున్నాడు

తనతండ్రి. అందరూ దావాలు పుచ్చుకుని వొచ్చారు. మిగతా జనం ఎవరో గోడ్లమీద అప్పుడప్పుడు చొక్కాలతో ఖుషీగా కనపడేవాళ్లుకూడా ఉత్తరీయాలు కప్పుకుని, అంగోస్త్రాలు కట్టుకొని చెంబులు పుచ్చుకుని వొచ్చారు.

"పొద్దుపోయింది, పొద్దుపోయింది" అని అందరూ అంటున్నారు. "విస్తళ్లు వెయ్యరేం, విస్తళ్లు వెయ్యరేం" అని అందరూ అరిచేవాళ్లే. అందరూ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఆలజడిగా అటూయిటూ నడిచేవాళ్లే. పరమాన్నం కని దొన్నెలు కట్టుకునేవాళ్లే. తమ తమ స్నేహితులకోసం పక్కవిస్తళ్లు ఎవరూ రాకుండా అరికడుతున్నవాళ్లే. దబదబా చేదపగిలేట్టు నూతిదగ్గిర స్నానాలు చేసేవాళ్లే.

విస్తళ్లు వేశారు. అభిఘారం చేశారు. నలుగురు జమాశెట్టిలలాంటివాళ్లు అన్నపళ్లాలూ, పచ్చళ్లూ అవీ పట్టుకొని వొడ్డిస్తున్నారు. రామం, వికారంతో తల తిరుగుతూండగా, ఇంకాసిని మంచినీళ్లు తాగి, తండ్రిని వెతుక్కుంటూ వెళ్లి కలుసుకున్నాడు. "ఎక్కడో అక్కడ కూచో" అని తండ్రి గద్దించాడు. రామం దిక్కు చచ్చిపోయి కుర్రాళ్ల పంక్తిలో కూచున్నాడు. పెద్దలు ఆహితాగ్నులు, ఘనాపాఠీలు, పట్టాలవాళ్లు ముందుకూచుని, కొంగజపాలు చేస్తున్నారు. పెళ్లినడకలవలె వడ్డన అయింది. ఎవరో రామావధాన్లగారికోసం ఓ అరగంట వడ్డన అయినాక కాచుక్కూచున్నారు. వారూ నిక్కి నీలిగి, సొక్కి సోలి, మెల్లిగా చీమలా అడుగు వేసుకుంటూ వొచ్చి "నాకోసం ఆగారా, శివశివ, కానీరేం" అంటూ అనుజ్ఞ ఇచ్చి "అమృతమస్తు" అన్నారు. గబగబా నెయ్యి మంచినీళ్లగా పోసి, అంగలు వేస్తూ గబగబా పంక్తులు కలియ తిప్పారు.

పొద్దుపోయింది. రామానికి వికారం. శాకపాకాలు ధ్వంసధూళిగా ఉన్నై. అమ్మ పక్కన కూచుని అన్నం పెట్టడమా మరి? వంకాయకూరలో అంతా కారమే. అల్లంఘాటే. పప్పుమాత్రం ఓమాదిరిగా ఉంది. పచ్చళ్లు నీళ్లకునీళ్లూ, ఉప్పుకు ఉప్పూ, కారాని కారం, తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం. పులుసు తన నిర్వాకమే. పరమాన్నం పంచదార వేసిన గంజి. లడ్లుమాత్రం బావున్నాయిగాని, కుర్రాళ్లపంక్తికి మస్తుగా అందలేదు. నీళ్లలాంటి మజ్జిగతో ఇంత తిని, రామం విధిలేక లేచి చెయ్యి కడుక్కున్నాడు అందరితో పాటూ.

భోజనాలైనాక అందరూ అక్కడ పోసై పొడుం పరామర్శ చేశారు. అక్కడే కూచున్నారు. ఓ అరగంట కూచుని తాంబూలాలు నమిలి, మళ్లీ యిందాకటి యజమాని యింటికి పోయారు. రకరకాలవారీగా సంభావన ఇవ్వడం జరిగింది. రామానికి ఓపావలా యిచ్చారు. అదీ తండ్రిసిఫారసు మీద. బ్రాహ్మలు వెళిపోయారు. గోధూళివేళ అయింది.

తండ్రి ఆయింట్లోపలికి తీసుకెళ్లి, దావాలూ, కలశాలూ, అవీ ఇతని ఉత్తరీయాన మూటకట్టి, "యింటికి పో" అన్నాడు. తండ్రికూడా కదుల్తాడేమోనని రామం చూశాడు గాని, తండ్రి "వెళ్లవేం!" అని దబాయించాడు. రామం మెల్లిగా అడుగులేసుకుంటూ, ఈసురోమని యింటిముఖంపట్టాడు.

తానొక సభాపతికుమారుణ్ణని స్కూలు చదువు మాని, వైదికంలో పడ్డాడు. బంగారపు దర్భముడి వుంగరం, సేలం అంచు పంచెలూ, వెండి పొడుంకాయి, కాలు కదిపితే సభాపతిగారు సభాపతిగారు అని గౌరవించే ఓ పరివారం, పైన పండితశాలువా అన్నీ ఉండి జీవితం అంతా సుఖమయం అనుకున్నాడు రామం.

పొద్దున్నే లేవడం, ఎక్కడికో, ఈరోజు ఇక్కడికి, రేపు మరోచోటికి పోవడం. అక్కడ చేతులు కాల్చుకుని, కుక్కిన పేనులాగా పడిఉండి, పొగలతో కళ్లు నీరుకారి, స్నానాలతో తడిసి, వేళకు అన్నం లేక, తినబోయేసరికి అవన్నీ ధ్వంసధూళై తండ్రిచే మోచేతిపోట్లు, మాటీపోటీలు పడి జీవితం రుచిచూశాడు రామం.

అమ్మ తలదువ్వి, బొట్టుపెట్టి, చొక్కా లాగూ తొడిగి బళ్లోకి పంపడం, కందిపప్పుడబ్బాలోంచి

చేయించిన కందిపప్పు జేబులో వేసి, కొనుక్కు తినమని కాణో అర్ధణో యివ్వడం, తను నిర్విచారంగా బళ్లోకి పోవడం, తనతోడు కుర్రాళ్లతో కేరింతాలాడడం అన్నీ గుర్తుకొచ్చై. కాని, అమ్మో, యివాళ సోంవారం, యివాళ హిస్టరీక్లాసు. దాం దుంప తెగా, ఆ రాజులు, ఆ యుద్ధాలు, ఆ తారీఖులు ఎంత చచ్చినా కంఠపాఠం కావు. అమ్మో! బడే!

రామం ప్రస్తుతస్థితిలో, అనుకోకుండా కళ్లంబడి నీళ్లు కార్చాడు. తండ్రి పక్కన ఉన్నాడేమో, చూసి చంపుతాడేమో నని, వీపున ఉన్న మూటలు చంకలో ఒత్తిపట్టి ధోతీకొంగుతో కళ్లు తుడుచుకున్నాడు. ఇంటికొచ్చేశాడు. మూటలు పడమటింట్లో పారేసి 'అమ్మయ్య' అన్నాడు.

తల్లి ఎదురువచ్చి, చాట తెచ్చి, "చాట్లో పొయ్యి నాయినా" అంది. చాటలో పోసి, అందులో ఉన్న కర్జూరకాయలూ, తమలపాకులూ, వక్కలూ, కొన్నీ ఏరి, అమ్మ కిచ్చాడు. "నాయనా, వేణ్ణీళ్లు పోసుకుంటావా?" అంది తల్లి.

రామానికి మళ్లీ కన్నీళ్లు వొచ్చై. బరువుగా ఊపిరి వొచ్చింది. కళ్లనీళ్లు ఆపుకుని, కంఠంలోకి రాగా, 'అమ్మా!' అని, "ఆ, పోసుకుంటా" నన్నాడు. అమ్మ నీళ్లు సమపాళాలు చేసి యిచ్చింది. రామం స్నానం చేశాడు.

"రా, నాయనా, అన్నం తింటావా?" అంది, "ఆకలి లేదే" అని, "పెట్టు, తింటా" నన్నాడు.

తల్లి అన్నం పెట్టింది. ఎదురుగా పచ్చగా పార్వతీదేవివలె కూచుంది.

రామం అమ్మకేసీ, ఎదురుగుండా ఉన్న పొయ్యికేసీ చూసి, తనలో తాను మింగి, మజ్జిగా అన్నంతో యింత తిన్నాడు. చెయ్యి కడుక్కోగానే నిద్ర తూలింది. మంచం వాల్చుకోడం వ్యవధానం. నిద్ర. రాతివలె రామం నిద్రపోయాడు.

మళ్లీ అమ్మ పిలిచి నిద్రలేపి, "ఆరున్నర అయిందిరా, మీనాన్న అన్నీ అయి వాకిట్లో నీకోసం చూస్తున్నారు" అని లేపేదాకా రామానికి వొళ్లు తెలీదు. తల్లి 'లే' అని లేపేసరికి రామం త్రుళ్లిపడి కళ్లు నులుముకున్నాడు.

[1936 నవంబరు 'లండన్ మెర్క్యూరీ' లోని Leslie Halwardగారి Initiationకు ఇది అనుకరణ].

---

# ఊరవతల

= శ్రీ శ్రీరంగం నారాయణబాబు =

కలల పొదరిల్లల్లె
సౌఖ్యంపు నిదురలో
కనిపించి
యొకతన్వి
మేనక నాపేరు
మేఘాలకు వెనకప్రక్క
మా ఊరని మాయమయ్యె
చిరునామా తెలిసికూడ
చేసే దేమి లేక
ఊహాగానం సేయగ
ఊరవతల కెళ్లాను.
..........................
..........................
"కావు! కావు!"
ఆకాశం
కాకిపిల్ల
నోరు తెరచె
మెతికొరకు
పాపిష్ఠి యినోదయంబె
పాముకాటు ఎండపొడిచె
భువికితగిలె
శివజ్వరం!
ఫలములు
లేనె లేవు

పచ్చనకూడా చచ్చి
నీడకూడ యీయలేని
మ్రోడుచెట్ల జంటపొత్తు
యినుపసరకు
యెనుపోతు
యము నెక్కడొదించేసి
తనుమాత్రం యెదురాయెను
ప్రేతలతో
యిల్లట్టుల
బూరుగవృక్షంమీంద
కళ్లజోడు పెట్టుకున్న
గరుడపురాణబ్రాహ్మడు
కంఠమెత్తె
ఘూకమ్మ !
కాటకంపు
తాటకిలా
ఆరుబయట మిల్లు
విశ్వకర్త
హృదయంలో
దుస్వప్నంలా
భుగభుగమను
పొగగొట్టం !
ఆకాశమె
చిల్లులువడ
అతితారస్థాయి
నామిల్లరిచింది
పోలీసులయీలకు
నిసిరాతిరి
పసిపిల్లడు
కలతనిదుర
కళవళపడట్టు
కణకణ మండే కళ్లతో
కార్మికసోదరు డదరెను
జీవనమ్మె తీసినారు
జలమంతా మిల్లుకెత్త
పాడలేని గులకరాళ్ల
పాతవడ్డ సెలయేరు !
మురికిబట్ట లెన్నొ మోసి
రజకుని చేరట్టు
పురమంతా
రాతిరంత తిరగడం
కాగితాల భోజనం
పోయినయా యేటినవ్వ
పుక్కిట నెమరేసుకుంటు
గండశిలనీడలోన
కనుమోడ్చెను
గార్దభస్వామి !
అవిశ్వాసంపు బ్రతుకు
అరఘడియైనను నోర్వదు
పోయిన యా పూర్వపు
పోతిరాజు [యజమాని
యెముకలతో
చెలగాటం సాగించి
శ్మశానాల తిరిగివచ్చు
శునక సందడి !
శిలకెంతో దగ్గరగా
గొప్పవారి చూపుల్లా
గ్రుచ్చుకొనే యీతచెట్టు !
అల్ బిదా ! అల్ బిదా !
తురకల పండుగులోన
ఊరేగే పీరుల్లా
ఏతచేత గీతవడ్డ
తాటివనం !
బ్రహ్మచెముడు
కంచెమధ్య
పూర్ణిమసంధ్యల్లోన
ఘడియైనా యుదయాద్రిని
రుధిరజ్యోతై వెలిగే
జాబిల్లి !
మృతశరీర
ఆక్రమణ
ఘటాకాశ
అరుణారుణ
రక్తసిక్త-మోముతోడ
'మా అమ్మే చంపింది'!
'మా అమ్మే చంపిం'దను
హూనముగా
గాజుకళ్ల
పురిటిపిల్ల !
వెనుతిరిగేచూచాను
వెంటాడే మృత్యువులా
వెరపుగొలిపె నాఛాయ!
..........................
..........................
అయ్యబాబోయ్!
అసురులతో పోరాటం
మెషీన్‌గన్నులార్భాటం
జీవహింసకూడదని
చేతజిక్కినారు
భూమికంత యీనాడ
గ్రామదేవతోత్సవమ్ము !
కాలజ్ఞానులు మీరు
కాచుకోండి కత్తిపదును
కత్తిపదును కాచుకోండి
కవిగారని
గాలికబురు తెలిపింది !

—"రుధిరజ్యోతి" నుండి

— —

# జానపదగీతికల సామరస్యం



= శ్రీ కవికొండల వెంకటరావు =

'జానపదగీతికల సామరస్యము' అనే అంశమును గురించి ఈమధ్య రామచంద్రపురంలో సారస్వతసమావేశమందు నన్ను మాట్లాడమన్నారు. కాని జానపదగీతికలకు దేనితో గల సామరస్యము అనేది వివరించివారు కారు. అయినప్పటికిన్నీ ఆసమావేశం వ్యవసాయప్రదర్శన సందర్భమున జరుగుతూవుండినది కాబట్టి జానపదగీతికలకు వ్యవసాయమునెడలను, దాని కాటపట్టయిన పల్లెటూళ్లయెడలను, అందలి ప్రజల యెడలను గలిగివున్న సామరస్యము అని నేను ఊహించుకొని ఈప్రసంగము గావించినాను.

జానపదగీతికలకు సామరస్య మేమిటి? అవేమైనా మనుష్యులా? హృదయంగలవా? వాటిల్లో నెత్తురు ప్రవహిస్తూవున్నదా? అని మొదటిప్రశ్నగా తోస్తుంది. వెంటనే అవి రచించిన కవులకు మనయందు, మనకృషియందు గల సామరస్యము అని జవాబు రాకతప్పదు. అయితే ఏరీ ఆకవులు? నన్నయ భారతమని అంటాం! పెద్దన మనుచరిత్ర అని అంటాం! శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర అని అంటాం! అలా చెప్పగలమా "ఫలానివారిది 'చల్ మోహనరంగా' పా"టని ? చెప్పలేము. అంచేత మన విషయమందు నెమకబోయే సామరస్యము తిన్నగా ఆయా జానపదగీతికల యొక్క వాకిళ్లలో నిలిచి వాటిపోకిళ్లతో పొంగి ఉత్తేజాలమై, ఉద్రిక్తులమై అనుభవానికి తెచ్చుకోవాలి.

"ఏరువాకమ్మకీ ఏమికావాలి?"
అని ఓగీతికలో అడుగుతాడు.

"ఏమికావాలి?"

౧. "ఎఱ్ఱఎఱ్ఱని పూలమాల కావాలి
ఎఱుపుతెలుపుల మబ్బుకొంగ కావాలి.
ఏరువాకమ్మకీ ఏమిమొక్కాలి?
పొలముగట్టున నిలిచి వేడుకోవాలి!
టెంకాయవడపప్పు తెచ్చిపెట్టాలి
ముత్తైదులందఱూ పాటపాడాలి
పాటపాడుతు తల్లిపాదాలు మొక్కాలి.
ఏరువాకమ్మనీ ఏమికోరాలి?
ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడిపంటలు కోరి పరవశించాలి."

ఈగీతిక రయితులు ప్రతీయేటా యుగాదినాడు గావించే ఏరోకయుత్సవంయొక్క ఉత్కృష్టతను చాటుతూవుంది. పూలు, మబ్బు, టెంకాయ, ముత్తైదువులపాట—అన్నింటినీ జతపరచి మనముందో ఆరుబయట హారతిగా పరిమళిస్తూ ప్రజ్వలిస్తూంది. ఈలాంటి పాటలకు వెనక నిలిచియుండే అంశ ఏమిటి అని వితర్కిస్తే ఏమీలేదు, కష్టపడి కాపు నొసట నోడ్చే చెమటబిందు, ఆబిందుయొక్క ప్రతిఫలంగా అతను పొందే ఆనందబిందు.

౨. "వన్నెచిన్నెల చిన్నవాడా!
పన్నుకోవా కొత్తనాగలి
దున్నుకోవా ఆకుమళ్లను
ఆడుకుంటూ పాడుకుంటూ
అడుగు లేశావా?
కొఱ్ఱుగుచ్చిన దేశమందు కరువు లుంటాయా?
దుక్కిదున్నిన దేశమందు దుఃఖ ముంటుందా?
కాపునడచిన భూమిమీద ఏపుతగ్గిందా?
మోటనాగలి దున్నుకుంటూ
పాటలేవో పాడుకుంటూ
పాటుపడితే లోటు లుంటాయా?"

చూడండి వ్యవసాయదారుని వృత్తియం దాకలిగన్న గౌరవము, కాంతి, కడుపునిండిన కలిమీ బలిమీని.

ఒక పడుచుపిల్లపాట వుంది. ఇలా పాడుతూ వుంది ఆకన్నె:

3. "తొలకరి ఒకమబ్బు తొంగిచూచింది
మబ్బులో ఒక మెఱుపు మెఱిసిపోయింది.
పెరటిలో ఒకజల్లు కురిసి వెలిసింది
జల్లులో నా మనసు జారిపోయింది.

ఏ కొమ్మమీదనో ఎండతాకినపిట్ట
ఏటి త్రోవలు పట్టి ఎగిరిపోయింది
ఏరువాకానాటి కేడాది అయింది.
ఎదురు చూచి గుండె చెదరిపోయింది.

పిట్టపిట్టా ముద్దుపెట్టుకున్నాయి
గోవులన్నీ యిల్లు చేరుకున్నాయి
ఏటిగాలికి చిలుక లెగిరిపోయాయి
ఎందుకో నా ఆశ లెగిరిపోయాయి."

ఆ పడుచుకన్నెయొక్క సున్నితపు భావాలు కూడా ఏరువాకమీదనే ఆధారపడి కాలాన్ని లెక్కించాయి; ప్రభవమీద విభవమీద కాదు—ఏరువాకానాటి కేడాది అయింది!

ఏమి టీగానం, ఏమి టీ ఉత్సాహం అని వితర్కిస్తే తోచేది ఒకటి—ఒకచోట మిసెస్ కజిన్స వ్రాసినట్టు "భగవంతుడు మన శరీరాల్లోనే గానయంత్రమును ఇమిడ్చియుంచాడు. మన గొంతులోనే ఒకానొక సన్నాయిపీకను పెట్టాడు! మన మెంతబీదవాళ్లమైనప్పటికీ, ఖర్చులేని ఆ యంత్రం మనలోనే వుంటుంది. భారతీయులయొక్క రక్తనాళాలమ్మట గానము ప్రవహిస్తూవున్నది." (God has placed the Musical instrument right in our bodies, in our throat, making a reed there, and no matter how poor we are, here is our instrument given without price and Music is in the very blood of Indians.)

ఈ రకం గానాన్ని ఇంగ్లీషులో Folk-music (ఫోక్-మ్యూజిక్) అంటారు. మనభాషలో తెలియచెప్పాలంటే మహాజనగానం అని వాడవచ్చు ననుకుంటాను (మహాజనానాం అని ఆశీర్వచన సమయములందు జనసామాన్య పదమ్మునంతనూ పేర్కొంటారు). దీన్ని **Art-music** నుంచి, అనగా శాస్త్రీయ సంగీతంనుంచి వేటాయించి ప్రత్యేకగౌరవంతో చూస్తారు. ఈ మహాజనగాన మన్నది అన్ని దేశాల్లోనూ,అందటి హృదయాల్లోనూ విస్తరిల్లి వుంది. అందటి ఆశయాల్లోనూ దాగి వుంది. ఓగొడ్లకాపరి గొంతుమీద—

"కమ్మోరి పిన్నోడు సిరిసిరిమువ్వ!
కాసులు కంటెలు సిరిసిరిమువ్వ!"

అని ఆపేసరికి ప్రతివానికీ వొడలు పులకరిస్తుంది.

"ఏవూరు భామా ఏమె నీపేరు?
నాతోటి వొకసారి నిలిచి మాటాడు"

అనే గీతిక చెవిసోకేసరికి ఈ అనంతజీవిత పథంలో మనం కనుగోదగ్గ ఒకానొక లాలిత్యవతి అనూహ్యసుందరంగా సాక్షాత్కరించివేస్తుంది.

ఈ ఫణితికి మనదేశంలో అనేకవిధాలుగా నామకరణం గావించి ప్రజాసామాన్యమే కాకుండా ఒక్కొక్కచోట హుందాగల ప్రభువులుకూడా తమ దాపుకసొమ్ముగా, తమ ఇంటివేల్పుగా కాపాడుకొని యున్నారు.

"పెదతిరుమలయ్య పదమున కరగక"

అని ఒకచోట వ్రాయబడివున్నది. పదం అంటే పాట. తరుచు దీనిని—ఈజానపదగీతికను—మన పూర్వులు 'పదకవిత' అని వాడియున్నారు. అయితే ఇతర పేర్లు కూడా అమలులో వున్నాయి. 'దేశికవిత' అని, 'పల్లెటూరి పాటలు'అని, పైని సూచించిన 'జానపదగీతికలు' అని—ఏ పేరు పెట్టినా వీటియొక్క నిశ్వాసనం వీటి కాస్థానమైనట్టి జనపదమునుబట్టేనని మనం అనుకొని తీరాలి. కేదారమండలి మాధుర్యము, సీవార్లండలి చేవ ఈపాటల్లో ఎక్కడ చూచినా ద్యోతక మౌతూ వుంటుంది.

వీటిని ముఖ్యవిభజన గావిస్తే ఇవి మూడు తెగలుగా గోచరిస్తాయి: (౧)ఏలపాటలు, (౨) మేలుకొలుపులు, (3) వృత్తి ప్రమేయములు. మొదటితెగలో శృంగారము హెచ్చు, రెండవతెగలో మత విషయకమైన

తత్వప్రబోధం హెచ్చు, మూడవ తెగలో సాంసారిక విశదీకరణం హెచ్చు.

౪. "మోటలవారంత మొత్తుకొని చచ్చిరి వానదేవుడా!
నాగళ్లవారంత నరుకుకొని చచ్చిరి వానదేవుడా!
గుంటకలవారంత గుద్దుకొని చచ్చిరి వానదేవుడా!
ఇగనైన గురవవు జగదేకవీరుడ! వానదేవుడా!"

అనే ఈ నాలుగుపంక్తుల్లో వర్షములు లేక ఆ కర్షకులు ఆనాడుపడిన బాధ-అల్లకల్లోలము నిరాశయొక్క పొలిమేరకంటూ ఏలాచిత్రింపబడిందో! అయినప్పటికీ ఆ ప్రజల హృదయంలో నాస్తికభావం అలుముకుపోలేదు. వేదసూక్తాలలో పర్జన్యుడేలా పొగడబడ్డాడో ఆలా పొగడబడ్డాడు వానదేవుడు! "జగదేకవీరుడా! వానదేవుడా!"

చాలాపాటల్లో వ్యవసాయాన్నిగురించి, వానదేవుణ్ణిగురించిమాత్రమేకాకుండా వాటికి సంబంధించిన వృత్తులకు ప్రోత్సాహకరములుగా వుండేటట్టు ఎలుగెత్తి రచించిన గీతిక లున్నాయి. అక్కడక్కడ తునకలు వినిపిస్తాను—అవి మీకళ్లముందు బంగారపుళకలాల్లా ప్రకాశించగలవు అనే గాఢవిశ్వాసంతో.

౫. "పిల్లంగోవి వూదుతున్నడు—ఆరాయడు
రౌనకా యేనూరు ఆవు
ముందర మున్నూరు ఆవు
ఈనికావు వేరుపడ్డాది. [ఆరాయడు
ఆమందలోన చేనిగచేసే పరగమే పెరా—
బొన్న చేసే పరగమే పెరా—ఆరాయడు
నక్కలమ్మగుంటకాడ ఆవులాకు నీళ్లు పెట్టి
చెట్టునీడ నిద్రపోతడు—ఆరాయడు"

ఇందు గొల్లకానివృత్తి ఎంత చక్కగా వర్ణించబడిందో చూడండి! ఆపైనకాతలే మతోకాడ దంపుళ్ల చావడిలో మతోపాట కొరడాచువ్వలా తెసుల్తోంది.

౬. "వడ్లోడుచేసినా వన్నెలగజము
కమ్మరిచేసినా కనకంపు కుదురు
వంగి పోబెట్యాలి వయ్యారమేమె?
వడుమొంచి దంచాలి నాగరికమేమె?"

అయితే పైపాటలో స్త్రీ స్త్రీనే అంటూవుంది. ఆడది మగవాణ్ణి హెచ్చరించిన పాటలూ వున్నాయి. కూడాకూడావుండి ఆరోజుల్లో ఆరెండుల్లో ఆకొండల్లో—దత్తమండలపుపాట అది—అక్కడ దేవుడు ఓబలేశుడు.

౭. "గిద్దలగిరి కొండలనడుమ
ఎద్దులతోలే ముద్దులనుఅది
నన్ను జూసి నవ్వబోకోయి!
హరి ఓబలేశ!
నన్ను జూసీనవ్వబోకోయి!
........................
ముందుటరక తోలేవాడా!
ముద్దులామేన త్తకొడుకా!
దాపపెద్దుకు దప్పికాయెనోయి!
హరి ఓబలేశ!
నన్ను జూసీ నవ్వబోకోయి!"

ఇందులో ప్రణయ వ్యంగ్యసౌభాగ్యంతోపాటు దూడకు దాహమైంది, దూడను విప్పి ముందు దాని దప్పి కార్చవోయి అనే ప్రయోజనం కూడా అతిమధురంగా సూచింపబడ్డాది. ఓహో!

మతోమూల ఓకుఱ్ఱది ఊ కులికి పోతూవుంటే ఆకుఱ్ఱదాని నేస్తం ఎటకరిస్తోంది.

౮. "చిలకల చీరందమా?
పొంగలి కోలాటమా?
బావట్టిన పట్టుచీర సంతోసమా?" అని.

మూడు పంక్తుల్లో మనముందు ఆకాలం పొంగలి పండగ, ఆపండగనాటి ముస్తాబు, ఆ ముస్తాబుతో ఆ ముగుద పొందిన అపరిమితప్రమోదం మన కన్నులముందు నిలబెట్టినట్టు ఆకవి చూపరిచాడు. కలం అంటే అతగానిదే కలం!

ఇటు తిరగండి! తిరగలి విసురుతూ ఓ స్త్రీ ఓ వీరగాథ పాడుతూంది. ఆంధ్రవీరుడు యుద్ధానికి పోబోయేముందు మ్రొక్కిన తొలిమ్రొక్కు అప్పటిమ్రొక్కులా తిరుగుతూ వున్నట్టు ఆపాట విన్నప్పుడు నాకగపించింది.

౯. "ఆవేళ సోదరుడు ఏమనీ మ్రొక్కె ?
పంటుంసాంబ్రాణి ధూపమనీ మ్రొక్కె !
అచ్చకర్పూరాలు ఆరతులనీ మ్రొక్కె!"

ఈలా వినిపించవలసివస్తే వేనవేలున్నాయి. కవుల పేర్లు తెలియవు—కవుల పేర్లు తెలియవని మనము నిరసించ నవసరము లేదు. నీరసములు కావు అవి. ఆగీతికలయొక్క కీర్తి చిరంతనము. ఆచంద్ర రార్కము.

౧౦. "పేరులేని చిన్నపువ్వు" అను గీతికలోని చిన్నిపువ్వులా పేరు లేకుండగనే వెలసిపోయిన మహాకవులు వారు.

వారి రచనలు మన కెల్లప్పుడూ పల్లెటూళ్లమీద అభిమానం కలిగిస్తాయి. "Back to the village— తిరిగి పల్లెటూరికి" అని ప్రచారంగావించే యీ కాలంలో, గ్రామోద్ధరణ(Rural reconstruction)కై యత్నించే యీనాళ్ల వీటియొక్క విలువ మరీ హెచ్చు. ప్రజాసామాన్యమునకు కూడా వాజ్మాత్ర భావలాస్యాలు, అపురూపమైన హావభావాలు ఉన్నా యని లోకానికి వీటివల్లనే విదితం అవుతుంది. వేనోళ్ల విదిత మౌతుంది. చదవండి అవెక్కడ కనబడ్డా. సేకరించండి ఎక్కడ చెదరివున్నా. అవే జాతికి చేపట్టు.

౧౧. "పాడి పంట యింట
పప్పుకూడు వంటింట
నగలు నాకే లొంట
కాటుక కడకంట."*



* ఈ వ్యాసమునందలి (1) (2) (3) కృష్ణాపత్రిక నుండియు, (4) (6) గోల్కొండపత్రిక నుండియు నెత్తి ఉటంకించబడినవి. (5) పర్వాయి పాపడికథ అను అచ్చుపొత్తమునుండి ఎత్తబడినది. (10) (11) గీతికలు నాచే రచింపబడిన "జనపదముల"నుండి యుదాహరించియున్నాను. మిగిలినవి నేనక్కడక్కడ విని మఱచిపోనివి.

—వ్యాసకర్త.

# కలగూరగంప

## రంగవైశాల్యము

ప్రాచీన కాలమున నాటకరంగము (నేపథ్యము మినహాయించి) ఎంత వైశాల్యము గలదో గాని, ప్రస్తుతము మనదేశములోనిరంగము లొక్కొక్కశాలకు ఒక్కొక్క విధముగ నున్నవి. కొన్నిటికి వెడల్పు ఎక్కువ, లోతు తక్కువ; కొన్ని ఇందుకు భిన్నముగా నున్నవి. ఎత్తులోకూడ కొంత భేద మున్నది. రంగోపకరణములందుకూడ ఎంతో భేద మున్నది. ఏ నాటకశాలయందు గాని పంద్రెండు తెరలకంటె సామాన్యముగా ఎక్కువ ఉండుట లేదు. ప్రాయికముగా వీధితెర లుండును. రాజవీథిగలది ఒకటి, ప్రాసాదముగలది ఒకటి, అడవిగలది ఒకటి, ఉద్యానవనము గలది ఒకటి సామాన్యముగా ఉండును. తెరలూ ప్రక్క తెరలూ సర్ది, పట్టణమనియో, వీథియనియో, అడవియనియో, రాజభవనమనియో నిరూపించునట్లు ప్రదర్శకులు యత్నించెదరు. "అవసరమైన వాతావరణమును ఇవి యెంతవరకు సృష్టించగలుగుచున్నవి" అనుట ప్రశ్నింపదగిన అంశమే. అయినా, నటకుల కౌశలము వల్ల ఉపకరణముల లోపము గమనింపకుండ, నాటక ప్రదర్శనమును ప్రేక్షకులు చూచుచున్నారు. రంగవైశాల్యము ఒక ప్రశ్నగా సామాన్యదృష్టికి తోచదు.

పాశ్చాత్య నాటకశాలలలో రంగోపకరణములను సమగ్రముగా, సందర్భోచితముగా సృష్టించుచుందురని వింటిమి. అంతేకాక, వారి నూతన నాటక రచనలయందు నిత్యజీవితమందలి విశేషములు, మానసిక పరివర్తనలు, ఘర్షణలు చిత్రించుచు, ప్రదర్శనయందు ఎక్కువ చిక్కు లేనట్లుగా రంగమును కవులే నిర్వహించుచున్నారు.

రష్యా నాటకశాలలలో, అన్ని నాటకములకును ఒకటే రీతిగ తెరలు ఉండకుండ, ఆయా నాటకమునకు అవసరమైనవి, తగినవి యైన తెరలను కాగితములతో సృష్టించి, విద్యుద్దీపసహాయముతో శోభావంతముగ చేయుచున్నారట. అలాంటి యత్నమును మన దేశములో హరీంద్రనాథఛటోపాధ్యాయగారు చేసినారు. అడయారు థియేటరులో ఆ పంథానే అనుసరింప యత్నించుచున్నారు. సామాజికనాటక ప్రదర్శనములకీ పద్ధతి ఎంతో యుపకరించునని వేరుగ చెప్పనక్కరలేదు. నాటకకర్త ఉద్దేశించిన వాతావరణమును సృష్టించుటకు ఉపజ్ఞా విశేషము ఉండకపోతే ఇది సాధ్యము కాదు. ఆంధ్రదేశములో ఇటీవల ప్రబలియుండిన కాంట్రాక్టు నాటకములలో ఇది అసాధ్యమేగదా.

కాని, నాటకకళ అనండి, నాట్యకళఅనండి— ఆ కళ దేశముయొక్క, ప్రజయొక్క సభ్యతకు, సంస్కృతికి, రసజ్ఞతకు ప్రతిబింబమని అంగీకరించినప్పుడు, ఆ కళాప్రదర్శనస్థానములనుగురించి శ్రద్ధ తీసుకొనక తప్పదు. పైగా సినిమాలవల్ల నాట్యకళకు అవసానదినములు వచ్చినవని ఆక్రోశించు దినములలో, నాటకరంగమును గురించి మరింత శ్రద్ధ తీసుకొనవలసియుండును.

సినిమాల పోటీవల్ల నాటకకళకు ఎందుకు అవసానదశ వచ్చినదో మనము చర్చించుకొనవలసియుండును. నాటకకథలకును, సినీమాకథలకును ఇంతవరకు తెలుగుదేశమున ఎక్కువ భేదము కనబడుటలేదు. నాటకప్రదర్శనములందు నటీనటులు చూపిన

నాట్యకౌశలముకంటె ఎక్కువగా ఇంతవరకు సినిమా నటకులు చూపిరని ఎవ్వరును చెప్ప సాహసించలేరు. పైగా, వెనుకటి వ్యాసములో నేను తెలిపినట్లు కొన్ని కొన్ని రస ప్రదర్శనములకు నాటకములందే ఎక్కువ తావున్నది; నాటకములే ప్రేక్షకులను ఎక్కువ రంజింప జేయగలవు.

అయినను, సినిమాలు నాటకములను తలదన్ని, నాటక ప్రదర్శనములకు అవకాశము లేకుండ జేయుచున్నవనగా ఇందుకు కారణము లేమో ?

నాకు మూడు కారణములు తోచుచున్నవి: (౧) కళాదృష్టితో చూచినప్పుడు, సినిమాలలోకంటె నాటకములలో రంగవైశాల్యము సంకుచితముగ నున్నది. (౨) వ్యాపారదృష్టితో చూచినప్పుడు ప్రేక్షకులు నాటకములను చూచుటకంటె ఎక్కువ చౌకగా సినిమాలను చూడగలరు. (౩) ఆకర్షణీయములై, రసపూర్ణములై నవయుగానుగుణములైన క్రొత్తనాటకములు, ప్రదర్శనయోగ్యములైనవి రచింపబడలేదు; అథవా అలాటివి రచింపబడియున్నను వాటిని రంగముపైకి ఎక్కించు ప్రదర్శకులు తగినంతమంది లేరు.

ఈ కారణములను మూడింటిని తరచి చూడవలసి యుండును.

రంగ వైశాల్యమనగా అక్షరతః రంగము యొక్క విస్తీర్ణమని అర్థమైనను, అది పరిపూర్ణార్థము కాదు. రంగము ఎంతవెడల్పు, ఎంత ఎత్తు, ఎంత లోతు గల దను సంగతేగాక, రంగము ఎంత వైశాల్యమును, విస్తీర్ణమును, వివిధత్వమును ప్రతిబింబించుచున్నది అను ప్రశ్నకూడ ఇందు ఇమిడి యున్నది. నాటకకళోద్ధరణకు పూనుకొన్న మహనీయులకు ఇది శ్రద్ధతీసుకొనదగిన మహదంశమని మనవి చేయుచున్నాను.

బేడాకాణి యిచ్చి సినీమా చూచువారుసైతము న్యూయార్కు ఆకాశసౌధములు, మాస్కోమంచు, లిబియాయుద్ధము, విమానములు, యుద్ధనౌకలు మొదలగు అనేక దృశ్యములను, మామూలు నాట్యకళాన్వితమైన కథలను చూడగలుగుచున్నారు. రాష్ట్రీ, దేశీయ, ప్రపంచ విఖ్యాతిగాంచిన నటనటీ నాట్యకౌశలమును కన్నులార గాంచగలుగుచున్నారు. నానాటికిని నూత్న శోభలతో వెలుగొందు కళామహిమను గాంచుచున్నారు. అపూర్వమైన వాల్ట్ డిస్నీ టెక్నికలర్ కార్టూనులను జూచి మహానంద మొందుచున్నారు.

ఆంధ్రదేశచలనచిత్రకళ పరిశ్రమ హాలీవుడ్డు కళ పరిశ్రమవంటి మహోన్నత్యమును పొందలేదు; అయినను తరతమభేదమేగాని వస్తుభేదము లేనందున ఆంధ్రసినిమారంగము నాటకరంగమునకు పోటీదై, ఇంచుమించు మారకకారణమై పోయినది. అనగా, ప్రేక్షకులకు సినిమాద్వారా కలుగుచున్న ఆనందానుభూతి నాటక ప్రదర్శనములవలన కలుగకపోవుచున్నందున, నాటకకళను వారు తగినంతగా ప్రోత్సహించుట లేదు. సినిమాను ప్రేక్షకులు ఆదరించుటకు ముఖ్య కారణము రంగవైశాల్యమనియే నాభావము.

రంగ వైశాల్య స్వరూపమును గురించి పైన దిఙ్మాత్రముగా సూచించియున్నాను గాబట్టి మరి పెంచి వివరించ నవసరము లేదనుకొందును. కాని క్షీణించుచున్న ఆంధ్రనాటకకళా, రంగములకు మరల జీవము పోసి, ప్రేక్షకులు ఆశించు రంగ వైశాల్యము సమకూర్ప వీలున్నదా యని దర్శించవలసి యున్నది. నాటకరచన, నాటక ప్రదర్శనము, నాటక రంగము పరస్పరము ఆశ్రయించుకొనియున్నవి గాబట్టి, అన్నింటిని కలిపి ఆలోచించవలసియుండును.

పూర్వమువలె యుద్ధభూములు, మయసభలు, వనములు, అగ్నులు, సముద్రములు, ఏనుగులు వగైరా దృశ్యములు అవసరమైన నాటకములను రచింపబూనినను, నాటకకళకు అపకారము జేసినవార మగుదుమని ముఖ్యముగా గమనించవలసియుండును. ఏలయన, ప్రత్యక్షముగా సజీవమైన ఏనుగులు, సముద్రములు, యథార్థములైన రణరంగములు, మయసభను మించిన మాయలతో గూడిన భవనములు, విమానములు మొదలగు వాటిని వెండితెరపై చూచు ప్రేక్షకలోకమునకు బచ్చెన బొమ్మలు, అడ్డ నిలువు తెరలు వెగటుగా తోచును. కురుక్షేత్ర మహాయుద్ధమును వెండితెరపై కెక్కించిన బాగుండునా, లేక పాండవవిజయ నాటకమును ప్రదర్శించిన బాగుండునా అని యోచించినచో

ఈ విషయము నిస్సందేహముగా తేలిపోవును. ఏను గులు, గుఱ్ఱములు, రథములు, అనేకాక్షౌహిణుల సైన్యము సంగతి అటుండ, ఒక్క విశ్వరూపదర్శనము నందే నాటకరంగమునకును, సినిమారంగమునకును భేదము విస్పష్టమై పోగలదు. శ్రీకృష్ణభగవానుని కృపాకటాక్షమున దుర్యోధనుని కొలువులో విదురాది భక్తులకు కాన్పించిన మహాదృశ్యముగాని, కురుక్షేత్ర మున సందిగ్ధమానసుడైన అర్జునునికి జ్ఞాననేత్రముచే కన్ప డిన దృశ్యము గాని నాటకరంగమున ప్రదర్శింప సాధ్యమగునా? పద్మవ్యూహము వల్ల వీలగునా? సైంధవవధ చూపవలనుపడునా? కావున, ఏ యే రంగ మునకు ఏది యేది యుచితమో, అది యింగిత జ్ఞాన ముతో గ్రహించి, ఆ రంగమున చేకూర్చను ఉపకర ణములు గల నాటకమును కవి రచించవలసియుండును. ఆంధ్ర నాటక కళాపరిషత్తువారి పోటీకి వచ్చిన నాట కములు బయటపడి యుండినచో, అవి యెంతవరకు రంగోచితముగా నుండెడివో చర్చించుకొనియుండ వచ్చును. కాని, ఆంధ్రదేశమునకు అవి లభ్యముకాలేదు. అంతకు ముందుండిన నాటకములలో సుప్రాతిక మూడు వీసములు రంగవైశాల్యానుగుణమయినవి కావని చెప్పవచ్చును. ఎటు చూచినను ఒక్క కన్యాశుల్కమే కొంతవరకు అస్వాభావికరంగము లేక, ప్రదర్శింప వీలయిన నాటకముగా కన్పడుచున్నది. అదికూడ రస సంపుటీకరణము లేక నవలాస్వభావమును గలిగియుండ బట్టి దానిని కుదించి ప్రదర్శించవలసియుండును. 'తప్పెవరిది' అను నాటకమునకు రంగదృష్టిన లోపము లేకున్నను, అందలి కథాలోపమువల్ల అది నీతిదృష్టి గల వారికి నచ్చదు. ప్రజాసామాన్యమును అది ఆకర్షించ జాలదు.

ఇందువల్ల తేలిన యంశ మేమనగా, ప్రాత నాటకములు రంగస్థలికి పనికిరావు. క్రొత్త నాటక ములు రచించవలసియున్నవి. ఆ రచయితలు రంగ వైశాల్యము, రసప్రదర్శనము, సామాజికస్థితి, ప్రజాభి రుచి గమనించి మరీ రచించవలసి యున్నది.

అటువంటి నాటకములు లేనప్పుడు, ఇక నాటక రంగము నశించవలసినదేనా యను ప్రశ్న వచ్చును. నశించ నక్కరలేదు, కాని నాటకకళకు జీవము పోయుటకు తగినంత శక్తి మన పెట్టుబడిదారులలో లేదేమో యని తోచుచున్నది. కారణమేమైనను అధు నాతన విజ్ఞాన మహిమవల్ల నాటకరంగమున ఎంత వైశాల్యమైనను సృష్టించి, ఎంతటి గంభీరమైన వాతా వరణమైనను సృష్టింప వీలున్నది. కాని అందుకు కావలసినంత పెట్టుబడి ఇచ్చువా రెవరున్నారు ఈ మన ఆంధ్రదేశమున? పూర్వము పార్సీ నాటక కంపె నీలు వచ్చు దినములలో, వైర్‌వర్క్సుద్వారా కొన్ని అద్భుత దృశ్యములను వారు చూపించెడివారు. వాటి అలంకారము, రంగు, చమత్కారములవలన ప్రేక్ష కులకు అవి భ్రమకలిగించుచుండెడివి. ఆంధ్రనాటక రంగమున అలాటి దృశ్యములు చూపించలేదు. చూపిం చుటకు యత్నములుగూడ చేసినట్లు లేదు. బళ్లారి రాఘవగారు సంకల్పించిన ఆంధ్రజాతీయ నాటక రంగ మనునది ఒకటి వారి తరములో కాకపోయినను వారి తర్వాతనైనను సృష్టింపబడినట్లయినచో దృశ్య సృష్టికి సంపూర్ణముగా విజ్ఞానాభివృద్ధిని వినియోగించు కొనునేమో? ఆ నాటక రంగముకూడ ఈ నాటి ధోర ణిలో నడచునట్టిదయినచో ఇక ముక్తి లేదన్నమాటే!

నూతన నాటకరచనకు, నూతనరంగసృష్టికి, విజ్ఞా నోపయోగమునకు ఎంతో ధనవ్యయ మగునుగదా, యిది వ్యాపారదృష్టితో లాభకరమా, సాగునా యను ప్రశ్నలు వెంటనే రాగలవు. ఆంధ్రదేశమున ఏ సంగతి కూడ నిశ్చయముగా జరుగునని ఎవ్వరును చెప్ప సాహ సించరు. బెంగాలీవారు ఉద్రేకమానసులని ప్రతీతి. మనవారు వారికి ఆవిషయమున తీసిపోరుగాని, బెంగా లీలయందున్న పట్టుదల, కార్యదక్షత మనలో కొంత కొరవడియున్నవని మనమే అనుకొనుట తప్పుకాదు. అయినను, ఇందునుగూర్చి పెరవారు అనుష్ఠించు మార్గ ములను మనము తెలిసికొన్నచో, సంశయాత్మ్యలము కానక్కరలేదని తెలియగలదు. ఏదేని ఒక ఉత్తమ నాటకమును ప్రదర్శింపబూనుకొన్నా రనుకొనుడు. అందుకు కావలసిన నటబృందమును, ఉపకరణము లను, విజ్ఞానసాధనములను సేకరించుటకు ఒక లక్ష రూపాయ లగునని ఊహింపుడు. ఇంత మొత్తముకూడ ఒక్క ఊరిలోనే, ఒక్క నాడే రాదుగదా. ఏమాయూలు

వ్యాపారమునకూడ అది సామాన్యముగా అసంభవము గదా. అలాటప్పుడు, నాటకసమాజములవారు చేతులు తలలు వ్రేలవేసి, దిగ్భ్రాంతులై పోవుచున్నారా? లేదు. ఇంగ్లాండునందైతేనేమి, అమెరికాలో నైతేనేమి మంచి నాటకమును తయారుచేసి, ఖర్చుపెట్టిన లక్షలాది ద్రవ్యమును, అన్ని స్థలములలో వరుసగా అనేక దినములు, ఒక్కొక్కప్పుడు అనేక నెలలతరబడి ప్రదర్శించి, తిరుగ గడించుచున్న సంగతి మనము వినుటలేదా? ప్రథమ ప్రదర్శన ప్రేక్షకులని లండనులో కొన్ని గొప్ప కుటుంబము లున్నవి. ఏ క్రొత్త నాటకము ప్రదర్శించినను సరే, టిక్కెట్టు ఎంతయినను సరే, వారి స్థానములు రిజర్వు చేసి యుంచవలసినదే. నిర్ణీత స్థలముకంటె ఒక్క టిక్కెట్టయినను ఎక్కువ అమ్మరు. అందువల్ల అనేక దినములు ఒకే నాటక ప్రదర్శనము జరుగును. అందరికిని చూచుటకు అవకాశ ముండును. కంపెనీకి నష్ట ముండదు. అంతదూరము పోనెందుకు? మన ప్రక్కన తమిళ నాడులో కన్నయ్య కంపెనీవారు ఏ కృష్ణలీలో, ఏ సంపూర్ణ రామాయణమో వారి శక్తి కొద్దీ బాగుగా తయారుచేయించి, అనేకమాసాలు ఒకేరీతిగా, ఒకే నాటకమును ఆడి, తమ పెట్టుబడినేగాక లాభమును కూడ ఆర్జించుకొని పోవుటను మనము చూడలేదా? కలకత్తాలోకూడా న్యూథియేటర్సువారి నాటకములు అనేక మాసములు నడవలేదా? కావున, ఆంగ్లులు నాటక ప్రదర్శనము కళమాత్రమేగాక, వ్యాపారము కూడ అని బాగుగా గమనించి, తదనుగుణముగా నాటక రచనను, నాటక ప్రదర్శనమును సాగించిన రెండల, సినిమాల పోటీని సరకుచేయ నవసరముండదు. ఇంత వరకును ఏ ఒక్క నాటకముగాని, ఒకచోట అనేక దినములు వరుసగా ప్రదర్శించినట్లు నాకు తెలియరాలేదు. సురభివారైనను అనేక నాటకములను మార్చి మార్చి వేసెడివారని నా భావము. మన నటకులు తొలినాళ్లలో అదే వృత్తిగా పెట్టుకొనక, కేవలము వినోదముకొరకు నాటకసమాజములుగా చేరి ప్రదర్శించుటవల్లనే ఏ నాటకముకూడ ఒకటి రెండు దినములకంటె వరుసగా ఎక్కడను ప్రదర్శింపబడ లేదని నా తాత్పర్యము.

నాటకరంగమునకు సినిమారంగమంత వైశాల్యము లేకపోయినను, విజ్ఞాన సాధనలను వినియోగించుకొని, సినిమా పరిశ్రమ వలెనే నాటకపరిశ్రమకూడ ఏర్పడినట్లయిన, నాటకకళ పునరుజ్జీవింపబడగలదు. పరిశ్రమ లాభము పొందగలదు.

చక్కని రసవంతమైన కళాసృష్టిని ఆనందించుటకు విద్య అవసరము కాదు. మానవహృదయమును స్పందింపజేయునట్టి దృశ్యములున్న చాలును. అందరాని అర్థములు, ఊహింప వీలులేని శ్లేషలు, గగన సంచారభావములు, అస్వాభావిక సంఘటనలు ఉన్ననేమి లాభము? ప్రజాసామాన్య హృదయము పవిత్రమైనది; పవిత్రాశయములుగలది. మంచిరూపు, మంచిమాట, మంచిపాట చూచి, విని ఆనందించి పులకరించునది. తన్మయత్వము నొందునది. ఆ హృదయ వాంఛలను సఫలీకరించునట్టి నాటకమే సృష్టియై ప్రదర్శింపబడుచో, డబ్బు రాకేమి? నాటక కళకు నూతన జీవము రాకేమి?

యం. వి. శర్మ.

---



# విమర్శనము

౧. కోపదారి మొగుడు — ౧౯౩౧, పుటలు ౧౨౯. వెల ౦—౮—౦

౨. కలువలు — ౧౯౨౬—౩౨, పుటలు ౩౮. వెల ౦—౪—౦

౩. వాడుకభాష : రచనకి కొన్ని నియమాలు — ౧౯౩౮, పుటలు ౧౨౩, వెల ౦-౬-౦

౪. జానకీప్రేమ మొదలైన చిన్నకథలు — ౧౯౩౮, పుటలు ౧౬౪, వెల ౦—౫—౦

౫. పాలపిట్ట ౧౯౩౯ పుటలు 33 వెల ౦—౨—౦

౬. మిణుగురుపురుగు—౧౯౪౦, పుటలు ౪౪, వెల ౦—౨—౦

౭. సాంప్రదాయికవిజ్ఞానం— మొదటి భాగం, ౧౯౪౧. పుటలు ౪౬, వెల ౦—౬—౦

ఈ యేడు పుస్తకములను శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు పేర్కొనబడిన ఆయా సంవత్సరములలో రచించినారు. వీటినన్నిటిని ప్రచురించినది శ్రీ చేకుమళ్ల విశ్వనాథం, పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా. అన్ని పుస్తకములును నిత్యజీవితపు వ్యవహారభాషలో రచించబడినవి.

౧. ఇది ఆయిదంకముల నాటకము. దీనిసంగతి సందర్భములను పేరే విశదపఱచుచున్నది. మన సంఘ జీవనముయొక్క నీతులు, మన సంసారముల కీనీడలు యిందు స్పష్టంగా కన్పిస్తున్నవి. భాష మహా బాగుంది.

౨. ఇందు ౧౯ ఖండకావ్యము లున్నవి. ప్రతి యొకదానికి ఒక ఉద్దేశ్యము ఉన్నది. ఒక ప్రయోజన మున్నది. వీనిలో చక్కని వ్యుత్పన్నమైన కవిత, భావము ఉన్నవి. ఇవన్నియు వ్యవహారరీతి తేట తెలుగున వ్రాయబడి హృదయస్పర్శ చేయుచున్నవి.

౩. ఇది శ్రీ గిడుగు వెంకటరామమూర్తిగారి పీఠికచే ధన్యమైనది. వాడుకభాషలో రచనలు చేయవలె ననే దీక్ష గలవారందరూ ఈపుస్తకమును హర్షించగలరు. జరుగవలసిన మహాకార్యమునకు యిది సూచనమాత్రము. దీనిని పురస్కరించుకొని యీ అభిప్రాయులు కొందరు కలసి చేయవలసిన కృషి విస్తారమున్నది.

౪. ఇందున్నవి పది చిన్న కథలు. పదీ పది మంచి కథలు.

౫. ఇందు ౨౫ బాలగేయా లున్నవి. పిల్లలకి పనికివచ్చే పాటలు, పద్యాలు ఎక్కువగా రచింపబడని యీ రోజుల్లో యీ యత్నం హర్షించదగి యున్నది. ఇతివృత్తం నిత్యజీవితంలోంది. అందువల్ల పిల్లలమనస్సు వెంటనే వీటిని పట్టించుకుంటుంది.

౬. ఇది కూడా పై పుస్తకమును పోలినదే. ఇందులో ౩౬ పాట లున్నవి. పిల్లలకి గోచరించే విని పించే తోచే విషయాలకు సంబంధించినవి యీ పాటలు. పైన పేర్కొన్న పుస్తకమూ, యిదీ పిల్లలకు నైసర్గికమైన భాషలో వ్రాయబడి రమ్యంగా ఉన్నవి.

8. మన పాతపాటలు కొన్ని యిందు కూర్చబడినవి. ఇందులో కూర్చబడిన పాట లెంత మేలైనవో కూర్పరియొక్క పీఠిక అంత మేలై రాణిస్తున్నది. మన పల్లెపాట లన్నీ యేరి సంతరించి కూర్చి ప్రకటించవలసిన కార్యం విశ్వకళాపరిషత్తువారో, మరే పరిషత్తువారో స్వయంగా చేయవలసినది చేయకపోగా అభిమానులైన వ్యక్తులు యితర సదుద్యమాలు యీ రీతిని నిర్వహిస్తున్నట్లే దీనినిన్నీ భావించవలసివచ్చింది. కర్తవ్య మేమో స్తరుకో, యేపాటిదో యీ పుస్తకం తెలియబరుస్తుంది. ఆంధ్రుల జీవితచరిత్ర, అనుభవములు, ఊహాలు, ఆశయములు అన్నీ మన పల్లెపదాలు మున్నగువానిలో ప్రతిబింబించి ఉన్నవి.

శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావుగారి యీ యేడుపుస్తకాలు చదివినవారికి వ్యావహారిక భాషా రచనలో ఉండేసొంపు, సొబగు, భావాన్ని స్వచ్ఛంగా వెలువడేచే శైలి అవగతము కాగలవు. మనకు యింకా యింకా యిలాంటి పుస్తకాలు అనేకం అన్ని విషయాల మీదా లభ్యంకావాలి. వాడుక భాషలో భావం వ్యక్తం చేసికొనే భాషాసామగ్రి అందులో లేదనే వారు ఈ పుస్తకము చదవాలి. గ్రాంథికం రాయ తలచుకున్న వారు ఎలా భాషావ్యవసాయం చేస్తూ లో వాడుక భాష. రాయదలచుకున్నవారును అందుకు తగిన కృషి చేయాలి. పూర్ణానుస్వారా లధికంగా ఉన్నమాత్రాన వాడుక భాష కాజాలదు. ఈతీరు రచనలో శిల్ప ముంది. ఈరోజున యీ గ్రంథాలను తిరిగి పరిష్కరించే యెడల గ్రంథకర్తలు కొన్ని మార్పులు చేయుదురని నా విశ్వాసం. వాడుక భాష జీవిస్తున్న భాష. విలాసం, వికాసం దానికి పరిపాటి. కామేశ్వరరావుగారు కలువలువంటి రచనలింకా వెల్లడిస్తారని కోరిక.

వ. వ.

---

## హిందూమతము

రచయిత: శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు, ఎం. ఏ., ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. వెల రు ౦-౧౨-౦.

సంస్కృతభాషాపరిచయం బొత్తిగా లేకపోవడంచేత కేవలం ఆంగ్ల భాషావేత్తలయిన భారతీయులకు హిందూమతమందలి కట్టుబాట్లూ, వర్ణవ్యవస్థలూ, ఆశ్రమధర్మాలూ మొదలయిన వన్నీ చాలా విపరీతంగా కనిపిస్తవి; వర్తమానకాలానికి ఎంత మాత్రమూ తగవని వారి యంతరాత్మ చెప్పుతూ ఉంటుంది. అందువల్ల వారు తమ మతసంప్రదాయములను సమర్థించుకొనలేకా, ప్రతికక్షులకు నూటిగా సమాధానా లియ్యలేకా, స్వమతమును వదలలేకా అటూ ఇటూ కాని ఆందోళితమనస్కులై ఉంటారు. అట్టివారి కీ గ్రంథము బాగా వుపయోగిస్తుంది. ఈ పుస్తకం చదవడంవల్ల హిందూమతములోని ప్రతి కట్టుబాటూ విజ్ఞానానికి అనుకూల మయిందనీ, ఇది కేవలం భారతవర్షానికి మాత్రమే వర్తమానకాలానికో, లేక భూతానికో, లేక భవిష్యత్తుకో గాక సార్వభౌమికమై త్రికాలాలకుగూడా వుపయోగయోగ్యమైనదని తేటతెల్లమౌతుంది. పాఠకులు ముఖ్యంగా రెండవ అధ్యాయాన్ని చదివి, అందలి సంగతులు బాగా జ్ఞాపక ముంచుకొని గ్రంథము చూస్తూ చదువుకోవాలి. ఎందుకంటే ఈ రెండో అధ్యాయంలో నవీన నాగరకు లనబడే సంస్కృత భాషాపరిచయం లేనివారికీ ఇతర సనాతనులకూ కలిగే వాద వివాదాల్లో సంభవించే సందేహాలకన్నింటికీ చాలావరకు సమాధానా లియ్యబడివున్నాయి. అదేప్రకారం ఆంగ్ల భాష తెలియని కేవల సనాతనులకుగూడా ఇది మిగుల ఉపయోగకరమైన గ్రంథము. కాబట్టి పైని చెప్పిన రెండు తెగలవారికి గూడా ఇది పఠనీయమే.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.



గ్రామజీవనము

చిత్రకారుడు : శ్రీ. కేశవరావుగారు.